

కవిరాజు 125వ జయంతి సందర్భంగా
కవిరాజు త్రిపురనేని ఫౌండేషన్,
తెనాలివారు అందిస్తున్న చిరు కానుక
ఈ పుస్తకం



# వచనసూతపురాణం-1

(కవిరాజు త్రిపురనేని సూత పురాణానికి

వ్యావహారిక భాషారూపం)

బి. రామకృష్ణ



పీకాక్ క్లాసిక్స్ • హైదరాబాద్

# సూత పురాణం-1

***Sootha Puranam,*** prose version of ***Kaviraju, Tripuraneni Ramaswamy,***
***rendered by late Sri B. Ramakrishna,***
published by **Peacock Classics,** Publication wing of **People's Trust**

**Cover Design: Surya Chandra**

Publication No: 65


First Published in 2011
Hyderabad, Andhra Pradesh, India

Printed at Rainbow Print pack, Hyderabad

Sole Distributors: Visalaandhra Publishing House, Hyd.

Address for Communication
G2, BLOCK NO. 6, PANCHAVATI, PRAGATHI NAGAR,
OPP. JNTU, KUKKATAPALLY, HYDERABAD - 90

EDITOR, PEACOCK CLASSICS
Phs: 98499 40791, 901020 4633, 040 2389 0328 (R)
emails: agaandhi@gmail.com, agaandhi@yahoo.co.in

# కృతజ్ఞతలు

కవిరాజు సూతపురాణాన్ని బి. రామకృష్ణగారు వచనం చేశారు. అందులో కొంత అచ్చు కూడా వేశారు. అచ్చుగాని రాతప్రతులూ ఉన్నాయి. ఈ వచన సూతపురాణాన్ని మనం వేద్దాం అని పురమాయించినవారు శ్రీ జె ఎస్ ఆర్ కృష్ణయ్యగారు. పుస్తకాన్ని సేకరించి దానిని తిరిగి కంపోజ్ చేయించి చాలా రోజులయింది. పుస్తకం వేద్దామని ప్రయత్నం చేసిన ప్రతి సందర్భంలోనూ ఏదో ఒక అడ్డంకి వచ్చింది. ఆటంకాలలో ఆర్థికపరమైనవీ ఉన్నాయి. ఆర్థికేతరాలూ ఉన్నాయి. అచ్చుతప్పులు మాకొక తలనొప్పిగా మారాయి. మేము ఊహించలేనన్ని అచ్చుతప్పులు. లెక్కపెట్టలేనన్ని అచ్చుతప్పులు. ఈ అచ్చుతప్పుల బాధ కవిరాజు గ్రంథాన్నీ వదల్లేదు. రామకృష్ణగారి వచన సూతపురాణాన్నీ వదల్లేదు. పైగా వచన పురాణాన్ని కంపోజ్ చేసినవాళ్లు తమ వంతుగా వందల సంఖ్యలో ముద్రారాక్షసాలను జోడించారు. ఎవరివల్లనన్నాగాని కొన్ని పేజీలకు పేజీలే గల్లంతయ్యాయి. అచ్చుతప్పుల్ని దిద్దడంలోనూ, గల్లంతైన పేజీలను తిరిగి సంపాదించడంలోనూ వచనంలోకి రాని పేజీలను వచనం చేయడంలోనూ ఇంకా ఇతర రూపాల్లోనూ సాయపడిన మిత్రులు కొత్తపల్లి రవిబాబు, అదృష్టదీపక్, చైతన్యప్రసాద్, ముసునూరు శివరామకృష్ణ గారలకు నా కృతజ్ఞతలు. బి. రామకృష్ణగారి అమ్మాయి అరుణగారికి, అల్లుడు సతీష్‌గారికి, రామస్వామిగారి మనుమడు త్రిపురనేని సాయిచంద్‌గారికీ, మరో మనుమడు అట్లూరి అనిల్‌గారికీ, దిద్దిన ప్రూఫులను శ్రద్ధగా కంపోజ్ చేసిన ప్రభగారికీ కృతజ్ఞతలు. ఇక జెఎస్‌ఆర్ కృష్ణయ్యగారికి కృతజ్ఞతలు చెప్పడం అంటే మాకు మేము చెప్పుకోవడమే అవుతుంది. ఇంతచేసినా ఇంకా మొండిగా పంటికింద రాయిలాగా సతాయిస్తూ అక్కడక్కడా ఓ ముద్రారాక్షసం మిగిలి ఉంటే నన్ను క్షమించండి.

**ఎ. గాంధి,**

సంపాదకుడు,

పీకాక్ క్లాసిక్స్

# మా నాన్న

నాన్న 1940 డిసెంబరు మొదటిపక్షంలో పుట్టినట్లుగా పెదనాన్న చెప్పేవారు. నాన్నమీద తాతయ్య హేతువాదతనం, నాయనమ్మ సేవాభావం, కుటుంబం జాతీయోద్యమంలో భాగమైన ప్రభావం ఉంది. అలాగే ప్రాథమిక తరగతి ఉపాధ్యాయుడి (కమ్యూనిస్టు - సీతారామయ్యగారు అనుకుంటా) ప్రభావం కూడా ఉందని నాన్న చెప్తుండేవారు. చిన్నప్పటినుండి ప్రశ్నించటం, తర్కించటం - సమాధానం దొరికేంత వరకు అన్వేషణ - అన్వయింపు ఆయన సహజలక్షణాలుగా పెద్దమ్మవాళ్ళు అంటుంటారు. 8 మంది సంతానంలో నాన్న ఆరవవారు. ఆయనొక్కరే పై చదువులు (ఎం.ఏ) చదివారు. ఆయన చేసిన ప్రతి పని వెనుక కుటుంబం అంతా తోడునీడగా ఉన్నారు. అలా అందర్నీ కలుపుకుని వెళ్ళటం - వ్యక్తులలోని తప్పొప్పులను ఎంచకండా సంఘటన, సమస్య యొక్క తీవ్రతను, అవసరాన్ని గుర్తింపచేయటం ఆయనలోని ప్రత్యేకత. ఆయన దగ్గర ఒక్క పైసా లేనపుడు చింతించింది లేదు, లక్షల రూపాయలు ఉన్నపుడు లెక్కచేసిందీ లేదు. డబ్బులు కొన్ని అవసరాలకే అంటూ డబ్బు వ్యామోహపు అంచులను కూడా తాకనీయలేదు ఆయన.

కొండవీటి వెంకటకవి తాతయ్యకి శిష్యుడు అవటం వలన హేతువాద, నాస్తిక ఉద్యమాల పరిచయం కలిగింది. స్వతహాగా చిన్నప్పటినుంచీ ఆయన లౌకికవాదే. త్రిపురనేని రామస్వామిగారి ఉద్యమ కార్యాచరణ ప్రభావం ఆయన మీద ఉంది. నిరంతరం చదువుతూనే ఉండేవారు - నడుస్తున్న గ్రంథాలయంలా. సంస్కృత వ్యాకరణంలో దిట్ట ఐన నాన్న శతావధానాలు కూడా చేసినప్పటి సంగతులు గుర్తుచేసుకుంటూ ఉండేవారు. చదువుకునే రోజుల్లోనూ, ఉద్యోగం చేస్తున్న రోజుల్లోనూ విషయపరిజ్ఞానవంతులై ఉండటం వలన - వాగ్ధాటి, తనదైన శైలిలో పద్యగానం, రచనలు చేయటం - ఉపాధ్యాయులలోనూ తనకో విశిష్టతతో ఉండేవారు.

1964లో మొదటిసారి తాండూరులో తెలుగు పండిట్‌గా ఉద్యోగం చేశారు. బిజెపి వాళ్ళ ప్రభావం ఎక్కువగా ఉండే ఆ ప్రాంతంలో నాస్తిక, హేతువాద భావాల ప్రచారం మొదలుపెట్టి 1980లలో అక్కడ రాష్ట్రస్థాయి మహాసభలను నిర్వహించారు. కొంతకాలం తాడికొండ సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేశారు. నాన్న వ్యక్తిత్వం, తాత్విక విశిష్టతల వల్ల ఆంధ్రా యూనివర్సిటీ వి.సి. బుల్లయ్యగారికీ, దోణప్పగారికీ ప్రీతిపాత్రుడు అయ్యారు. నంస్కృత కళాశాలలో బ్రాహ్మణిజం రాజ్యమేలుతున్న ఆ రోజుల్లో బ్రాహ్మణేతరులంతా తల ఎత్తి ధీటుగా ఉండే వాతావరణాన్ని నాన్న కల్పించారని ఆయన శిష్యులు చెప్తుంటారు. 1969 మే 28న తను ఇష్టపడి ఎంచుకున్న మా అమ్మ గృహలక్ష్మిని

కొండవీటి వేంకటకవి తాతయ్య, గోరా తాతయ్యల సమక్షంలో వివాహం చేసుకున్నారు. కూరగాయల దండలు, సహపంక్తి భోజనాలతో జరిగిన ఆ పెళ్ళినాటికి అమ్మకి నాస్తిక, హేతువాద భావాల గురించి ఏమీ తెలియదు. ఆ తర్వాత నాన్న వెంట మీటింగులకు వెళ్ళటం, ఇంట్లో జరిగే చర్చల వాతావరణం - 3, 4 సం॥లలో అమ్మ తనకు తానుగా గాజులు, గొలుసులు వంటివి తీసేసి ఉద్యమంలో భాగమయింది.

మేం పుట్టిన తర్వాత, అప్పటికే అశాస్త్రీయ పాఠ్యాంశాల పట్ల ఉన్న వ్యతిరేకతతో తాడికొండ సంస్కృత కళాశాలకు రాజీనామా ఇచ్చి సొంతంగా స్కూలు ప్రారంభించారు. 1974లో ప్రారంభమైన అప్పటి స్కూలు పేరు ప్రగతి విద్యావనం. ఎమర్జన్సీ కాలంలో తరిమెల నాగిరెడ్డిగారు షెల్టర్ తీసుకుంటూ స్కూలు కరికులం, భవిష్యత్తు గురించి చర్చించుకున్నారంట. ఎన్నో ఒడిదుడుకులు, ప్రకృతి వైపరీత్యాలు - స్కూలు ఉప్పెన తుఫానులో కూలిపోయింది. ఇద్దరు పిల్లలు, మాష్టర్లు చనిపోయారు. దేవుడు లేడని చెప్తున్నారని గిట్టనివాళ్ళు 4, 5 సార్లు స్కూలు పాకల్ని తగులబెట్టారు. ఐనా ఎక్కడా నాన్న వెనుదిరిగి చూడలేదు. ఏమాత్రం ఆశాజనకంగా లేని - అడుగు ముందుకు వేయలేని పరిస్థితుల్లో కూడా వెనుకడుగు వేయని దృఢత్వం ఆయనది. స్కూల్లో త్రిపురనేనిగారి పుస్తకాలన్నీ మా తెలుగు పాఠ్యగ్రంథాలు. ఫ్రాన్స్, రష్యా, చైనా విప్లవ చరిత్రలు - భారతదేశ చరిత్ర - రాహుల్ సాంకృత్యాయన్, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ లాంటివారి పుస్తకాలు మాకు చరిత్ర పాఠాలు. అవిగాక ప్రతి బుధవారం సెలవు. ఆటవిడుపుగా ట్రెక్కింగ్‌లు, పిక్నిక్‌లు వెళ్ళేవాళ్ళం. ప్రతి మంగళవారం మధ్యాహ్నం గ్రామాలకు వెళ్ళటం - పరిస్థితులు అధ్యయనం - మేమే గమనించిన విషయాల గురించి ఉపన్యసించటం - సమీక్షలు రైలుబడిని, సమ్మర్ హిల్‌ను, పిల్లలకే నా హృదయం అంకితంను కలబోసుకుంటున్నట్లుండేది. స్కూలు, ఉద్యమం, కుటుంబం - ఏవీ వేటితో విడదీయలేని బంధంగా ఆచరణ రూపంగా ఆయన జీవితం పరిపూర్ణమయింది.

ఎప్పుడూ కులాంతర వివాహాలు జరుగుతూ ఉండేవి. కొన్నివేల వివాహాలకు మేం పెళ్ళిపెద్దలం. అలాగే రీసెర్చ్ స్టూడెంట్స్‌కి గైడ్‌గా, ఎంతోమందికి డాక్టరేట్లకి ఆయన లైబ్రరీ ఉపయోగపడింది. బాణామతి - చేతబడులు, మూఢనమ్మకాలకి వ్యతిరేకంగా రాష్ట్రం అంతా ఏదో ఒక కార్యక్రమం జరుగుతూనే ఉండేది. పుట్టపర్తి సాయిబాబా శిష్యుడైన స్వామినాథంను రాష్ట్రం అంతా త్రిప్పి బాబాల బండారాన్ని బట్టబయలు చేశారు. ఎమర్జన్సీ కాలంలో ఎ.టి. కోవూరుగారితో జరిపిన ప్రపంచ నాస్తిక మహాసభలు అన్ని ఉద్యమాలకీ ఆశ్రయమిచ్చింది. పాలకులు మతోన్మాదాన్ని వాళ్ళ రాజకీయ ఆయుధంగా వాడుకుంటూ 'రామజన్మభూమి-బాబ్రీ మసీదు' విధ్వంసాన్ని సృష్టించినపుడు నాన్న ఒక్కరే దీటుగా 'శంభుక రథయాత్ర'ను నిర్వహించారు. నాస్తిక సమాజం, సభలు, కార్యక్రమాలు,

ఇతర సంఘాల సభలు కార్యక్రమాలతో ఎప్పుడూ తీరిగ్గా ఉండని ఆయన - పిల్లలు సొంత ఆస్తిగాదని, మానవసమాజ సంపద అంటూ స్కూలులో ఉన్న అందరి పిల్లలతో పాటుగానే మమ్మల్ని పెంచారు. అన్నిరకాల వామపక్ష సంఘాల్లోనూ నాన్నకి శిష్యులున్నారు. వాళ్ళందరి సమావేశాలకి - నిర్బంధాల సమయాల్లో కూడా ఆశ్రయమిచ్చారు. విగ్రహారాధనని వ్యతిరేకించే నాన్న చార్వాకాశ్రమంలో భారతదేశ భౌతికవాద తత్వవేత్తల విగ్రహాలను ఆవిష్కరించారు. మనదైన భావజాలాన్ని ప్రచారం చేసుకోవటానికి ఒక నమూనాగా వాటిని ఏర్పాటుచేశామని - పూజకు కాదని ఒక టి.వి. ఇంటర్వ్యూలో చెప్పారు. ఆయన మొదటినుండి తపన పడిన 'ప్రత్యామ్నాయ విద్య, సంస్కృతి' కార్యక్రమాన్ని విస్తరిస్తూ భౌతికవాద కుటుంబాల సమ్మేళనం 'నాస్తికమేళా'ను 1992లో ప్రారంభించారు. ఇప్పటికీ కొనసాగుతుంది. విరామమెరుగక పరిశ్రమించిన ఆయన అనారోగ్యంతో 2007, ఏప్రిల్ 18న చనిపోయారు. 2007 ఫిబ్రవరిలో జరిగిన నాస్తికమేళాలో కూడబలుక్కుని మాట్లాడుతూ - "కొంతమంది, వాళ్ళని నేను చేరనివ్వలేదని అంటుంటారని - అటువంటి ఉద్దేశ్యం తనకి ఎప్పుడూ లేదని, కార్యక్రమాలు జరపటమే లక్ష్యమని, ఎవరినైనా నొప్పిస్తే క్షమించమని - భౌతికవాద, ప్రజాసంస్కృతి ప్రచారం చేస్తూనే ఉండమని" పిలుపునిచ్చారు. ఇన్ని వత్తిడులు, పనుల మధ్య - భారతీయ తత్వశాస్త్రంలో పట్టు ఉన్న ఆయన రాయవలసినంత రాయలేకపోయానని బాధపడేవారు. చివరిరోజుల్లో నేను చెప్తా - రాయమ్మా అనేవారు. నాన్నవి ముద్రితమైన 25 పుస్తకాలున్నాయి: అవి - గాంధీశతకం (1965), చార్వాకుడు నాటకం (1970), గుడ్డినమ్మకాల గుట్టుమట్టులు (1970), మూఢవిశ్వాసాల - వనకుఠారం (1970), నాస్తికత్వ సిద్ధాంతం (1972), మతమంటే ఏమిటి? (1978), అరెరె - రంగనాయకమ్మగారూ, మీకూ నాస్తికత్వం తెలుసా? (1980), వేమన విప్లవం (1981), చార్వాక శతకం (1983), చార్వాక తెలుగు వాచకాలు 1-5 (1983), రామజన్మభూమి వివాదం - వాస్తవాలు (1990), సంజయ రాయబారం (1993), వేమన నాస్తికత్వం (1994), చార్వాకం (1994), జంబుకుడు నాటకం (1995), వచన సూతపురాణం 1, 2 (1995), వచన గబ్బిలం (1996), ఉత్తర గబ్బిలం (1997), ప్రశస్తపాదుడు నాటకం (2001), జ్యోతిష్యం శాస్త్రమా? (2002), నేతబిడ్డ (2003), బి. రామకృష్ణ రచనలు (2006), బాలరామాయణం (2010) ఇవన్నీ ముద్రితాలు. అందుబాటులో ఉన్నాయి. ఇవిగాక కొన్ని అముద్రితాలూ ఉన్నాయి.

**అరుణ**

# మనవి

జనవరి 15, 1887లో జన్మించిన శతావధాని, "కవిరాజు" త్రిపురనేని రామస్వామి బార్-ఎట్-లా, 56 సంవత్సరాలు జీవించి 1943 జనవరిలో 16న విషజ్వరం సోకి గతించారు. చనిపోయేనాటికి అన్నపూర్ణమ్మ, (నాకు అమ్మమ్మ) వారి ప్రక్కనే ఉండి సేవలు చేసుకుంటూనే ఉంది. కవిరాజుగారి ఆఖరి కుమార్తె నా తల్లి, చౌదరాణి. పిచ్చేశ్వరరావు గారు నా తండ్రి. గోపీచంద్ రామస్వామి మొదటి సంతానం. తరువాత సరోజినీదేవి. గోకుల్‌చంద్ మూడవవారు. వారెవ్వరూ మనమధ్య లేరు.

రామస్వామి వ్రాసినవి తక్కువ కాని వాసిలో మిన్న. తెలుగువారికి "ఎందుకు" అని ప్రశ్నించడం నేర్పిన రామస్వామి సాహిత్యం, తెలుగుజాతి మేధకు పదునుపెట్టింది. కొంతమంది ఇతరుల వలే కవిరాజు తన హేతువాదాన్ని బలవంతంగా ఎవరిమీదా రుద్దలేదు. ఎవరికీ అంటగట్టనూ లేదు. తన భావాలని తెలియపరచడానికి మాతృభాష తియ్యని తెలుగునే వాడుకున్నారు. చక్కని తేట తెలుగు పద్యాన్ని అల్లుకున్నారు. తెలుగువాడి దేశాభిమానాన్ని ఉరకలెత్తించే గేయాలని ఎలుగెత్తి పాడారు. ఆలోచింపజేసే సుదీర్ఘమైన పీఠికలను వ్రాసారు. బార్-ఎట్-లా చదువుకోవడానికి ఐర్లండ్ వెళ్ళారు. తెలుగు కట్టుతో తెలుగువాడిగానే వెళ్ళారు. అదే కట్టుతో తెలుగువాడిగానే మళ్ళీ ఆంధ్రదేశానికి వచ్చారు.

"కవిరాజు తన సమకాలీన సామాజిక రుగ్మతలని, మతమౌఢ్యాన్ని, ఛాందసవాదాన్ని, దురాచారాలని ప్రజాహితం కోసం తాను త్రికరణశుద్ధిగా నమ్మిన హేతువాదంతో దునుమాడడానికి, ఆనాటి దేశకాల పరిస్థితులకి అనుగుణంగా సాహితీ రచనలనే తన ఆయుధంగా ఎంచుకున్నారు. వారి కాలానికి ఆ సాహిత్యం సరిపోయినది. భావితరాలకి ఆ సాహిత్యాన్ని అందించడం ఎలా? దానికోసమే, వారి భావజాలాన్ని విస్తారంగా ప్రచారం చెయ్యడానికి మద్రాసు (చెన్నై)లో కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి ఫౌండేషన్ ఏర్పడింది. అప్పట్లోనే నాకు ఆలోచన ఉండేది. వచనంలో వారి సాహిత్యాన్ని పాఠకులకు అందించాలి, తద్వారా కవిరాజు హేతువాదాన్ని భవిష్యత్ తరాలకు అందజేయాలని.

2007 మే 6న మొదటిసారిగా గుంటూరు దగ్గిర, నిడమర్రు గ్రామంలోని చార్వాక ఆశ్రమానికి వెళ్ళాను. ఆ రోజున రామకృష్ణగారి సంవత్సరీకం జరపడానికి సాహితి మిత్రులు నిర్ణయించారు. రామకృష్ణగారిని జీవించి ఉండగా కలవడం అంటూ కుదరలేదు. కనీసం ఈ సభకైనా వెళ్ళాలని నిర్ణయించుకున్నాను. మా అమ్మతో కవిరాజు సాహిత్యం మీద వారి ఉత్తర ప్రత్యుత్తరాలు గురించి నాకు తెలుసు. అలాగే వారి ఆశ్రమం గురించి కూడా విని ఉన్నాను. నా జీవితంలో మే 6 తేదీకి మరొక ప్రాముఖ్యత కూడా ఉన్నది. హృద్రోగంతో మా అమ్మ మరణించినది మే మాసంలో అదేరోజున (1996లో).

రామకృష్ణగారు శ్రీ గోగినేని కనకయ్య ఓరియంటల్ కాలేజి, తాడికొండలో ప్రధాన అధ్యాపకుడిగా పనిచేశారు. సంస్కృతపండితుడు, హేతువాది. సంఘసంస్కర్త. సంఘవిద్రోహులు అనేకమార్లు తన చార్వాక ఆశ్రమాన్ని తగలబెట్టినా కూడా 'మడమతిప్పని తెలుగు'వాడిగా ఆశ్రమాన్ని అనేక వ్యయప్రయాసల కోర్చి నిర్వహించిన ఘనులు. కవిరాజు భావజాలాన్ని ఔపోసన పట్టినవారు. వారికి కూడా కవిరాజు సాహిత్యాన్ని వచనంలో వ్రాసి ప్రజలని చైతన్యవంతులని చేయాలని కోరిక.

కవిరాజుగారి మాటల్లో, ".... పురాణము లెంతవఱకు వేదమునకు ననుకూలములో, నెంతవఱకు బ్రతికూలములో, నెంతవఱకు నీతిబాహ్యములో, యెంతవఱకు బక్షపాత భూయిష్టములో మెుద్దుపుగన్నుతోనున్న విద్వల్లోకమునకు జూపించు తలంపుతో సూతపురాణము రచింపబడినది".

అటువంటి సూతపురాణం అందరికీ అందుబాటులో ఉంచడానికి రామకృష్ణగారి "వచన సూతపురాణం" వెలువడింది.

ఇక నేటి తరానికి తెలియజేయవలసినది మరొకటి ఉంది. వివాహ విధి.

కవిరాజు శిష్యులలో మరొకరు కన్నెగంటి జగ్గయ్యగారు. వారిని గురించి తెలుచుకునేవారే లేకపోతిరి.

**కవిరాజు ఇతర రచనలు:**

- సూతపురాణము
- శంబూకవధ
- సూతాశ్రమ గీతాలు
- ధూర్తమానవ శతకము
- ఖూనీ
- భగవద్గీత
- రాణా ప్రతాప్
- కొండవీటి పతనము
- కుప్పుస్వామి శతకము
- గోపాలరాయ శతకం
- పల్నాటి పౌరుషం

# ప్రముఖుల దృష్టిలో కవిరాజు

1920-40 దశకాల్లో భావవిప్లవదిశగా కృషిచేసిన దక్షిణాది ప్రముఖుల్లో కవిరాజు త్రిపురనేని పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది.

- భారత ఉపరాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్

* * *

మానవాళి ఒకటే ఒకటి. ఇదీ కవిరాజు రామస్వామి నమ్మకం.

- డా॥ హబీబుల్లా (మాజీ మేయర్, చెన్నై)

* * *

మాకు ఒక రామస్వామి; మీకొక రామస్వామి; వారిద్దరూ మన రామస్వాములే. వారి పేర్లలోనే కాదు, వారి మనసుల్లో కూడా ఏకత్వం కనబడుతుంది. ఇద్దరూ సాంఘిక విప్లవ యోధులే, వారి ఆలోచనా విధానాలతో, హేతువాదం ప్రాతిపదికగా అన్ని పార్టీలవారు సమైక్యంగా కృషిచేద్దాం.

- అన్నాదురై

* * *

నా చేతమునందు నచ్చిన సుశిష్యులలో నితడొక్కడౌటచేతనే చేతును వీని కాశిషము శేష శుభంములు గల్గునట్లుగన్. సూతపురాణ కల్పనకు సూరుల సూయమ కొంత లోగియున్ చేతమునందు మెత్తురని చెప్పుదు సందియమంద లేశమున్.

- చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

* * *

రామస్వామిగారు హేతువాద, శాస్త్రీయ దృక్పథాలతో విప్లవగీతం ఆలపించారు.

- దేవులపల్లి కృష్ణశాస్త్రి

* * *

హేతువాద యుగంలో కవులందరికీ ఆదిపురుషుడు త్రిపురనేని రామస్వామి చౌదరి. ఆయన సూతపురాణమొక మహాగ్రంథం. ఆయన పద్యరచనా శైలి ఎంతో మనోహరంగా ఉంటుంది. భావాలు పురాణాలకు వ్యతిరేకం. మొదట విప్లవం తెచ్చింది ఆయన.

- విశ్వనాథ సత్యనారాయణ

* * *

అవినీతిని అవంతయినా సోకనీయక, అవిశ్రాంత పోరాటం సాగించిన సాంఘిక విప్లవయోధుడు.

- తాపీ ధర్మారావు

* * *

తెలుగు సాహిత్యరంగంలో యుగపురుషుడే గాక, తన పాండితీ ప్రతిభను విశ్వశ్రేయస్సుకు ఉపయోగించిన యీ ధన్యజీవి, వేమనకు డైరెక్ట్ కజిన్.

దేవుణ్ణి ఆవలకు నెట్టి, మానవుణ్ణి కేంద్రంలో సుస్థాపితం చేయటానికి ఆంధ్రదేశంలో కవిరాజుదే మొట్టమొదటి గట్టి ప్రయత్నం.

- డా|| బెజవాడ గోపాలరెడ్డి

* * *

పుణ్యగ్రంథాలు, వాటిలో వర్ణించబడ్డ పుణ్యపురుషుల బండారం బయటపెట్టి, చివరకు నాస్తికత్వాన్ని ప్రతిపాదించిన త్రిపురనేని రామస్వామి, తరవాత జరగనున్న సామాజిక విప్లవానికి పునాదులు వేసి వెళ్ళారు. ఆయన సృష్టించిన ప్రశ్నార్థకం, ఆయన రేకెత్తించిన జిజ్ఞాస, ఆయన నేర్పివెళ్ళిన స్వేచ్ఛాయుత భావచింతన లేకపోతే సామాజిక విప్లవానికి కర్తలేదు. సాహసం లేదు. భవబంధాలు త్రెంచుకొని మనిషి బయటపడకపోతే ప్రగతిపథం లేదు. ఆ బాటలో పయనం లేదు.

- జస్టిస్ ఆవుల సాంబశివరావు

* * *

ఆంధ్రా బెర్నార్డ్‌షా త్రిపురనేని కవిరాజు. - డా|| కట్టమంచి రామలింగారెడ్డి

* * *

రామస్వామిగారిలోని భావపరిణామక్రమాన్ని అధ్యయనం చేస్తూ యువతరం మానవ విలువలతో - భావవిప్లవ పథంలో ముందుకు నడవాలి.

- ఆవుల గోపాలకృష్ణమూర్తి

* * *

ఆంధ్రదేశంలో హేతువాద సాహిత్యంలో నూతన శకాన్ని సృష్టించిన ప్రజ్ఞాశాలి కవిరాజు.

- గుర్రం జాషువా

* * *

...ఆయన సంపూర్ణ మానవతావాది. మాటల్లో, చేతల్లో హేతుబద్ధమైన జీవనమార్గాన్ని అనుసరించిన మహాపురుషుడు. తెలుగు సాహిత్యంలో మూఢవిశ్వాసాలను తూర్పారబోసిన తొలికేక వేమనదైతే, మలికేక త్రిపురనేనివారిది.

- డా|| సి. నారాయణరెడ్డి

* * *

నటుడుగా నాకున్న పరిజ్ఞానంతో పోలిస్తే, కవిరాజు నాటకాలు మహోదాత్తమైనవి. శక్తివంతమైన సంభాషణలు వ్రాయగల నాటకకర్తలలో కవిరాజు ప్రథమశ్రేణికి వస్తారు.

- బళ్ళారి రాఘవ

* * *

నీ రచనాభిఘాతమున నేటికపార పురాణ గోపుర
ద్వారకవాట పంక్తులు బదాబదలైనవి.
కృతులెందరు వ్రాసిరి, వ్రాయుచుండిరా
పోకడలార్య వాఙ్మయ ప్రభుత్వ పతాకమలన్ కదల్చెనా?

- ఏటుకూరి వేంకటనరసయ్య

* * *

రామస్వామి 'భగవద్గీత' ప్రచురణతో గీతాహృదయం బ్రద్దలయ్యింది. భగవానుడు హాస్యాస్పదుడయ్యాడు.

- జి.వి. కృష్ణారావు

* * *

జాతీయమైన శుద్ధాంధ్రమును వ్రాయగలవాడు తిక్కన తర్వాత కవిరాజే.

- ఉన్నవ లక్ష్మీనారాయణ

* * *

కొత్తసంఘాన్ని నిర్మించుకోవాలంటే, ముందుగా కొత్త ఫిలాసఫీని రూపొందించుకోవాలి. ఈ విషయాన్ని రామస్వామిగారు పదే పదే చెప్పారు; పద్యం ద్వారా చెప్పారు; గద్యం ద్వారా చెప్పారు; పురాణాల ద్వారా చెప్పారు; నాటకాల ద్వారా చెప్పారు; సభావేదికల్లో చెప్పారు; రాజకీయ శిబిరాలనుండి చెప్పారు; వివాహ మండపాల నుండి చెప్పారు.

- నార్ల వెంకటేశ్వరరావు

* * *

ఈనాడు రాముడు దేవుడా? అనే ప్రశ్న రామస్వామిగారు వేయనక్కరలేదు; పదేళ్ళ కుర్రవాడు వేస్తాడు; కారణం రామస్వామిగారే. ఆయన వాక్శూరులు కారు; కార్యశూరులు.

- చక్రపాణి

* * *

సూతపురాణమును బోలు మరియొక సృష్టి యింతవరకును ఉత్పన్నము కాలేదు, కాబోదు, సంస్కృతాంధ్ర పురాణములలోని అభూతాంశములు, స్వకపోల కల్పిత గాథలు సూతపురాణములో గోచరించవు. ఇందులో కవిత సుధామధురము. మొత్తము గ్రంథమొక అమృతఝరి. తెలుగు సాహితికొక నూతన సృష్టి కొత్తవెలుగు. ఇలాంటి ఉత్తమ పౌరాణిక విమర్శనా గ్రంథములు ఆంధ్రులకు ప్రసాదించిన రామస్వామి చౌదరిగారికి పౌరాణిక ప్రపంచమున వాల్మీకికిని, వ్యాసునికి గల స్థానము కలదు.

- కాశీనాధుని నాగేశ్వరరావు

* * *

నాకూ, కవిరాజుగారికి చాలా పోలికలున్నాయి. దేనికీ భయపడకపోవటం మా యిద్దరి ప్రకృతి. ప్రజలను సత్యపథంలో నడిపించటానికి ఆయన కవిత్వం చెప్పారు; నేను వచనం చెప్పాను.

– కోటంరాజు రామారావు

❁ ❁ ❁

మతం, అస్పృశ్యతల్ని నిరాకరించాడు; మూఢనమ్మకాలు వద్దన్నాడు; మంత్రతంత్ర కుతంత్రాలను ఎదిరించాడు; మానవ సమానతను గట్టిగా ప్రతిపాదించాడు; స్త్రీ పురుష సమానతను కోరాడు; అన్నిటినీ శాస్త్రీయ పరిశీలనతో పరిష్కరించుకోవాలి అన్నాడు. మంచి చెడుల విచక్షణతో వ్యవహరించాలని కోరాడు. మానవ విలువల మార్గదర్శకుడు కవిరాజు.

– రావిపూడి వెంకటాద్రి

❁ ❁ ❁

'భగవద్గీత' వంటి మహోత్తమ గ్రంథాల ద్వారా చైతన్యం కలిగించి ముందడుగు వేయించిన రామస్వామికి తరతరాలు ఋణపడి వుంటుంది. ఆంధ్రసాహిత్యంలో వ్యంగ్యోక్తిని అత్యంత ప్రతిభావంతంగా వాడుకున్న మహాకవి ఆయన.

– శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

❁ ❁ ❁

దేవుడి ముఖం నుండి ఊడిపడినవారు ఇతరుల్ని సమభావంతో చూడటానికి ఎలా ఒప్పుకుంటారు? కవిరాజుగారి యీ ప్రశ్నకు నాటికీ-నేటికీ-ఏనాటికీ ఏది జవాబు?

– ఆర్. జ్యోత్స్న

❁ ❁ ❁

హేతువాదానికి పరాకాష్ఠ సమగ్ర మానవీయత; కవిరాజు దీన్ని అందుకోగలిగారు. ఆయన నాస్తికత మానవీయతగా పల్లవించింది. పురాణవైరి చివరకు మానవ మిత్రుడయ్యాడు.

– కె.వి. రమణారెడ్డి

❁ ❁ ❁

"మతమను మాట మోసము సుమీ యిదె మూలము ధర్మపీడకున్". కవిరాజు యీ పలుకులు సాంఘిక ప్రతీపశక్తులకు ములుకులు.

– కె. జయశ్రీ

❁ ❁ ❁

సృష్ట్యాది కులంబులున్ లేవు. మనుషులందరు ఒక్కటే తారతమ్యమున్ లేదు; విశేష ధర్మములు లేవు, దరిద్రులు, విత్తవంతులన్ భేదము లేదని చెప్పిన కవిరాజు మాటలు మననీయాలు. – సిద్ధార్థ

❋ ❋ ❋

హేతువాదం లేని కళగాని, జీవితంగానిశుష్కం అన్నారు నవ్యకవులు. ఇందుకు రామస్వామి బీజాలు నాటారు. – యస్ నారాయణబాబు

❋ ❋ ❋

బ్రహ్మ భగవద్గీత వెలువడినంతవరకైనను పామరజనములో ప్రచారము చేయగలిగిన కవిరాజు ఆశయము కృతకృత్యమైనట్లే భావించవచ్చు.

– కోగంటి రాధాకృష్ణమూర్తి

❋ ❋ ❋

యుగపురుషుడు త్రిపురనేని రామస్వామి వ్యక్తిత్వంలో ఏ ఒక్క అంశమైనా మనదిగా చేసుకున్న రోజది మంచిరోజుగా ఎంచుకోవచ్చు. – యం.వి. రామమూర్తి

❋ ❋ ❋

కవిరాజు రామస్వామి ఒక వారసత్వానికి ప్రతినిధి. తెలుగునాట వేమనతో ప్రారంభమైన ప్రగతి ఉద్యమంలో పూర్తిగా సేదదీరినవాడు కందుకూరి వీరేశలింగం సాంఘిక తిరుగుబాటును సమర్థిస్తూ, ఆ ఉద్యమాన్ని సర్వతోముఖంగా విస్తరింపజేసి, తాత్విక భావపరంపరను బహుధా సృష్టించినవాడు కవిరాజు. – ఎ.జి.కె.

❋ ❋ ❋

ఎచ్చులొచ్చులు లేని ధర్మాన్ని ప్రబోధించి, మానవతకు, నీతికి పట్టం కట్టిన మహామనీషి కవిరాజు. స్థితప్రజ్ఞతతో భాషాయోషకు నూతన భావాలు సమకూర్చిన హేతుధర్మం కవిరాజుగారిది. – బి.జె. శామ్యుయేల్

❋ ❋ ❋

కవిరాజు నాస్తికుడా, ఆస్తికుడా అన్నవారు “ఖూనీ” ఉపోద్ఘాతాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. – గోపరాజు సాంబశివరావు

❋ ❋ ❋

కవిరాజు సాంఘిక విముక్తి ఉద్యమానికి ఊపిరి. ఆయన జీవితమే ఓ మహోద్యమ స్రవంతి. – కె. సుజాత

ఇరవయ్యో శతాబ్దపు సాహితీ దిగ్దంతులలో రామస్వామిగారొకరు.

– పింగళి లక్ష్మీకాంతం

❋ ❋ ❋

లోకానికి యిష్టమైనా, కష్టమైనా లక్ష్యం చేయకుండా స్వభావసిద్ధంగా స్వధర్మం వ్యక్తం చేసిన వ్యక్తి కవిరాజు. - వేలూరి శివరామశాస్త్రి

* * *

తెలుగు సాహిత్యంలో కనివిని ఎరగని వ్యంగ్యరచన కవిరాజుకు దక్కింది.

- యన్.వి. బ్రహ్మం

* * *

ఉన్న పరిస్థితులపై రోత పుట్టకపోతే, దాన్ని ప్రతిఘటించడం జరగదు. కొత్తది అవతరించనూ అవతరించదు. ఈ పరిస్థితిలోనే రామస్వామిగారు సాహితీలోకంలో అవతరించారు.

- జలసూత్రం రుక్మిణీనాధ శాస్త్రి

* * *

ఆధునికయుగంలో అభ్యుదయ ధోరణికి రామస్వామిగారిని నాయకుడుగా చెయ్యడమే కాకుండా ఆయన అభిప్రాయాలను ఒప్పుకోకుండానే పద్యరచనను మెచ్చుకున్నారు విశ్వనాధ సత్యనారాయణగారు. - చేకూరి రామారావు

* * *

బూటకపు మాటలు మాటుకు త్రోసిన సూతాలయం కవిరాజు గీతాలయం.

- రాటకొండ

* * *

పాండవుల విజయం న్యాయవిరుద్ధం అని రామస్వామిగారు "కురుక్షేత్ర సంగ్రామము"లో పడిన అభిప్రాయంలో పొరపాటేమీ లేదు.

- అడవి సాంబశివకవి

* * *

పరతత్వ మహత్వము నాశ్రయించెదన్ అనే కవిరాజు ధోరణి, ఆయన భావపరిణామ క్రమంలో మారింది. నిత్యనూతన ప్రక్రియలో యీ విశేషాంశాన్ని గుర్తించకుండా కవిరాజును ఆస్తికుడని చిత్రించటానికి తంటాలు పడుతూ, ఆయన ఆలోచనా పరివర్తనకు వక్రభాష్యం చెప్పేవారున్నారు. తస్మాత్, జాగ్రత్త!

- యం.డి. చైతన్య

* * *

"మూఢవిశ్వాసమున చేటు మూడుచుండు" అంటూ మూఢత్వ గాఢత్వంలో వున్న జనాలను మేల్కొల్పిన కవిరాజు మానవ మానసానికి నిధి, పెన్నిధి.

- ఎ. ఆనందకుమార్

* * *

అఖిల లోకకళ్యాణంబు సాధింప కులభేదముల మంటగలిపినాడ అంటూ చాపకూటికి తెరచాపెత్తిన నాయుడు బ్రహ్మన్న కవిరాజు రూప ప్రతిరూపం.

-పి. స్వర్ణలత

* * *

ఆయన ఏనాడూ జమీందారుల కొమ్ము కాయలేదు. ఏ ఆస్థానంలోను కాలిడలేదు, కాసుకు కక్కుర్తిపడలేదు, ఆ బ్రదుకు ఆయనకు రుచించలేదు.

- త్రిపురనేని వెంకటేశ్వరరావు

* * *

మతములె పుట్టకున్న మారణ కర్మములిన్ని సాగునే అనే మాటల బాటల్లో మనల్ని కదిలించిన నవయుగ వైతాళికుడు త్రిపురనేని.

- వివేకవర్ధన్ రామినేని

* * *

కవిరాజు రామస్వామిగారు మూఢవిశ్వాసాలవల్ల ఎలా చేటు మూడుతుందో చెప్పి, జనాలను చైతన్యవంతుల్ని చేశారు. సాంఘిక న్యాయసాధనకు జీవితాన్ని కరిగించారు. సమాజానికి కనువిప్పు కలిగిస్తూ, మానవ సమతకు మార్గం చూపారు. వారు చూపిన దారిలో నవతరం ముందడుగు వెయ్యాలి.

- డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి

* * *

మోసము వీసమునైన దాపక ఏని మహోదయమ్ము తపియించెడి జాతుల నుద్ధరించెనో - ఆతడే రామస్వామి కవివర్యుడు.

- కొండవీటి వేంకటకవి

* * *

ఒకవైపు మహిళా చైతన్యానికి, మరోవైపు మానవ విలువలకు మార్గదర్శకుడైనాడు కవిరాజు.

- మల్లాది సుబ్బమ్మ

* * *

వారిలో ప్రముఖంగా కనబడే భావాలు రెండు. ఒకటి పరాధీనమైన దేశానికి స్వాతంత్ర్యం. రెండు: సాంఘికంగా, సాంస్కృతికంగా పరాధీనమైవున్న బ్రాహ్మణేతరులకు భావస్వాతంత్ర్యం. ఈ రెండు అంశాలకే వారు జీవితమంతా శ్రమించారు.

- ఆవుల మంజులత

* * *

మానవ విలువల ప్రాముఖ్యాన్ని వివరించి, విశ్వమానవ శ్రేయస్సును కాంక్షించిన మానవతావాది రామస్వామి కవిరాజు. ఆయన లక్ష్యం కేవలం సాంఘిక సంస్కరణ కాదు; సాంఘికవిప్లవం. - కొల్లా సుబ్బారావు

* * *

ఆర్యవాఙ్మయాధికారాన్ని ప్రశ్నించిన మొట్టమొదటి ఆంధ్రుడు వేమన; రెండవవాడు కవిరాజు. - జస్టిస్ పి.ఎ. చౌదరి

* * *

సనాతనత్వంతోను, అర్థంలేని అంధ విశ్వాసాలతోను కరడుగట్టుకుపోయిన సంఘంలో ఒంటరిగా నిలిచి ధైర్యసాహసాలతో ఆశయసిద్ధికి జీవితాన్ని వెచ్చించిన వ్యక్తి రామస్వామి కవిరాజు.

- కోగంటి సుబ్రహ్మణ్యం

* * *

ఇరవయ్యో శతాబ్దం మొదటి భాగంలోనే అంగలూరులో బాలికా పాఠశాలను స్థాపించి, అందులో హరిజన బాలికలు చదువుకోవడానికి వీలు కల్పించిన ఆదర్శజీవి కవిరాజు. బ్రాహ్మణవర్గాన్ని ఆయన ఎన్నడూ దూషించలేదు. బ్రాహ్మణమత దోషాన్ని దురహంకారాన్ని దుయ్యబట్టారు. కులాల హెచ్చుతగ్గులు నిరసించారు. స్త్రీలు విద్యావంతులు కావడానికి ప్రోత్సహించారు. వివాహవిధానంలో గొప్ప మార్పు తెచ్చారు.
- రావూరి అర్జునరావు

* * *

మూఢాచారాలు, మతమౌఢ్యాలు, గ్రుడ్డినమ్మకాలు, అసలు వస్తువును వదలి దాని నీడను పట్టుక ప్రాకులాడే దృక్పథాలు, ధర్మం పేరుతో ఆచరించే అధర్మాలు, న్యాయం పేరుతో చేసే అన్యాయాలు మొదలైన చీకటిగుణాలన్నిటి మీద కవిరాజుగారు గొప్ప తిరుగుబాటుదారు. ఆయన హేతువాది. మానవతావాది, ప్రగతివాది - మాటల్లోనే కాదు, చేతల్లో కూడా, ఆలోచనా రీతిలో, జీవననీతిలో కూడా.

- సంజీవదేవ్

* * *

కత్తికి కోరి బాసికము కట్టిన నీ కవితా వధూటి నో
రెత్తిన దుష్టభావములనెల్ల లగాలగి చేసి చెప్పుతో
నెత్తిన మొత్తి పంపె మరి నేటికి జంకులు చన్న గుండెలో
ఎత్తెను విప్లవ ధ్వజమభీప్సిత పద్ధతి సిద్ధహస్తుడా. - జి.వి.కె.

* * *

కవిగా రామస్వామిచౌదరి స్వాతంత్ర్య సమరానికి చేసిన సేవ దొడ్డది.

- కొండా వెంకటప్పయ్య

* * *

స్త్రీ విద్యావంతురాలై, ఉన్నత సంస్కారవతిగా రూపొందాలనే సదాశయంతో "ఖూనీ" నాటకంలో సునీధ పాత్రను వారు తీర్చిదిద్దారు. "స్త్రీ పురుష సమానత"ను ఆదర్శంగా తీసుకుని వివాహ ప్రమాణాలు చేయించటం జరిగింది. ఆయన దృశ్యకావ్యాల్లో స్త్రీమూర్తులను ఎంతో ఉన్నతంగా, ఉదాత్తంగా రూపొందించారు. సంఘసంస్కరణలో స్త్రీ సంస్కరణ ఒక ప్రధాన కర్తవ్యంగా భావించి, అందుకు వారు ఉద్యుక్తులై అంగలూరులో ఏనాడో బాలికా పాఠశాలను నెలకొల్పి, అస్పృశ్యులనబడే బాలికలను అందులో చేర్చారు. పాతబడిపోయి పగుళ్ళిచ్చి, కూలిపోవటానికి సంఘాన్ని పునాదులతో పెకలించి, ఒక నూతన రూప ఆవిర్భావానికి నాంది పలికి, పటిష్ఠమైన సంఘసౌధాన్ని భావవిప్లవ వైతాళికుడు కవిరాజు ప్రారంభించారు.

- యస్.యన్. లక్ష్మి

* * *

వారు హేతువాద యుగానికి మూలపురుషులు, భావవిప్లవానికి అధినేత, సాంఘిక విప్లవానికి శకపురుషుడు. ఈ శతాబ్దపు మానవతావాదానికి ప్రతీక.

- డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు

* * *

ప్రామాణ్యంబులు కాని వింత కథలన్ స్వాముల్
పురాణంబులామోదించి స్వార్థమునకై అల్లాడిరంచున్
ప్రజాసామాన్యంబును మేలుకొల్పిన భవత్సాహిత్య
సంపత్తికిన్ రామస్వామి మహాకవీంద్రా, మెచ్చి కేల్మోడ్చెదన్

- రామినేని అంజయ్యచౌదరి

* * *

వాల్టేరు వంటి ప్రముఖులు దూరదృష్టితో వారి కాలమునాటి మతసాహిత్యములోని దోషములను దుయ్యబట్టి, సమాజమునకు ఎనలేని సేవచేసిరి. తెలుగు సాహిత్యములో అటువంటి కృషిసల్పినవారు రామస్వామిగారు. కవిరాజు మార్గము లోకకళ్యాణ మార్గము.

- జొన్నలగడ్డ రామారావు

* * *

స్వతంత్రమైన జీవనాన్ని ఆకాంక్షించింది ఆయన వ్యక్తిత్వం. మిన్ను తలపై పడినను

చలించనిది కవిరాజు ధీరత్వం. అసూయాద్వేషాలకు తావులేనిది ఆయన హృదయం. నైతిక విలువల్ని అనుసరించినది ఆయన నడత. - కె. సురేంద్ర

* * *

పరిహాసాన్ని, అపహాసాన్ని నిండుగా, దండిగా తన రచనల్లో చొప్పించి, ప్రజల ఆలోచనా ధోరణిలో మార్పు తేవటానికి జీవితాన్ని ధారవోసిన మహామనీషి వారు.

- కొండూరి శేష వీరేశ్వరశర్మ

* * *

బుడిగి, బుడిగి మొగమునిండ బూది పూసిన మాత్రాన కుదుటపడునె మనసు. రామస్వామిగారి యీ మాటలు వారి అన్న వేమన్నను గుర్తుకు తెస్తాయి.

- యస్. సౌజన్య

* * *

భావవిప్లవం కోసం, సమసమాజ సంస్థాపన కోసం రామస్వామిగారి కృషి అనన్యం.

- రావెల సాంబశివరావు

* * *

కవిరాజు భావధార తెలుగు లోగిళ్ళకు త్వరత్వరగా చేరాలని అనుకుంటున్నారు మిత్రులు. ఇది మంచిదే. ఆయన తాత్విక విచారధార యితర భాషా ప్రాంగణాలలో కూడా ప్రవేశించటం మరింత సముచితం. ఈ మేరకు తగిన కృషి ప్రారంభించబడవలసి వుంది. - తారుణ్య

* * *

కులం, మతం, ప్రాంతం, జాతి అన్న సంకుచిత పరిధులను దాటిన సంఘం ఏర్పడాలనేదే రామస్వామిగారి కోరిక. అలాంటి సమసమాజం కోసం, చిత్తశుద్ధితో జీవితాంతం ఆయన హోరాహోరీగా పోరాటం జరిపారు.

- నర్రా కోటయ్య

* * *

"శంబుకవధ", "ఖూనీ" యివి హేతువాదానికి ప్రోదిచేసిన రెండు నాటకాలు.

- వాసిరెడ్డి కాశీరత్నం

* * *

కుప్పుసామి శతకం కూర్చినా, సూతపురాణం రాసినా, భగవద్గీతలో బ్రహ్మనాయని సందేశం వినిపించినా, ఖూనీ నాటకం విరచించినా, వివాహవిధి నిరూపించినా ఆయన భాషలో ఒక హృదయఘోష వినిపిస్తుంది. ఎదలోని వ్యధ వెలికివస్తుంది. ఒక బోధ కనిపిస్తుంది. సత్యశోధనతో సాగిన ఒక తత్త్వ ప్రతిపాదన గోచరిస్తుంది. అధిక్షేపణ

వెనకాల ఒక ఆర్తి. అందులో కొంత హాస్యం, ఒక ఆత్మవిశ్వాసం తొంగిచూస్తాయి.

- వేటూరి ఆనందమూర్తి

* * *

కవిరాజు కవితలో సత్యాన్వేషణ, సాంఘిక దృక్పథం, హేతువాదదృష్టి ద్యోతకం అవుతాయి.

- త్రిపురనేని సుబ్బారావు

* * *

మానవునిలో, మానవుని శక్తిలో, మంచితనంలో కవిరాజుకు విశ్వాసం వుంది. హేతువాదం, పరిణామవాదం ఆయనకు అంగీకారాలే కాక, గొప్ప ఆయుధాలు, కార్యకారణ సంబంధాన్ని శాస్త్రీయ పరిశీలనను, అనుభవజ్ఞానాన్ని, పదార్థవాదాన్ని ఆమోదించాడు. వ్యక్తిని కేంద్రంగా పెట్టుకుని, ఒక విశిష్టమైన మౌలికతత్వాన్ని నిర్దేశించి నిరూపించుకున్నాడు. దానితో గొప్ప ప్రజాస్వామికవాదిగా రూపొందాడు.

- జాస్తి జగన్నాథం

* * *

హిందూ పౌరాణిక నాయకుల ప్రవర్తనతో ముడివడిన ధార్మిక విలువలను కదిలించిన గౌరవము కవిరాజుగారికి దక్కినది. - కూర్మా వేణుగోపాలస్వామి

* * *

తెలుగునాట హేతువాద శంఖారావాన్ని పాంచజన్యంగా పూరించారు.

- జి.వి. సుబ్రహ్మణ్యం

* * *

దేవుణ్ణి ఆవలకు నెట్టి, ఆ స్థానంలో మానవుణ్ణి ప్రతిష్ఠించిన రామస్వామిగారు సంఘసంస్కర్తే కాదు, భావవిప్లవ జ్యోతి. సాంఘిక విప్లవానికి రాస్తాలు పరిచిన మార్గదర్శి.

- ఎ.యస్. రావు

* * *

జాతి గౌరవ సమావిర్భుతికై నీతికై, యన్నా సర్వము ధారవోసితివి - వీరాగ్రణీ విశ్వకల్యాణంబు వెలయింప జీవముల్ ముడుపుగట్టిన శాక్యమునివి నీవు.

- తుమ్మల సీతారామమూర్తి

* * *

...సత్యాన్వేషణా దృష్టితో మానవ విలువలను ఆవిష్కరించటానికి జీవితాన్ని అంకితం చేసిన రామస్వామి కవిరాజు చూపిన బాటలో - నేటి సమాజానికి శాస్త్రీయ పద్ధతి, సత్యాన్వేషణను సమన్వయం చేయగల రీతిలో - మానవతకు మరింతగా ఉద్దీపన

కలిగించగల ఉద్యమాలను సాగిస్తూ - సాంఘిక న్యాయాన్ని మృషావచనం కాకుండా చేయటం మన తక్షణ కర్తవ్యం. - కొలసాని శ్రీనివాసరావు

* * *

కవిరాజుగారి భావములు గంభీరములైనవి. నిర్మరతయు, నైశిత్యమును వాని లక్షణము.

- దివాకర్ల వేంకటావధాని

* * *

సమాజంలో జీర్ణించిన మూఢవిశ్వాసాలను, ఛాందసాచారాలను నిర్మూలించి, భావవిప్లవాన్ని సాధించిన యుగకర్త కవిరాజు.

- కల్లూరి బసవేశ్వరరావు

* * *

మనకు "కవిరాజు మేడీజీ" గ్రంథం కూడా అవసరమే. అలా మాత్రమే భావితరాలకు కవిరాజు అందికలో వుంటాడు.

- మాకినేని బ్రహ్మానందం

* * *

జాతి మాంద్యముడిపి, సత్యమ్ము జిమ్ము నీ ప్రౌఢ కావ్యతతికి ప్రణతి శతము.

- ఉమర్ అలీషా

* * *

భావ వికాసంలో గానీ, తెలుగు కవితలో గానీ కవిరాజు తెలుగునాట ఒక యుగపురుషుడు.

- హేతువాది

* * *

ఉపదేశ ప్రధానమైన సాహిత్య స్రష్టలలో కవిరాజు ఆద్యుడు, ప్రథమగణ్యుడు. జాతికొక నీతి, కులానికొక రీతి శిక్షా విధానాన్ని తిరస్కరించటమే రామస్వామిగారి శంబుకవధ చేసిన కృషి.

- యస్. వెంకట్రాయుడు

* * *

ఒక కులమునకొక ధర్మం బొక వర్ణమునకు వేరె ధర్మము తప్పక కలవని చెప్పేవాళ్ళ బతుకు బండారాన్ని బైటపెట్టిన సాహసాంకుడు త్రిపురనేని రామస్వామి.

- హర్షవర్ధన్ కె.

* * *

ఒక కుల పౌరోహిత్యాన్నే కాదు, ఏ కులం పౌరోహిత్యాన్నీ ప్రోత్సహించలేదు. అసలు పౌరోహిత్య పద్ధతికే మరణశాసనం వ్రాసి గోరీ కట్టాడు కవిరాజు. - చరిత్ర

* * *

పాడిందె పాటరా పాచిపళ్ళ దాసుడా అంటూ - పాతలోని రోతనే తిప్పి తిప్పి చెప్పే వైఖరిని తిరస్కరించాడు. అంతేకాదు నిత్యనూతనత్వ నికేతనంపై కేతనమెత్తాడు భావవిప్లవ కవిరాజు.

- పి. మృణాళిని

* * *

పాతదారినే నడిచే పవిత్రులకు తలవంచని ఓ విప్ల కవిరాజా! ఓ వినూత్న రవితేజా! మట్టి గట్టినట్టి మూఢమనస్తత్వ పిశాచము నడ్డి విరగగొట్టావు. నీవు వేసినట్టి బాట నేడు మాకు రాచబాట.

- దాశరధి

* * *

సూతాశ్రమ సత్రమాద్వం అందరిదీ కాదు. ఎర్రని మూసలోన, అనాయాస శ్వాసలాగ కవిరాజు పద్యం పారే లోహపు అందం.

- బైరాగి

* * *

రామస్వామిగారికి పరిణామ వాదమందు విపరీతమగు మక్కువయున్నది.

- చాపరాల సత్యనారాయణ

* * *

వేమనది ప్రజాభాషలో పండిత కవిత్వం. కవిరాజుది పండితభాషలో ప్రజా కవిత్వం. నిజానికిద్దరూ పండితులే. ఇద్దరూ ప్రజాకవులే. - రావిపూడి వెంకటాద్రి

* * *

పెళ్ళిమంత్రాలకు గుడ్‌బై పలికించి, తేటతెలుగులో అందరికీ అందుబాటులో వుండే విధంగా పెళ్ళిపద్ధతులను తొలిసారిగా పాదుకూర్చిన ప్రత్యేకత కవిరాజుగారిదే.

- ఎస్. కళ్యాణరావు

* * *

ఆశయములందు కవిరాజు విప్లవకారుడు. వారి వాఙ్మయంలో చారిత్రక దృష్టియు, చరిత్రయందు వాఙ్మయ దృష్టియు సమమై సామాన్యముగా మిళితమైంది.

- బెజవాడ రామచంద్రారెడ్డి

* * *

ఫ్రెంచి విప్లవజ్యోతి వలెనే - వీరి ఆశయాన్ని, ఆదర్శాన్ని అభ్యుదయం కోరే ఆంధ్రజగత్తు విస్మరించలేదు.

- "దేశాభిమాని"

* * *

మతకర్మ సిద్ధాంతాల గుట్టు రట్టుచేసి, దేశీయ ఫాసిజాన్ని ఏనాడో ఏకాకిగానైనా యెదుర్కొని ఛిన్నాభిన్నం చేయబూనిన మహావీరుడు రామస్వామి కవిరాజు.

- "ఆంధ్ర లేబర్"

* * *

వర్ణాశ్రమ ధర్మాలు దాస్య సిద్ధాంతాలని సోదాహరణంగా ఋజువు చేసి పురాణాల బండారాన్ని పగలగొట్టి గీతను నుగ్గు నుగ్గు చేసి జనానికి కళ్ళు తెరిపించినవారు కవిరాజు.

- "రాడికల్"

* * *

దూషణ భూషణ తిరస్కారాలను, అవమాన పరంపరను అధిగమించి, మానవ సమతకు ఏతమెత్తిన బాటలో మనం ముందుకు సాగాలి; ఇదే కవిరాజు స్మరంతి.

- "మార్గదర్శి"

* * *

కవిరాజు భావపరిణామ క్రమాన్ని సత్యదృష్టితో, చారిత్రక పరిశీలనతో చూడకుండా, ఆయన్ను అపప్రధకు గురిచేస్తున్న అమానుష పద్ధతులకు యికనైనా తగిన బుద్ధి చెబుదాం.

- వి. భాస్కరరావు

* * *

సాంఘిక అసమానతలకు కలతచెందిన రామస్వామిగారు సమసమాజ నిర్మాణం కావాలని ఆకాంక్షించారు.

- ఎ. ప్రఫుల్లచంద్ర

* * *

జ్ఞానులమంచు లోదలచి గర్వపడంగను మేలు కల్గదు. అజ్ఞానుల చెంతచేరి యిదియౌనిది కాదని తెలియజెప్పాలని కోరిన కవిరాజా, నీ సందేశం - అదే మాకు ఉపదేశం.

- రావి నారాయణదాస్

* * *

తప్పుపాటలు పాడబోకుము, తప్పుమాటలు చెప్పబోకుము, తప్పు కథలను చదవబోకుము, తప్పుదారుల త్రొక్కబోకుము అంటూ ఒప్పులను మెప్పులకు అతీతంగా

అప్పజెప్పాడు కవిరాజు. కప్పి చెప్పిన వైనాలను విప్పి చెప్పాడు. ఈ మార్గంలో మనల్ని మనం సరిదిద్దుకుందాం.

– కె. విజయకుమార్

* * *

జంతుబలుల్ని అరికట్టాలని చెప్పటమే గాకుండా, తెనాలి మునిసిపల్ ఛైర్మన్‌గా తన కుర్చీ కదిలిపోతుందని క్షణమాత్రం అనుకోకుండా – జంతుబలుల్ని, కొలుపుల్ని, జాతరల్ని ఆపించిన ఆచరణవాది మన రామస్వామి.

– ఎం.వి. సత్యనారాయణ

* * *

మానవులందరూ సరిసమానులేనని మానవకంఠం ఆలపించిన కవిరాజు మార్గం – అదే సరైన మార్గం.

– ఆర్.వి. చౌదరి

* * *

దుష్పండిత మండవీ తిమిరభానుడు కవిరాజు.

– ప్రయాగ కోదండరామశాస్త్రి

* * *

జ్ఞానతృష్ణను పెంచేందుకు ప్రశ్నించటం నేర్పి మనిషి తనకు తానుగా బ్రతకటమే కాకుండా, యితరులనుకూడా పరువుగా బ్రతకనివ్వడం నేర్పిన గొప్ప సంఘసంస్కర్త కవిరాజు రామస్వామి.

– కవిరాజు సాహితీ సమితి

* * *

బ్రహ్మద్వేషి అనే దుస్తంత్ర దుర్నీతి ప్రచారం చేశారు ప్రబుద్ధులు; ఇది నిజం కాదు; రామస్వామిగారు ఏ కులానికి చెందినవారినీ ద్వేషించేవారు కారు; అయితే భారతీయ సంస్కృతి వేదబ్రాహ్మణత్వంపై ఆయన ధ్వజమెత్తారు. ఈ పనిని కవిరాజు నిర్వీకంగా కొనసాగించారు.

– జి.యన్. హరి

* * *

ప్రజాసామాన్యంలో చైతన్యం కలిగించటమే కవిత్వ ఆదర్శమని గ్రహించినారు కనకనే వారు ప్రజా శ్రేయస్సు కొరకు వ్రాశారు.

– పి.వి. సుబ్బారావు

* * *

బ్రాహ్మణమత విమర్శతో ప్రారంభమై, నాస్తికత్వంలో కొనసాగి, మానవతలో తేలే కవిరాజు భావాలు ఈనాటి హేతువాద, నాస్తిక, భౌతికవాద, మానవవాద శాఖలకు

చెందినవారు తెలుసుకోవటం చాలా అవసరం. కవిరాజు వ్రాసుకున్న పీఠికల్ని వ్యావహారిక భాషానుసరణతో రూపొందించిన రావిపూడివారి పుస్తకం వెలువడడంతో ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్న పని యిటీవల జరిగింది. - జి. అప్పారావు

* * *

సత్యాన్వేషణ సాగిస్తూ - ప్రగతిపథంలో పయనించాలంటే క్రాంతిపథంలో నడవండోయ్, కవిరాజు పథం కనరండోయ్.

- కోగంటి నరసింహారావు

* * *

ఆయన పండితులలో పండితుడు; విమర్శకులలో ప్రాగ్రసరుడు; సంస్కర్తల శిరోమణి; ఆత్మగౌరవమును కాపాడుకొనుటలో అందెవేసిన చేయి. కాసు వీసములకు, గ్రాసవాసములకు, మడిమాన్యములకు, ఎత్తువారి చేతి బిడ్డలగు విత్తవంతుల పంచలను పడిగాపులు పడి తిరుగుదే చెలకీతడు కుఠారము వంటి ధీరుడు; యుగకర్త రామస్వామి.

- కొత్త సత్యనారాయణచౌదరి

* * *

ఆయన చారిత్రక దృష్టికోణము, శాస్త్రీయ దృక్పథము మున్నగువానిలో మనము పనిచేసి, సాహిత్యరంగములో కూడ, స్వేచ్ఛావాయువులను పీల్చి, మన విద్యుక్త ధర్మమును నెరవేర్చుకొందము గాక.

- కొడాలి లక్ష్మీనారాయణ

* * *

"ద్విజులు నిన్ను పాషండుడవనియు, మతద్రోహివనియు తెగడుదురు. ద్విజేతరులలో విద్యాగంధము లేమిచే బ్రాహ్మణ ద్వేషివనియు గొణుగుదురు. కట్టకడకు మీరు తెగలకు కానివారగుటయే గాక కృతాపరాధులగుచున్నారు" అని అంగదుడు శంబుకునుద్దేశించి పల్కిన వాక్యములు జీవితమునొక ఉద్యమముగా సాగించిన కవిరాజుగారికి అన్వయించునా యనిపించుచుండును. - ఎర్రోజు మాధవాచార్యులు

* * *

ఏ ఉద్యమ సిద్ధికైనా సాధారణ ప్రజలకు అందుబాటులో హృద్గతమగు మాటలు, పాటలు అత్యవసరం. ఈ విషయాన్ని గుర్తించిన కవిరాజుగారు సూతాశ్రమ గీతాలు రచించి చరితార్థులయ్యారు.

- గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

* * *

మన పురాణాలన్నీ స్వార్థపరుల చేతుల్లో పడి వికృతమౌతుంటే వేనరాజు వంటి పవిత్రపాత్రలన్నీ వాళ్ళ కలం క్రిందపడి "ఖూనీ" అవుతుంటే వాటి యథార్థాన్ని లోకానికి చాట కంకణం కట్టుకున్న ధీశాలి కవిరాజు.

- బొందలపాటి శివరామకృష్ణ

* * *

సహజాభివృద్ధిని ఆటంకపరచి, సంఘాన్ని కుళ్ళబెట్టటానికి పూనుకున్న ఈ సంప్రదాయాలను బద్దలు గొట్టడమే వారు చేసిన పని. - గోపీచంద్

* * *

వేమన కవిరాజువంటివారు నూతనాంశాలు చెప్పగలిగారు. కవిరాజుది కొత్త ధోరణి - మన స్మృతుల్లో, పురాణాల్లో దూర్చిన మోసాలు యివి, కప్పిపుచ్చిన మన ప్రాచీన చరిత్ర ఇది - సూటిమాటలు ఇవి. ఈనాటి మన సాంఘిక రుగ్మతలకు కారణాలు మన స్మృతుల్లోనే, మన పురాణాల్లోనే ఉన్నాయి అని కవిరాజు చెప్పాడు. అలా చెప్పటం తప్పా?

- ముకురాల రామిరెడ్డి

* * *

రామస్వామిగారు విషయపరిశోధకులు; రసవత్కవులు.

- ఎలవర్తి రోశయ్య

* * *

అతడు తీసిన దారులంబడి అనుగమించుట విజ్ఞులకు విధి.

- నాగభైరవ కోటేశ్వరరావు

* * *

అది మొదట్లో శంబుకాశ్రమం. కాలక్రమంలో అదే సూతాశ్రమంగా మారింది; అదే మరో దశలో మానవ మానసాశ్రమంగా రూపొందింది; దాని భౌతికరూపం కనుమరుగయ్యింది; భావరూపంలో అది కనువిప్పు కలిగిస్తూనే వుంటుంది. కాదంటారా?

- దేవభక్తుని సూరయ్య

* * *

రామస్వామి చౌదరి అంటూ సంబోధించే వైనాన్ని పరిణత మనస్కులు పరిత్యజించాలి. కులం కుచ్ఛితాలను కుదుళ్ళతో, మొదళ్ళతో పెరికి పారేసిన యీ మానవేయునికి కులవ్యాకుల సూచకాన్ని పేరు చివర తగిలించి, దాంతో దశ్శరభ అనుకునే దానికంటే అవమానం మరొకటి ఉండదు. - టి. కిరణ్‌శ్రీ

* * *

ఏయే సాధనాలు ఏయే ప్రభావాలు ప్రజలలో ప్రగాఢమైన పలుకుబడిని సంపాదించి, వారిని భావదాసులను చేసి ముందుకు సాగనివ్వకుండా చేశాయో, వాటిని వారు గుర్తించారు. కీలెరిగి వాతపెట్టాలి కదా! భావదాస్య శృంఖలాలను బద్దలు కొట్టాలంటే – ఆ సాధనాల పలుకుబడి పోవాలి. రామస్వామిగారు ఏరుకున్న కార్యక్రమం అదే.

– జస్టిస్ ఆవుల సాంబశివరావు

* * *

వేల సంవత్సరాల దేశచరిత్రలో హిందూ ధర్మశాస్త్రాల దౌష్ట్యాన్ని ప్రశ్నించగల ధీరుడు కవిరాజు త్రిపురనేని వినా మరెవ్వరు పుట్టారు?

– రావిపూడి వెంకటాద్రి

* * *

బూజుపట్టిన పాతపుస్తకాల కలంచి, నీ ఉద్యమము గెల్పు నిల్పుకొనియె.

– కొసరాజు రాఘవయ్య

* * *

స్త్రీలకు సమానమైన గౌరవ ప్రతిపత్తుల నిచ్చిన గొప్ప మానవతావాది కవిరాజు. స్త్రీలకు జరిగే అన్యాయాలను, అధర్మాలను, పురాతన సంప్రదాయములోని దుర్గంధమును వెలువరించారు. ఆయన్ను మహిళాలోక బాంధవుడనటంలో అతిశయోక్తి లేదు.

– త్రిపురనేని జయవాణి

* * *

నా కవిరాజు కవిరాజు కాదు. కవిగా ఆయనను నేను గుర్తించలేదు. నిజానికి కవిరాజు కవిరాజు మాత్రమే కాదు. కవిరాజరాజు. సంస్కర్తగా, భావవిప్లవోద్యమ కర్తగా ఆయన స్థానం తెలుగునాటికి తేజాన్ని యిచ్చింది. ఆయన అందించిన జ్యోతిని వాడవాడలకూ తీసుకొని వెళ్ళటం మన విధి.

– ఎడిటర్: "హేతువాది"

* * *

సంఘంలో, సాహిత్యరంగంలో, నిత్యమానవ జీవితంలో వున్న లోపాలను ఎదిరించాలనే దీక్షతో కవిరాజు కొత్తమార్గాన్ని తొక్కారు. ఎక్కడ అధర్మం, అన్యాయం, మూఢాచారం, కల్పిత ఆధిక్యత, కులమతజాడ్యాలు తలెత్తాయో – దానినంతా ఎదురొడ్డి నిలిచి, సంఘసేవ, సారస్వతసేవతో బాటు, సాంఘిక విమోచనోద్యమం ప్రారంభించారు.

– కన్నెగంటి జగ్గయ్య



# రచయిత ముందుమాట

అతి ప్రాచీన కాలం నుంచీ ఈనాటి వరకు భారత దేశంలో అనన్య సామాన్య ప్రతిభా ప్రభావంతో సర్వ ప్రపంచాన్ని జయించగలిగిన ప్రజ్ఞావంతులున్నారు. అయినా, చదువు మామూలు జనానికి అందుబాటులో లేని కారణం చేత దేశం అజ్ఞానాంధకారంలో ఉండిపోయింది. ఆ కారణంగా చదువుకున్నవారికి ఎక్కువ మన్నన లభించింది. వారు ఆడిందే ఆట, పాడిందే పాట అయ్యింది. నాలుగు అక్షరమ్ముక్కలు నేరిస్తే చాలు. నింద్యుడయినా జనవంద్యుడయ్యాడు. సంస్కృతం సాహిత్య భాష కావడం చేతా, ప్రజలకు తేలిగ్గా అర్థం కానిదవడం చేతా ఆ భాషలో ఏం చెప్పినా దానిని కళ్లకద్దుకున్నారు. చిలుక పలుకుల్లాగా నాలుగు సంస్కృత శ్లోకాలు వల్లించగలిగినవాడు మహా మన్ననకు పాత్రుడయ్యాడు. ఈ విధంగా విద్వాంసుల వర్గం నుంచి క్రమేణా ఆచార్య పరంపర బయలుదేరింది. మొట్టమొదట ఈ ఆచార్య పీఠం వ్యక్తిగతమై, రాను రాను వారి శిష్యపరంపర వశమైంది. ఆ తర్వాత కొంతకాలానికి కులాధీనమైంది. ఆచార్యత్వం వ్యక్తిగతమైనప్పుడు విశేష ప్రజ్ఞాశాలురు గురుపీఠం అలంకరించారు. కుల క్రమాగతమైనప్పుడు ప్రాజ్ఞులు ఆచార్య పీఠానికి దూరమయ్యారు. అంతేకాకుండా రానురాను బహిష్కృతులూ అయ్యారు. ఆచార్యత్వం ఒక కులానికి పరిమితమై జీర్ణించినప్పుడు, విద్యా వ్యాసంగం క్షీణించటం సహజం. ఆ కారణం చేత గురువు దగ్గర, పేరుకు పండితులైన వాళ్లకన్నా, యితరులే పెద్దగా బుద్ధిశాలురు కావడం సంభవమవుతూ వచ్చింది. ఈనాడు చూడండి, పుష్పగిరి శంకరపీఠం మీద ఆసీనుడైన ఇప్పటి శంకరస్వామి ఆదిశంకరునితో పోల్చడానికి అర్హుడా?

**త్రిపురనేని రామస్వామి**



# నా మాట

త్రిపురనేని రామస్వామి వర్ధంతులూ-జయంతులూ ఏటా జరుపుతూ వుంటారు ఆనవాయితీగా కొందరు మిత్రులు.

ఎందుకు జరుపుతారో ఆ మిత్రులకే తెలియాలి. కొంతమంది చిత్తశుద్ధితో జరిపేవాళ్ళు కూడా వుంటారు.

ఈ మాటలన్నందుకెవరికీ కోపం రాదనుకొంటా.

నిజమైన అభిమానం రామస్వామి పట్ల ఏమాత్రం వున్నా, నాతో ఏకీభవిస్తారేగాని, వివాదానికి దిగరు.

రామస్వామిని, ఆయన చెప్పిన వాస్తవాన్ని ప్రజల దగ్గరకు తీసుకుపోయే ప్రయత్నం-ఇంతకాలం ఎవరూ చేయకపోవటం ఆశ్చర్యంగానే వుంది.

త్రిపురనేని ఇంద్రుడు - చంద్రుడు అనీ, అవి రాశాడు, ఇవి రాశాడనీ, అంత గొప్పగా రాశాడు, ఇంత గొప్పగా రాశాడనీ వ్యాసాలు రాయటం, విమర్శ గ్రంథాలు రాయటం జరిగింది.

అయితే, యిది రామస్వామిని ప్రజల మనిషిగా, ప్రజల దగ్గరకు తీసుకుపోయే చర్య గాదు.

అసలు, రామస్వామి ఏం చెప్పాడో తెలియక గుడ్డిగా వ్యతిరేకించే వాళ్ళు కొందరైతే, అనుసరించేవాళ్ళు కొందరు.

ఈ రెండు రకాల వాళ్ళు ఎందుకు తయారయ్యారన్నది తెలియని రహస్యమేమీ కాదు. రామస్వామి చెప్పిన విషయాలు నేటి సమాజానికి కరదీపికలు. ఆయన గ్రంథాలు ఒక్కొక్కటి ఒక్కో ఆణిముత్యం.

'పాడిందే పాడతా!... పాచిపళ్ళ దాసుడా...! ' అని చెప్పిందే చెపుతూ-రాసిందే రాస్తూ -సమాజాన్ని ఇంకా కొన్ని వేల సంవత్సరాల వెనక్కి నడిపించాలనీ, తమ పెద్దరికం ఈ సమాజంలో చెల్లుబడి కావాలనీ, ఒక వంక పాత రోత కథా కావ్యాలనే వివిధ సాహితీ ప్రక్రియల్లో వెలువరిస్తున్న వైనం విజ్ఞతగల వాళ్ళకు తెలియకుండా లేదు.

ఆ పరిస్థితుల్లో ఆ కాల్పనిక సాహితీ స్రవంతికి అడ్డుకట్ట వేసి ప్రత్యామ్నాయ వ్యవస్థకు పునాదిగా - ప్రత్యామ్నాయ సాహితీ సౌధ నిర్మాణాన్ని నిర్మించటానికి తొలియత్నం చేసిన రామస్వామి ప్రశంసనీయుడు.

ఆర్య పెత్తనాన్ని - అంటే బ్రాహ్మణత్వ ఆధిక్యాన్ని అడుగడుగునా చాటే, పనికిమాలిన సాహిత్యం స్థానంలో, జాతి పునరుజ్జీవనాన్ని ప్రబోధించే చేవగల సాహిత్యాన్ని రామస్వామి సృష్టించాడు.

అయితే, అతని కావ్య సృష్టి సమస్తం - వీర గ్రాంథిక భాషలో వుంది. సామాన్య పండితులకు సైతం అది అర్థంగాని దశలో వుంది. దీన్ని శిష్ట వ్యావహారిక భాషలో వెలువరించటం అవసరమనీ, ప్రస్తుతం వ్యవస్థ మార్పు కోసం జరుగుతున్న ప్రయత్నాలకిది సాధనంగా పనికివస్తుందనే ధ్యేయంతో వచనంలో రాశా.

ఇందులో కొన్ని అవకతవకలు చోటుచేసుకొన్నాయి. వాటిని రెండో ముద్రణలో సవరిస్తా. పాఠక మిత్రులు తమ తమ అభిప్రాయాలను, సదుద్దేశంతో తెలియజేస్తే, వాటిని తప్పకుండా దృష్టిలో పెట్టుకుని పాటిస్తా.

రామస్వామిగారి మూల గ్రంథాలు ఒక యెత్తు. ఆ గ్రంథాలకు వారే రాసిన బహు విషయ పరిపూర్ణములైన పీఠికలు ఇంకొక యెత్తు.

అందుకే మరీ దురవగాహంగా వున్నచోట శిష్ట వ్యావహారికంలోకి మార్చి పీఠికను గూడా మూలంతోపాటే వేస్తున్నా-

మూలానికి భిన్నంగా పోకుండా, అనవసరమైన వర్ణనలను పరిత్యజించి మూలాలను సరళంగానే రాశా.

కవితా శిల్ప సౌందర్య దృష్టితో గాక, విషయాన్ని గ్రహించాలనే దృష్టితో దీన్ని తప్పక ప్రతి అభ్యుదయవాదీ చదవాలని విజ్ఞప్తి చేస్తున్నా.

**బి. రామకృష్ణ**
ప్రధాన కార్యదర్శి,
భారత నాస్తిక సమాజం
మాజీ ప్రిన్సిపాల్,
సంస్కృత కళాశాల, తాడికొండ

# పీఠిక

ప్రాచీనకాలం నుంచే ఈ భారత ఉపఖండంలో అంతులేని ప్రతిభచే సమస్త ప్రపంచాన్ని మింగగలిగిన పండితులున్నారు. అయినప్పటికీ ఈ దేశంలో బహుళ సంఖ్యాకులైన కింది కులాలు, నిమ్న తరగతుల పామరజనానికి చదువు అందుబాటులో లేని కారణం వల్ల ఈ దేశం అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడవలసి వచ్చింది. ఈ కారణం వల్ల తక్కువ సంఖ్య గల అక్షరాస్యులకు సమాజంలో ఎక్కువ గౌరవం కలగటం మొదలైంది.

చదువుకొన్న వాళ్ళు చెప్పిందే మాట, వాళ్ళు ఆడిందే ఆటగా, పాడిందే పాటగా చెలామణి అయింది. నాలుగు ముక్కలు నేర్చిన దుర్మార్గుడి మాట సంఘంలో చెల్లుబడి కాజొచ్చింది. వాడు పదిమందిచే పూజింపబడుతూ వున్నాడు.

విజ్ఞానం అంతా సంస్కృత భాషలో వుంది. ఆ భాష సామాన్య ప్రజలకు అందుబాటులో లేనిది. అదీగాక ప్రజలకెవ్వరికీ అర్థంకాని భాష. పండితులకే అది పరిమితం. అర్థంకాని ఆ భాషలో ఏం చెప్పబడ్డా అది పరమపవిత్రమైందిగా భావించడుతోంది. చిలకపలుకుల్లాగా నాలుగు సంస్కృత శ్లోకాలు వల్లించగలిగితే వాడొక పెద్ద పండితుడి క్రింద లెక్క. వాణ్ణి సమాజం పెద్దపీట వేసి గౌరవిస్తుంది.

ఈ రకంగా మొట్టమొదట చదువుకొన్న వాళ్ళల్లో నుంచి కాలక్రమంలో ఆచార్య పరంపర బయలుదేరింది. మొదట ఈ ఆచార్యకం వ్యక్తిగతంగా వుండి, తరువాత వాళ్ళ శిష్య పరంపరలోకి వచ్చింది. ఆ తరువాత అంతటితో ఆగక కొంతకాలానికి అది కులాధీనమై పోయింది.

ఆచార్యత్వం వ్యక్తిగతంగా వున్నప్పుడు, గొప్ప ప్రజ్ఞ గల వాళ్ళే గురుపీఠంలో వుండేవాళ్ళు. అది దిగజారి శిష్యులకూ, చివరకి కుల పరిధిలోకి వచ్చేటప్పటికి ప్రజ్ఞ గల వాళ్ళంతా ఆ గురుపీఠానికే దూరమయ్యారు. అనామకులంతా ఉన్నత స్థానాన్ని ఆక్రమించారు, విద్వాంసులంతా గురుపీఠానికి దూరం కావటమే కాకుండా, రానురాను బహిష్కరింపబడ్డారు కూడా. ఆచార్యత్వం కులానికి పరిమితమై, జీర్ణిస్తే విద్యావ్యాసంగం శిథిలంకాక తప్పదు: అది సహజం కూడా. దీనిమూలాన దగ్గరున్న పండిత మాత్రులకంటే ఇతరులే బుద్ధిప్రభావం కలవాళ్ళు కావటం సంభవిస్తుంది.

ఈనాడు చూడండి! పుష్పగిరి శంకర పీఠాన్ని ఎక్కిన ప్రస్తుత శంకరాచార్యుడు పేరుకు మాత్రమే శంకరుడు కాని, ఇతడు అలనాటి ఆదిశంకరుడితో సమానుడౌతాడా? కనీసం ఆ మాట అనటానికైనా అర్హత లేమన్నా వున్నాయా? శక్తిసామర్థ్యాలు సన్నగిల్లిన కొద్దీ, గురుపీఠానికి పండితుల పక్షాన ఈర్ష్య, అసూయలు పెరగజొచ్చాయి. ఇతరుల విద్యా

ప్రకర్ష తాత్కాలికంగా ఆచార్యత్వం సాగించే వాళ్ళకు కన్నుగుట్టటం జరిగింది. గుండె దిగులేర్పడ్డది. ఆ తరువాత అది కామ, క్రోధ, లోభ, మద, మోహ, మాత్సర్యాలకు లొంగిపోయింది. ఆచార్యత్వానికి దొంగదారులు పుట్టుకొచ్చాయి. విద్య యందు పక్షపాతం నశించింది. ధర్మ పక్షపాతం శిథిలమైంది. సత్యనిష్ఠ కృంగిపోయింది. గురువులాగే శిష్యులు తయారై సామాన్య ప్రజల్లో ధర్మానికి స్థానంలేకుండా దిగజారిపోయింది. చిత్తశుద్ధి కనిపించకుండా పోయింది. మానసిక సంస్కారం లేని పనికిమాలిన ఆచారాలే మోక్షానికి సాధనాలనే అభిప్రాయం బలిసి దానికి కావలసిన గాథలు తలయెత్తసాగాయి.

ఈ అభిప్రాయమే క్రమక్రమంగా దేశమంతా ప్రబలింది. సమాజంలో డాంబికులకూ - క్రూరులకూ పలుకుబడి హెచ్చింది. మాన మర్యాదలు వాళ్ళకే అధికమయ్యాయి. కఠినాచారాలు గల వాళ్ళు ధర్మ నిర్ణయం చేయసాగటం వల్ల ధర్మం తారుమారైంది. ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం గల ధర్మాధికారులు కూడా పక్షపాతం లేకుండా ధర్మం చెప్పలేకపోతున్నారు. వాళ్ళ బుద్ధి "ఉయ్యాలో జంపాలో" అన్నట్టు ఊగిసలాడుతోంది. ధర్మాభిమానం చివరకు కులాభిమానంగా, ఆత్మాభిమానంగా మారింది. ఇవన్నీ ఉన్నతస్థానం నుంచి పతితమైన జాతియొక్క బాహ్య లక్షణాలు. ప్రస్తుత కాలపు భారతజాతి చచ్చీ చావని అవస్థలో వుంది. అవతార పురుషులు, కారణజన్ములు అని చెప్పబడు తున్న మహాత్ముల ఉద్బోధ వల్ల జీవలక్షణాలు కొన్ని అస్పష్టంగా కనిపిస్తు న్నాయి. సూత్రప్రాయంగా వున్న వాక్యాలను సోదాహరణంగా సందర్భాన్ని బట్టి ఇక్కడ విపులంగా వివరిస్తా.

## యుగాలు

కాల చక్రానికి కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం - అనే నాలుగు ఆకులున్నాయంటారు. అవి క్రమం తప్పకుండా ఒకదాని వెంట ఒకటి వస్తాయని కూడా చెపుతారు. అంటే కృతయుగం తరువాత త్రేతాయుగం, త్రేతాయుగం తరువాత ద్వాపరయుగం, ద్వాపరయుగం తరువాత కలియుగం క్రమం తప్పకుండా వరుసలో వస్తాయని పురాణాలు చెపుతున్నాయి. ఈ మార్పు కేవలం అసహజంగా కనిపిస్తుంది. కాలానికి సహజంగానే మంచి చెడులుంటా యని చెప్పటం వితండ వాదమే అవుతుంది. లోకమే మంచి చెడ్డల్ని కల్పిస్తుంది.

"లోకం ఎప్పుడైతే కొంచెం కూడా బీరుపోకుండా నీతిగా, మర్యాద తప్పకుండా, ధర్మబద్ధంగా వ్యవహరిస్తుందో అది కృతయుగం, ఒక భాగం ధర్మం నశిస్తే అది త్రేతాయుగం, సగభాగం ధర్మం దెబ్బతింటే అది ద్వాపరయుగం, మూడువంతులు ధర్మం నశించి, ఒక వంతు ధర్మం వుంటే అది కలియుగం." అని పౌరాణికులు

వాదిస్తారు. అంతం లేని ఈ కాల గమనంలో పురాణాలు చెప్పినట్లు గాక, యుగాలు మారుతూ వుంటాయనేది మనకు అనుభవంలో వున్న విషయం. ప్రజల ప్రవర్తన మేరకు యుగాలు కల్గుతాయనేది మనకందరకూ తెలిసిన సత్యం. ఇట్లు గాక, పురాణవాదుల ప్రకారం అంగీకరిస్తే, ప్రపంచమంతా ఒకే కాలంలో ఒకే యుగ ధర్మం వుండాలి. కాని అట్లా లేదు గదా! పౌరాణికుల వాదన అనుభవానికి పచ్చి వ్యతిరేకమే గాకుండా, వాళ్ళు చెప్పే సనాతన మత సిద్ధాంతానికే ప్రతికూలం. ఒకే కాలంలో వున్న ప్రపంచ దేశ చరిత్రల్ని పరిశీలించి అధ్యయనం చేస్తే మేం చెప్పే మాటలు తేటతెల్లమౌతాయి.

భారతదేశానికి వచ్చిన చైనా యాత్రికుడు 'హ్యూయన్‌సాంగ్' అతి ప్రాచీన కాలంలోనే దేశంలోని వివిధ ప్రాంతాలు తిరిగి, ఈ దేశ ప్రజల గురించి రాసిన రాతలు చూస్తే నిజంగా ఒళ్ళు పులకరిస్తుంది. అప్పుడే అదే కాలంలో వున్న ఇతర దేశాల మీదకి కూడా మన దృష్టిని మళ్ళించాలి.

ఇంగ్లాండు నిజంగా అప్పుడే జంతుదశ నుండి బయటపడు తున్నది. ఆనాడు ఇంగ్లాండు ప్రజలు కొండ గుహల్లో కాపురాలుంటున్నారు; చెట్టు తొర్రల్లో జీవిస్తున్నారు; జంతువుల తోళ్ళు ధరిస్తున్నారు. పచ్చి మాంసం పీక్కు తింటున్నారు; జంతువుల్లాగానే తమ బ్రతుకులను వెళ్ళమారుస్తున్నారు. ఇక ఆఫ్రికా, అమెరికా దేశాల ప్రజల స్థితిగతుల్ని పరిశీలిస్తే, ఇంతకంటే ఘోరంగా వున్నట్లు తెలుస్తుంది. ఇంగ్లాండు కంటే ఎంతో అధమ స్థితిలో అమెరికా, ఆఫ్రికా దేశాలు హీన మానవులకు కేంద్రాలై వున్నాయి. పురాణాలు చెప్పే మాటే నిజమైతే, ప్రపంచంలో వుండే అన్ని దేశాల్లోనూ ఒకే కాలంలో ఒకే రకమైన నాగరికత వుండాలి - అంటే ఒకే ప్రకారంగా వుండాలి. విభిన్న దేశాలలో ఒకే కాలంలో రకరకాల జీవన పద్ధతులుగాని, సాంఘిక నియమం గాని, ధర్మంగాని వుండవచ్చా? అది మా వాదమే సరైనదని సిద్ధాంతీకరిస్తుంది.

అయితే, పురాణాలు కేవలం భారతదేశాన్ని గురించే చెప్పాయి కాని ఇతర దేశాల గురించి కాదని అంటారా? అట్లా అనటానికి వీలు లేదు. మ్లేచ్ఛ దేశాల గురించి కూడా పురాణాల్లో నీతులు - ధర్మాలు చెప్పబడ్డాయి.

కాబట్టి కృతయుగం నుంచి క్రమక్రమంగా ఒకదాని తరువాత ఇంకొకటి మారుతూ కలియుగం వస్తుందని చెప్పటం నమ్మటానికే వీలుకాదు.

కొన్ని అంశాలు ముందు ముందు చర్చిస్తాం. పాఠక మహాశయులు సావధానంగా ఆలకించాలి.

బంగారు ముద్ద ఎగురవేస్తూ అడవి మార్గంలో పోయినా దొంగల భయమనేది లేకుండానూ, మతభేదం చూపకుండా ఖజానాలో వున్న సొమ్మునంతా దానపూర్వకంగా పండితులకు పంచిపెట్టి కీర్తిని సంపాదించిన హర్షవర్ధనుడు పరిపాలించిన పవిత్రమైన

రాజ్యము - అన్నదమ్ముల పొళ్ళు తెగక, రాజ్యకాంక్ష చేత ఒకరి గొంతులు ఇంకొకరు తెగనరుక్కొని చచ్చిన పాండవ రాజ్యంకంటెనూ, భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఏ దోషం ఎరక్కుండా తపస్సు చేసుకుంటున్న శూద్రుడైన శంబూక ఋషిని చంపిన రామరాజ్యం కంటె గొప్పదవునా కాదా?

చేతికి చిక్కిన అపురూప సౌందర్యవతియు, శత్రు రాణివాస స్త్రీయు, స్త్రీలకే మేలు బంతియని చెప్పదగిన బంగారు బొమ్మను తురుష్కుల రాణివాస స్త్రీని మాతృభావంతో ఆజన్మ విరోధియైన మొగలాయి చక్రవర్తి సన్నిధికి పంపిన ఛత్రపతి శివాజీ - మూడు లోకాలకు పాలకుడననే మదంతో తెలివిగలవాడై కూడా, కామ వాంఛతో, కపటి వేషంతో మునిపత్నిని మోసగించి సంభోగించిన ఇంద్రుని కంటెనూ, భర్తయైన శంఖచూడుణ్ణి చంపి, ఆ వేషం ధరించి మహాపతివ్రత అయిన సతీ తులసిని మోసగించి రతి క్రీడలలో మునిగితేలిన శంకరుని కంటెనూ, పెండ్లి అయిన స్త్రీని బలాత్కారంగా తెచ్చి చెరచిన త్రిశంకుని కంటెనూ గొప్పవాడు కాడా? శివాజీ కాలమే యుగం అవుతుంది? ఇంద్రుడు మొదలైన వాళ్ళ కాలం ఏ యుగం అవుతుంది? యుగాల గురించి మాట్లాడే ప్రబుద్ధులు ఆలోచిస్తే తెలియకుండా వుంటుందా?

పైన చెప్పిన పురాణగాథలు, యుగాల గురించీ, యిహ ధర్మాల గురించి చెప్పే పురాణ వాదాన్ని తుత్తినియలు చేస్తున్నాయి. కాబట్టి మహనీయులైనవారి పాపరహితమైన ప్రవర్తనచే తెలుపబడ్డ సామాన్య జనపు ధర్మాధర్మ ప్రవర్తనపై యుగాలు అధారపడి వుంటాయి. అంటే పురాణవాదం చెప్పినట్లు యుగాలు - కృత, త్రేత, ద్వాపర, కలి యుగాలు ఒకదాని తరువాత ఒకటి క్రమం తప్పకుండా రావలసిన అవసరమే లేదు. తారుమారుగా రావచ్చును. ఈ దేశంలో ఇట్లాంటి యుగాల మార్పు ఇప్పటికి ఎన్నిసార్లో జరిగింది.

సొంత ప్రయోజనాన్ని కోరి, వేలకొద్దీ ఆవుల్ని చంపి బ్రాహ్మణులకు యజ్ఞమనే వంకతో సంతర్పణాలు పెట్టిన రంతిదేవుడి కాలం ఏ యుగమౌతుంది? కృతయుగం అవుతుందా? కలియుగమౌతుందా? బుర్ర పెట్టుకుని ఆలోచిస్తే బోధపడక మానుతుందా?

తన ప్రజల కోసం రాజ్యాన్ని విడిచి, భార్యాబిడ్డల్ని కాదని, జీవిత సుఖాలను విడనాడి - తిన్న చోట పండక - పండిన చోట తినక - జీవితమంతా ప్రజలకోసం ధారపోసిన బోధిసత్త్వుని కాలం ఏ యుగంలో వుండాలి?

సమస్తాన్ని త్యాగం చేసి, ఉన్న సర్వసంపదను సనాతన ధర్మ ప్రచారం కోసం ధారపోసి, అంతటితో తృప్తిపడక, మోహాన్ని విడిచి, భయాన్ని పారదోలి ఆత్మ సమర్పణం గావించిన శ్రద్ధానంద సన్యాసి జీవితం అసూయతో లోకాల్ని చెడదిట్టి శపింపబడ్డ వశిష్టుడి జీవితంకంటే ఉత్తమమైంది కాదా?

పాఠక మహాశయులు నిగ్రహమైన మనస్సుతో ఆలోచించాలి. బాగా ఆలోచించి పరిశీలించాలి. వెనుకా ముందూ పెద్ద పెద్ద బిరుదు తోకల్ని తగిలించుకొన్న వాళ్ళెవళ్ళో సంస్కృత గ్రంథాలు రాశారనీ, వాటిల్లో వున్నదంతా ధర్మమనీ ఎప్పటికీ నమ్మరాదు. నమ్మి భ్రమ, ప్రమాదాలకు లోను కాబోకండి.

# కృతయుగం

యుగాలకు సంబంధించిన చర్చకు ఆధారంగా ఎక్కువగా పురాణాల గాథలనే గ్రహించాం. అయినా, కొద్దో గొప్పో వేదాల నుంచీ - స్మృతుల నుంచీ - ఇతిహాసాల నుంచీ కూడా తీసుకోక తప్పలేదు. కాబట్టి పాఠకులు జాగ్రత్తగా వినాలని ప్రార్థిస్తున్నా. యుగాల గురించీ - యుగ ధర్మాల గురించీ యిక్కడ సాధ్యమైనంత విపులంగా చర్చించి, ఏ కాలం ఏ యుగమవుతుందో చూపిస్తాం.

కృతయుగంలో సార్వభౌములు లేరు, భుజబలం గల వీరుడెవరో ఒకడు రాజ్యాన్ని సంపాదించి గంతులు వేస్తూ వుండేవాడు. చిత్రగుప్తుని లాంటి వాడెవడో ఒకడు వీళ్ళ జైత్రయాత్రల గురించి రాసే సమర్థుడుండేవాడు.

ఆ కాలంలో జాతి - మత భేదాలు లేవు. గాంధర్వ వివాహా లెక్కువ. తరచుగా రాక్షస వివాహాలు గూడా జరుగుతూ వుండేవి. అయినా వివాహ బంధం కూడా, చచ్చిపోయేంతవరకూ వుండేది కాదు. వధూవరుల ఇష్టానిష్టాలపై వివాహబంధం ఆధారపడి వుండేది. ఒక జాతికీ, ఇంకొక జాతికీ మధ్య వివాహాలు జరుగుతూ వుండేవి. ఆ రోజుల్లో ఇప్పటిలాగా వావివరుసలు ఉన్నట్టుగా కూడా కనబడదు.

తాత మనమరాలిని పెళ్ళి చేసుకునే ఆచారం మంచి ఆచారంగానే చూడబడేది. ఓఘరథుని తండ్రి సుదర్శనుడనేవాడు, తన సొంత కొడుకు కూతురైన ఓ యువతిని - ఆమెకు తగిన సరైన వరుడు దొరకలేదనే వంకతో తానే పెళ్ళి చేసుకున్నాడు.

ఒకే తల్లి కడుపున పుట్టిన అన్నా చెల్లెళ్ళు ఆ యుగంలో పెళ్ళిళ్ళు చేసుకునేవాళ్ళు. వాళ్ళకది తప్పుగా అనిపించేది కాదు.

అకూతీరుచి ప్రజాపతి - అనేవాడికి యజ్ఞుడు - అనే మగవాడు, దక్షిణ అనే అమ్మాయి జన్మించారు. అన్నా చెల్లెళ్ళైన వాళ్ళిద్దరూ పెరిగి పెద్దవాళ్ళై పెళ్ళి చేసుకుని సంసారం చేశారు. ఇంద్రియ సంతృప్తిని పొందటం తప్ప, పెళ్ళి అంటే ఏమిటో తెలియని ఆడ-మగ జనం వున్నారు. విటులూ విటురాళ్ళూ స్వేచ్ఛగా విహరించటం జోరుగా వుంది. ఆడ-మగ కలిసి సయ్యాటలాడటం అధికంగా వుండేది.

బాగా ఆలోచిస్తే, ఆనాటి వివాహాలు నేడు పశ్చిమ దేశాల్లో వుండే పెళ్ళిళ్ళలాగా వున్నట్టు తోస్తుంది. ఆడవాళ్ళకు సంసార సంబంధాలు కూడా చాలా తక్కువగానే

వున్నాయనిపిస్తుంది. ఒకవేళ వున్నా - అవి నామమాత్రమనే భావించాలి. నేడు మనమనుకొనే, ఇల్లాలు - మగనాలు - అనే మాటల అర్థం ఆనాటి స్త్రీలకు బోధపడవు.

ఈ రోజుల్లో మనం కన్యాశుల్కం-వరశుల్కం అన్నట్లుగా శుల్కాలు లేవు. గంధర్వులు, కిన్నరలు, కింపురుషులు-మొదలైన జాతులవాళ్ళు దేవ యోనులుగా చెప్పబడేవాళ్ళు. అంటే ఆంగ్ల భాషా కవి శ్రేష్టుడైన 'బెర్నార్డ్‌షా' అనే ఆయన కల్పించిన అతీత మానవులన్నమాట. దీనిమూలాన వీళ్ళ చరిత్రను చర్చించి భారతదేశపు ధర్మ నిర్ణయం చేయటం మంచిది గాదు. కాని, ఆనాటి హిందూ దేశపు ఆర్యులకు, వాళ్ళ నడవడి - వాళ్ళ గుణాలే ఆదర్శప్రాయంగా వుండేవి. కాబట్టే, ఈరోజు మనం కేవలం వ్యభిచారంగా భావిస్తున్నా, గాంధర్వ వివాహం - గంధర్వులనే వాళ్ళు అవలంబించటం వల్ల పవిత్రమయిందని చెప్పవచ్చు.

ఆ కాలంలో కులాన్ని బట్టి చదువుకోరాదనే నిషేధం లేదు, ఏ కులం వాళ్ళైనా చదువుకోవచ్చు. అయితే, మనుషుల స్వభావాన్ని బట్టి ఆ నిషేధం వుండేది.

ప్రజలంతా సత్యవంతులే. అబద్ధమాడటం బహుశా ఎరుగరేమో? ధర్మాన్ని స్థాపించడం కోసం గురువులతోనైనా బాహాటంగా పోరాటం చేసేవాళ్ళు. విధవ - అన్న పదం ఆ రోజుల్లో వున్న వాళ్ళకు తెలియదు. మరీ చిన్నతనంలో పెళ్ళిళ్ళు చేయవలసిన అగత్యం వాళ్ళకు లేదు. కుటుంబాన్ని అంటగట్టుకుని వూరేగటం కనపడదు. స్వైర విహారాలే ఎక్కువ. ఒకవేళ వ్యభిచరించి సంతానం కన్నప్పటికీ, తాళి కట్టిన మగడు ఏ మాత్రం భార్యను ఏవగించుకొనేవాడు కాదు.

దేవతల గురువైన బృహస్పతి భార్య తార, తన మగని శిష్యుడైన చంద్రుడితో అక్రమ సంబంధం పెట్టుకొని, గర్భవతి అయింది. ఈ విషయం పంచాయతీ పెట్టి విచారిస్తే, ఆమెకు చంద్రుడివల్లనే గర్భం వచ్చినట్లు నిర్ణయించారు. తరువాత కొడుకు పుట్టాడు. అతడికి బుధుడు- అనే పేరు పెట్టారు. ఆ కొడుకును చంద్రుడికి అప్పచెప్పి, తార - తిరిగి తన భర్తయైన బృహస్పతి దగ్గరకే వచ్చి కాపురం చేసింది. ఈ పని చేసినందుకు ఆమెను సంఘం నుంచి వెలివేయలేదు. బృహస్పతిని గూడా దేవతా గురుపీఠం నుంచి తొలగించలేదు.

ఇక, బృహస్పతి మాత్రం తక్కువ తిన్నాడా? అన్న భార్య అయిన మమతను చూచి రిమ్మతెగులు పుట్టి ఆమెకు ఇష్టం లేకపోయినా, అందులో నిండు చూలాలై, గర్భంలోని పిండం వద్దని గోల చేస్తున్నా, బలాత్కరించి కామసుఖం అనుభవించాడు. దీని వల్ల మమతకు ఏ దోషమూ కలగలేదు. అన్న భార్యను బలవంతంగా చెరచినందువల్ల బృహస్పతికి ఏ శిక్షా పడలేదు. దేవ గురువుగానే చెలామణీ అయ్యాడు.

సామాన్యంగా క్షత్రియులు బ్రాహ్మణులకు లొంగి వుండేవాళ్ళు. కాని అప్పుడప్పుడూ

క్షత్రియులు బ్రాహ్మణులపై తిరుగుబాటు చేసిన సంఘటనలు కూడా కొన్ని వున్నాయి.

ఈ కాలంలో బాగా గుర్తుపెట్టుకోవలసిన విషయం ఒకటుంది. స్త్రీల పట్ల ఎంత కపటంగా ప్రవర్తించి, వాళ్ళను మోసగించినప్పటికీ అసలు పట్టింపే లేదన్నట్లు గమనించాలి. స్పంద - అనే ఆమెను విష్ణువు మోసగించాడు; తులసి - అనే స్త్రీని శివుడు వంచించాడు; అహల్య - అనే వనితను ఇంద్రుడు మోసగించాడు; క్రతుస్థల - అనే ఆవిడను యక్షుడు వంచించాడు. ఇవన్నీ ఆ కాలపు గాథలే.

# త్రేతాయుగం

త్రేతాయుగం నాటికి ప్రజలు స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. స్త్రీ, పురుషుల స్వేచ్ఛా విహారం కొంత తగ్గింది. తపస్సు, ఉపవాసాలతో శరీరాన్ని కృశింపచేయటం ఎక్కువయ్యాయి. భౌతిక సుఖాలను కోరి తపస్సు చేయటానికి తోడుగా, పరలోక సుఖాన్ని కోరి మరణించే వరకూ తపస్సులోనే లీనం గావటం జరుగుతుండేది. సంసార బంధాలు కూడా మెరుగయ్యాయి. స్త్రీలకు - స్వేచ్ఛ వద్దు అనే అభిప్రాయం తలయెత్తసాగింది. తల్లిదండ్రులు ఆడపిల్లను ఆమె యిష్టం తెలుసుకోకుండానే, తమ యిష్టానుసారం వరుడికిచ్చి పెళ్ళి చేయటం మొదలయింది.

అధిష్ఠానం - అనే పట్టణానికి రాజు యయాతి. అతనికి మాధవి అనే కూతురు పుట్టింది. ఆమె అందాల భరిణె. గాలవుడు - అనే బ్రాహ్మణు డొకడు, ఒకసారి యయాతి దగ్గరకు వచ్చి - 'గుఱ్ఱాలు కావాలి' అని అడిగాడు. గాలవుడడిగిన గుఱ్ఱాలు తన వద్ద లేక, యయాతి వాటికి బదులుగా అందాలరాశియైన మాధవి అను తన కూతురుని ఆ బ్రాహ్మణుడికిచ్చాడు.

గాలవుడు మాధవిని ఇతరుల వద్ద కుదువబెట్టి, తనకు కావలసిన గుఱ్ఱాలను తీసుకోవచ్చునని యయాతి చెప్పాడు. ఆ బ్రాహ్మణు డట్టాగే మాధవిని తీసుకొని క్రమంగా ముగ్గురు రాజుల దగ్గర వుంచాడు.

ఒక్కో కొడుకు పుట్టిందాకా, ఒక్కో రాజు దగ్గర వుండేట్టు నియమం విధించి, తనకు కావలసిన గుఱ్ఱాలను ఆ ముగ్గురి రాజుల దగ్గర తీసుకున్నాడు. ముందుగా ఇక్ష్వాకు అనే రాజు దగ్గర వుంచాడు. ఆ రాజుకు మాధవి వల్ల - వసుమనస్సు - అనే కొడుకు పుట్టాడు. తరువాత ఆమెను దివోదాసుకు సమర్పించాడు. ఈతనికి ఆమె యందు ప్రవర్ధనుడు అనువాడు పుట్టాడు. ఆ తరువాత, ఔశీ నరుడికిచ్చాడు. అతనికి శిబి అనేవాడు పుట్టాడు. వీళ్ళ ముగ్గురి దగ్గర అయిన తరువాత, గాలవుడు ఆ సుందరిని తీసుకొని తనకు గురువైన విశ్వామిత్రుడికి గుఱ్ఱాలతో పాటు ఆమెను గూడా గురుదక్షిణగా ఇచ్చాడు.

ఇంతమంది దగ్గరకు తిరిగినా, ఇంత జరిగినా దీని వల్ల మాధవి కన్యాత్వం చెడలేదు.

కేవలం మోక్షాన్ని గోరి, అడవుల బట్టి తిరిగే మునులు లౌకిక కార్యాలలో తల దూర్చటం మొదలుపెట్టి రాజాస్థానాలపై మొగం చాచటం జరిగింది.

గాంధర్వం - రాక్షసం - అనే రెండు వివాహ పద్ధతులకు - స్వయంవరం - అనే పద్ధతి ఒకటి తోడయింది.

ఆవు మాంసం తినడం, ఇతర జంతువుల మాంసం తినడం సామాన్యంగానే వుంది. వేదాలను చదివిన బ్రాహ్మణుడైనా మాంసం తినటం తప్పుగా భావించేవాళ్ళు గాదు;

త్రిధన్వుడు - అనే రాజు కాలంలో ఒకసారి పెద్ద కరవు వచ్చింది. విశ్వామిత్రుడంతటివాడే కుటుంబాన్ని పోషించుకోలేక తనకున్న కొడుకుల్లో ఒకణ్ణి వంద గోవులకమ్మి పొట్ట పోషించుకుందామని అనుకున్నాడు. కొడుకును తీసుకుని అమ్మకానికి వీధులవెంట తిరుగుతూ వున్నాడు. త్రిధన్వుని కొడుకు త్రిశంకుడు అనేవాడు విశ్వామిత్రుడి కుటుంబాన్ని పోషించటానికి సిద్ధవడ్డాడు. కాని, ఆతనికి తినుబండారాలు సమకూర్చలేకపోయాడు. చేసేది లేక వశిష్ఠుడి ఆవును దొంగిలించి తెచ్చి, ఆకలి బాధకు తట్టుకోలేక ఆ గోవును చంపి తానే ఆ మాంసాన్ని తిన్నాడు.

ఒకడి భార్యను ఇంకొకడు తెచ్చి వుంచుకోవటం అధర్మంగా తలపబడుతుండేది. త్రయ్యారణ్యుడి కొడుకైన త్రిశంకుడు పెళ్ళి అయిన ఒక స్త్రీని బలత్కా రంగా తీసుకువస్తే, ఆ విషయం తెలుసుకున్న తండ్రి, కొడుకును కోపించి, వాణ్ణి రాజ్యం నుండి తొలగించి, చండాల రూపంలో ప్రవర్తించవలసిందిగా శాపం పెట్టాడు.

కుల విద్వేషం అప్పుడప్పుడే మొగ్గ తొడుగుతోంది. శూర్పణఖ కుమారుడైన జంబుక కుమారుణ్ణి మాయోపాయం పన్ని బ్రాహ్మణులు లక్ష్మణుడితో చంపించారు. అట్లాగే తపస్సు చేసుకుంటున్న నిర్దోషియైన శంబూకుణ్ణి నిర్దయగా రాముడిని ప్రేరేపించి చంపించారు.

# ద్వాపర యుగం

ద్వాపరయుగంలో కొత్తగా ధర్మాలు వ్యాప్తిలోకి వచ్చాయి. రాజ్యకాంక్ష విపరీతంగా పెరిగిపోయింది.

శంతనుడు - అనే రాజు తన పెద్ద సోదరుడైన - దేవాపి - అనేవాణ్ణి రాజ్యం నుంచి తొలగించి, అడవులకు పంపి తానే రాజయ్యాడు. కురుపాండవులు ఇతని సంతతే. వాళ్ళు కూడా హాయిగా తిని కూర్చుండక రాజ్యభాగం కోసం తన్నుకొని చచ్చారు. వాళ్ళు చస్తే చచ్చారు కాని, భరతఖండాన్ని మొత్తాన్ని రక్తంతో తడిపారు. ఆ దెబ్బతో ఈ దేశంలో దారిద్ర్యం తాండవించసాగింది.

రాజ్యం లోకుల పాలవుతుందేమోననే అనుమానంతో, కట్టు కొన్న భార్యల్ని సంతానం

కోసం ఇతర మగవాళ్ళ వద్దకు పంపే ఆచారం వుండేది. దీన్ని - నియోగం - అని చెప్పి ధర్మ శాస్త్రకారులు ఆమోదముద్ర వేసి, సంఘంతో ఆమోదింపచేశారు.

పాండురాజు - ధృతరాష్ట్రుడు - పాండవులయిదుగురు - అశ్మకుడనే రాజు - అంగరాజు - మొదలైన వాళ్ళంతా, ఇట్లా అసలు తండ్రికి గాక, పరాయి మగాళ్ళకు పుట్టినవాళ్ళే.

ఒకే స్త్రీ, ఎక్కువమంది భర్తలను పొందటమనే "బహుపతిత్వం" చాలావరకు తగ్గిపోయింది. గోమాంసం తినటం దాదాపుగా మానివేశారు. గోమేధం (గోవుల్ని చంపటం) నరమేధం (నరుల్ని చంపటం) వంటివి లేవనే చెప్పాలి. అశ్వమేధం కొనసాగుతూనే వుంది.

ఈ రోజుల్లో జర్మనీ దేశ ప్రజలు గుర్రం మాంసం తింటారు. మద్యపానం మానినట్లు లేదు. కృష్ణుడి అన్నయైన బలరాముడు సురాపాన ప్రియుడు. అయినా, అతడికి సంఘంలో గౌరవం తగ్గలేదు. సభా పూజ్యత కూడా కల్గుతూ వుండేది. యాదవ ప్రళయానికి మూల కారణం సురాపానమే.

బ్రాహ్మడి ముఖం నుంచే విద్యా ప్రచారం సాగాలనే వాదం ఒకటి బాగా ప్రచారంలోకి వచ్చింది. శూద్రుడైన ఉగ్రశ్రవసుడు తనకు అభ్యుత్థానం (ఎదురుకొని లేవటం) చేయలేదనే కోపంతో బలరాముడు తప్పతాగిన మైకంతో నాగలితో కొట్టి అతని ప్రాణాలు తీశాడు.

ప్రజల జీవన ప్రమాణం ఎక్కువగా వుండేది అంటే, ఎక్కువ కాలం బ్రతికేవాళ్ళు. చాలా బలంగా వుండేవాళ్ళు.

రామాయణ యుద్ధకాలంలో వున్న ద్వివిదుడు అనేవాణ్ణి బలరాముడు చంపగలిగాడు. జాంబవంతుణ్ణి కృష్ణుడు ఓడించాడు. కురుకుల పితామహుడైన బీష్ముడు పరశురాముణ్ణి ఓడించాడు.

గాంధర్వం - రాక్షసం - స్వయంవరం - అనే పెళ్ళిళ్ళ పద్ధతికి తోడు వధూవరుల తల్లిదండ్రులే పెళ్ళి సంబంధాలు కుదిర్చి పెట్టేవాళ్ళు. శశిరేఖా వివాహం - ఉత్తర పెళ్ళి - అట్లా జరిగినవే.

అక్కడక్కడా వధూవరులు ఏర్పాటుచేసుకున్న నియమ నిబంధనల ప్రకారం కూడా పెళ్ళిళ్ళు జరుగుతూ వుండేవి.

# కలియుగం

విద్య, "బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - అనే మూడు కులాలకే పరిమితం" అన్న మాట ప్రచారంలోకి వచ్చింది. తాము చదువవచ్చును - అనే దాని కంటే గూడా - ఇతరులు చదువరాదు - అనే వితండవాదాన్ని బాగా ప్రచారం చేశారు. ఆడవాళ్ళ

స్వాతంత్ర్యం మంటగలసింది. బుద్ధుడి సిద్ధాంత ప్రచారం వల్ల, అతని ప్రభావం వల్ల యజ్ఞాలు, యాగాలు లేకుండా పోయాయి. బలులు మటుమాయమైపోయాయి.

నరమేధాలకు బదులుగా వాటి స్థానంలో కాళీ పూజ ప్రబలమైంది. గోమేధం - అశ్వమేధం - అనేవి కథల్లోనే నిలిచిపోయాయి. ఆచరణలో ఎక్కడా లేవు. అన్ని రకాల పెళ్ళిళ్ళు కాలక్రమంలో నశించాయి. కట్నకానుకలకు సంబంధించిన నామమాత్రపు పెళ్ళిళ్ళు వెలుగులోకి వచ్చాయి. పెళ్ళిళ్ళ విషయంలో పెళ్ళి కూతురికి - పెళ్ళికొడుక్కి లవలేశం హక్కు కూడా లేకుండా పోయింది. వధూవరుల తల్లిదండ్రులకే సమస్తమైన హక్కులు చేజిక్కాయి.

సమాజంలో బ్రాహ్మణుడికి అపూర్వమైన గౌరవం లభించటం మొదలయింది. "బ్రాహ్మణుడే నా దేవత" (బ్రాహ్మణోమమ దేవతా) అన్న సూక్తి అన్నిరకాలా సార్థక్యాన్ని పొందటం జరిగింది. మంత్రగాడిచేతిలో పడ్డ బొమ్మల్లాగానే రాజులు బ్రాహ్మణుడికి లొంగిపోయి, స్వాతంత్ర్యాన్ని కోల్పోయి రాజ్యతంత్రాన్ని నడపసాగారు.

ఆశ్రమ పద్ధతి నశించింది. కాని, వర్ణధర్మాలు విచ్చలవిడిగా పెచ్చరిల్లాయి. ఒకే స్త్రీ పెక్కుమంది భర్తలను చేసుకోవటం అనేది, చాలా నీచంగా పరిగణించబడ్డది. ఒక పురుషుడు ఎక్కువమంది స్త్రీలను భార్యలూ స్వీకరించటమనేది కూడా అదే పరిస్థితికి వచ్చింది. జంట పెళ్ళిళ్ళే ధర్మమని లోకం భావించసాగింది.

సురాపానం చాలా నీచంగా చూడబడ్డది. భిన్న భిన్న మతాలు పుట్టి, వ్యాప్తి చెంది కొంతకాలం ఒకరి గొంతు మరొకరు కోయటం నిత్యకర్మ మయింది. పూర్వంలాగానే భారతదేశానికి వచ్చిన విదేశీయులు కొందరు, సనాతన ధర్మాన్ని అవలంబించి, యిక్కడే నివసించటం మొదలుపెట్టారు. మతం పేరుతో విరివిగా ప్రచారం సాగి, మానవ మారణహోమం జరగసాగింది.

కుమారిలభట్టు - అనే పండితుడు బౌద్ధుల్ని చంపటమే నిత్య కార్యక్రమంగా పెట్టుకున్నాడు. శంకరుడు కూడా మాయోపాయం చేసి జైనుల్ని, బౌద్ధుల్ని ఎంతోమందిని పొట్టన పెట్టుకున్నాడు. రామానుజుడు వైష్ణవులు కాని వాళ్ళను లెక్కలేనంతమందిని నామరూపాల్లేకుండా మసిచేశాడు.

వావి వరుసలు మంచి కట్టుదిట్టంగా అమల్లోకి వచ్చాయి. ఈ విషయంలో పెద్దల ఆచారాలను తిరస్కరించినవాళ్ళు సంఘంలో చాలా నీచంగా చూడబడడం జరిగింది. సామాన్య ప్రజలు తమ ధర్మమేమిటో-సత్యమేమిటో తెలియక విచారంలో మునిగి గజిబిజి అయ్యారు. "విస్సన్న చెప్పిందే వేద"మన్నట్టు బ్రాహ్మణుడు చెప్పిందే పరమ ప్రమాణమయింది. అతని మాటలే మణిమంత్రౌషధాలుగా చెలామణిలోకి వచ్చాయి.

నీచమైన ఈ పరిస్థితిని ఆధారం చేసుకుని, బ్రాహ్మణులు ప్రజల సూక్ష్మ దేహాలనే

నాశనం చేశారు. వాళ్ళు దీని కోసం అవలంభించిన పద్ధతులు లోకంలోని పండితు లందరిచేతా అసహ్యించుకోబడ్డాయి. పురాణాలు చెప్పేవాళ్ళంతా, ధర్మాన్ని రెండుగా విభజించారు. ఒకదాన్ని సామాన్య ధర్మమన్నారు. రెండోదాన్ని విశేష ధర్మమన్నారు. లోకాన్ని వంచించారు.

విశేష ధర్మాలనేవి, ఇతరుల్ని పీల్చి పిప్పి చేయటానికి బ్రాహ్మణులు విసిరిన ఉచ్చులు. కాలక్రమంలో వాళ్ళు పన్నిన పురులే చివరికి వాళ్ళ గొంతుల్ని నులిమివేయటానికి పనికివచ్చే సాధనాలయినాయి. ఆర్యజాతి పతనానికి ఇవే కారణభూతాలయినాయి, ఆర్య ధర్మం తురక మసీదయింది. ఏనుగు మింగిన వెలగపండయింది. మధువ్యాధి సోకిన వ్యక్తి లాగే ఎండిపోయిన కళేబరమయింది. ఇతర మతస్థులు దీన్ని మింగేశారు. హిందువు అని పిలువబడ్డవాడు నిలువుగుడ్లు వేసి లోకం వంక దేబెలాగ చూడవలసి వచ్చింది. జీవం లేని బొమ్మ అయింది. చేసేది లేక పనికిమాలిన, సారం లేని వేదాంతాన్ని ఆశ్ర యించవలసి వచ్చింది.

# వర్తమానం

చదువు - అందరికీ అందుబాటులోకి వచ్చింది. అది సర్వసామాన్య మైందిగా భావించబడ్డది. కులాన్ని బట్టి ధర్మాన్ని నిర్ణయించడం - అనే విషయంపై బ్రాహ్మణుడు కాక, తక్కినవాళ్ళంతా తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటు యుద్ధంలో బ్రాహ్మణులోడిపోయారు. ఇతరులే గెలిచారు. ఇంతకాలం నిద్రావస్థలో వున్న బ్రాహ్మణేతరులు మేల్కొని, చైతన్యవంతులై యుద్ధరంగానికి పరుగులు తీస్తున్నారు.

తమిళనాడులో "ద్రావిడ సంఘాలు" ఆంధ్రదేశంలో "బ్రాహ్మణేతర సంఘాలు" మహారాష్ట్రలో "సత్యశోధన పంథ్" వంటి సంఘాలు బెంగాలులో "కాయస్థుల తిరుగుబాటు" ఉత్తరాదిన 'ఆర్య సమాజం' 'హిందూ మహాసభ' వంటివి ఏకపక్షంగా పౌరాణికులు స్థాపించి, ప్రచారం చేస్తున్న విశేషధర్మాన్ని ముక్కలు ముక్కలు చేయటానికి ప్రయత్నాలు చేస్తున్నాయి.

పెక్కు శతాబ్దాలనుండి ఎండి ఎండి జీవచ్ఛవంలాగా వున్న హిందూ సంఘానికి పై సంస్థలన్నీ జీవకళలని భావించాలి. ఇక హిందూ సంఘం సర్వాంగ సుందరంగా జీవిస్తుంది. ఇతర మతస్థుల్ని - ఇతర జాతుల వాళ్ళను హిందూ సంఘంలో కలుపుకొనటం వల్లా, చండాలురు మొదలైన అట్టడుగు జాతులకు స్వత్వం ఈయటం వల్లా, మళ్ళీ భారతఖండంలో సోదరభావం స్థాపించటం వల్లా, దుర్మార్గుల వాతబడి మరణించిన శ్రాద్ధానంద స్వామి అమరుడయ్యాడు.

వావివరుసలు మళ్లీ సన్నగిల్లుతున్నాయి. అజ్ఞానంతోపాటు మూఢవిశ్వాసం

అంతమౌతోంది. బ్రాహ్మణ పండితులకే వన్నె తేగలిగిన విద్వాంసులు బ్రాహ్మణేతరులలో వృద్ధికాసాగారు. దీనితో బ్రాహ్మణ గౌరవం మండువేసవికాలపు నదిలోని నీటిలాగా మాయమైపోతున్నది. బ్రాహ్మణేతర కులాల వాళ్ళకు దాస్య విముక్తి కలుగుతున్నది.

బ్రాహ్మణ పౌరోహిత్యం లేకుండానే వందలకొద్దీ పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. స్త్రీలకు స్వాతంత్ర్యం కావాలనే, స్త్రీ స్వాతంత్ర్యవాదులు బయలుదేరుతున్నారు. స్వాతంత్ర్యం అలవడుతుంది. పెళ్ళిళ్ళ విషయంలో ఇది తేటతెల్లమవుతుంది. స్వైరవిహారం కూడా ఎక్కువవు తోంది. పట్టణాల్లో వున్న ఈ పరిస్థితి క్రమక్రమంగా పల్లెటూళ్ళకు గూడా వ్యాపించడం మొదలుపెట్టింది.

ఎండ కన్నెరుగని వనితల బిడ్డలు పట్టణాలకు వచ్చి పనీపాటా లేకుండా వీధుల వెంట విచ్చలవిడిగా తిరగడం కనిపిస్తుంది. విశేషధర్మం పట్ల ప్రజల్లో అభిమానం చచ్చిపోవటం వల్లా, ప్రభువుల సహాయం లేని బ్రాహ్మణులు వాటిని ఆచరణలో పెట్టటం కష్టమై ఆచరణలోనికి తేలేకపోతున్నారు. హెచ్చుతగ్గులు లేక న్యాయం సమానమైంది. కృత - త్రేత - ద్వాపర యుగాలలో మాదిరే మద్యపానం అన్ని కులాలలోకి ప్రవేశించింది. అప్పుడే కొన్ని కులాల వాళ్ళకిది శిష్టాచారమైంది. విడిచిపెట్టబడ్డ గోమాంస భక్షణం, పడమటి దేశస్థుల సహవాసం వల్ల చదువుకొన్నవాళ్ళకు నెమ్మదిగా అలవాటవుతోంది.

డబ్బు మదమెక్కినవాళ్ళూ - సంపదకైపు జీర్ణించిన వాళ్ళూ కొంతమంది వావివరుసలు లేకుండా విహరిస్తున్నారు. ఇతర మతాల వారితో, ఇతర కులాల వారితో పెళ్ళిళ్ళు జరగటం మొదలయ్యాయి. విధవా వివాహాలు గూడా అధికమయ్యాయి. మత విషయంలో అందరికీ సరిసమానమైన హక్కులు కలుగుతున్నాయి.

## ఏది కలియుగం?

పౌరాణికులు ప్రస్తుత కాలాన్ని కలియుగం మొదటి పాదం జరుగుతోందని అంటున్నారు. నిజంగా, ఇది కలియుగం మొదటిపాదమో? లేక సంధి కాలమో? ప్రస్తుతం తెలిసిన లక్షణాలనన్నిటిని ఒకచోట గుదిగుచ్చి విపులంగా చర్చించి, ఏది, ఏ యుగమో పాఠకులకే నిర్ణయం వదలుతున్నాం.

## కృతయుగం

ఈ యుగంలో పెళ్ళిళ్ళు లేవు.

వావి వరుసలు అవసరం లేదు. ఆడ-మగ అనే భేదం ఒక్కటే పాటింపబడుతూ వుండేది.

(అ) బృహస్పతి - సొంత అన్నయైన రుచికుడు - అనేవాని భార్య-

మమత - అనే ఆమెతో సంభోగించి, అనుభవించాడు.

(ఆ) చంద్రుడు - చదువు నేర్చుకొనటానికనిపోయి, గురువు భార్య, 'తార'తో సంబంధం పెట్టుకొని, బుధుడు - అనే కొడుకును కన్నాడు.

(ఇ) సుదర్శనుడు - అనేవాడు సొంత మనవరాలితో కూడి సంతానాన్ని కన్నాడు.

(ఈ) ఆకుతీరుచి ప్రజాపతికి పుట్టిన - యజ్ఞుడు అనే మగపిల్లవాడు, సుదక్షిణ - అనే ఆడపిల్ల అన్నాచెల్లెళ్ళైనప్పటికీ భార్యాభర్తలు అయ్యారు.

II. పన్నెండు రకాల వాళ్ళను కొడుకులుగా అంగీకరించారు. వీళ్ళనే ద్వాదశ పుత్రులని అంటారు.

(1) ఔరసుడు (2) క్షేత్రజుడు (3) దత్తుడు
(4) కృత్రిముడు (5) గూఢోత్పన్నుడు (6) అపవిందుడు
(7) కానీనుడు (8) సహోఢజుడు (9) క్రీతుడు
(10) పౌనర్భవుడు (11) స్వయందత్తుడు (12) పారశవుడు
(13) శౌద్రుడు

(అ) క్షేత్రజుడు - భర్త ఇష్టప్రకారం భార్య రంకుతనం చేయగా పుట్టిన కొడుకు.

(ఆ) గూఢోత్పన్నుడు - మగనికి తెలియకుండా, రంకుమగడికి పుట్టినవాడు

(ఇ) కానీనుడు - పెళ్ళి కాకముందే, రంకుమగడికి పుట్టినవాడు

(ఈ) సహోదజుడు - గర్భవతిగా వుండగా, పెళ్ళి చేసుకున్న ఆమెకు పుట్టినవాడు

(ఉ) పౌనర్భవుడు - మారుమనువు చేసుకున్న స్త్రీకి అంతకుముందే పుట్టిన కొడుకు

ఇంతకంటే పచ్చి వ్యభిచారం ఇంకోటి వుండటం సాధ్యమా?

III. గోమేధం - నరమేధం - ఎక్కువగా వున్నాయి.

IV. సారాయి తాగడం తప్పుకాదు.

V. మనుషులు అబద్ధాలాడరు.

# త్రేతాయుగం

I. పెళ్ళిళ్ళు ఈ యుగంలో ఆచరణలోకి వస్తున్నాయి. వావి వరుసలు నియమబద్ధం అవుతున్నాయి.

(అ) తన గురుపుత్రి దేవయాని - అనే ఆమె తనను పెళ్ళి చేసుకొమ్మని బలవంతం చేస్తే కచుడు - గురువు కూతురు గదా, అని తిరస్కరించాడు.

(ఆ) త్రిశంకువు - అనేవాడు పెళ్ళి అయిన ఒక స్త్రీని బలాత్కరించి తీసుకువచ్చాడు; ఆ విషయం తెలుసుకున్న అతని తండ్రి, త్రయ్యారణ్యుడు కొడుకును కోపించి, 'చండాలుడవుకమ్ము' అని శాపం పెట్టాడు.

(ఇ) సీతను రావణుడు మోసగించి తీసుకుపోతే, లోకం అతణ్ణి ఆడిపోసుకుంది.

(ఈ) నియోగమనే పద్ధతి ఆచారంగా వుంది. మదయంతీ వసిష్ఠుల కూడిక ఇందుకు ఉదాహరణ. అయినా, ఇది అరుదుగా వుందనే చెప్పాలి. మద్యపానం బాగానే వుంది. కాని, శుక్రుడు సురాపానం పాప హేతువని శాపం పెట్టాడు.

సత్యానికి హాని కల్గటం మొదలయింది. అందువల్లనే, ఆబద్ధాలపుట్ట అయిన హరిశ్చంద్రుడికి, సత్య పరిపాలనావ్రతం అంటగట్టి లోకానికి నీతిని బోధించడానికి ప్రయత్నాలు జరిగాయి. క్షేత్రజుడు - కానీనుడు - మొదలయిన సంతానం ధర్మ సంతానంగానే అంగీకరింపబడ్డారు.

# ద్వాపరయుగం

(అ) వావివరుసలతో పెళ్ళిళ్ళు ఏ ఆటంకం లేకుండా జరగడం మొదలయింది. కుంతి పెళ్ళికాకముందే కర్ణుణ్ణి కన్నప్పటికీ. 'ఇది తప్పు' అనే అభిప్రాయం లోకంలో చోటుచేసుకోవటం వల్ల, దుర్వాసుడి కోపాన్ని అడ్డం పెట్టవలసివచ్చింది.

(ఆ) ద్రౌపది పెక్కుమంది భర్తల్ని పొందటం 'మంచి ఆచారమే' అని చెప్పటానికి వ్యాసుడు కావలసి వచ్చాడు.

(ఇ) గోమేధం గాని, నరమేధం గాని వున్నట్టు దాఖలాలు లేవు.

(ఈ) బలరాముడు తాగుబోతు. ఎప్పుడూ మత్తుగా వుంటాడు. దీనివల్ల అతని పూజ్యత తగ్గలేదు.

(ఉ) సత్యశీలత కన్నా, కార్య చతురతకే ఎక్కువ గౌరవం వుంది.

(ఊ) క్షేత్రజుడు - కానీనుడు - ఇంకా ధర్మసంతానంగానే పరిగణింపబడ్డారు. అయినప్పటికీ - పాండురాజు - ఇది ధర్మవిరుద్ధం కాదని పెద్ద వుపన్యాసం చేయవలసి వచ్చింది. ఇట్లాంటి సంతానానికి అక్కడక్కడా, అప్పుడప్పుడూ ఎత్తిపొడుపుల ముడుపు తగులుతూనే వుంది.

(ఋ) కులాన్ని బట్టి గౌరవంగాని, అగౌరవం గాని కలగటం మొదలయ్యింది. సంజయుడు - విదురుడు - ఉగ్రశ్రేణుడు మొదలైనవాళ్ళ చరిత్ర దీనికి సాక్షీభూతం.

(ౠ) నరమేధాలు నరబలులుగా మారాయి. నరకుడు పదహారువేల మంది రాచకన్నెల్ని చెరబట్టాడు. జడభరతుడు కాళికకు బలిగా తీసుకొనిపోబడ్డాడు.

# కలియుగం

(అ) పెళ్ళిళ్ళలో కట్టుదిట్టాలు బాగా ఎక్కువయ్యాయి. వావివరుసలు లేకుండా చేసుకున్న పెళ్ళిళ్ళు నలుగురి నోళ్ళల్లో నానసాగాయి.

(ఆ) భర్తతోటే లోకమని చెప్పి, భర్త మరణిస్తే ఆ చితి మంటల్లోనే పడి పేరంటాళ్ళుగా, సతులుగా కావటం ఎక్కువగానే కనిపిస్తుంది.

(ఇ) అశ్వమేధం - నరమేధం - గోమేధం వంటివి నశించాయి. మద్యపానం చాలా నీచంగా చూడబడుతుంది. "తాగుబోతును నమ్మావా... గంగానమ్మా!" అనే రీతిగా నీచమైన ధోరణిలో సామెతలు గూడా పుట్టాయి. తాగుబోతుకు అన్ని దుర్గుణాలూ వున్నాయని ప్రజలు ఏవగించుకోవటం జరుగుతుంది.

(ఈ) నీతి, నిజాయితీగా వుండేవాడిని చూచి, అలౌకికుడని వెక్కిరించటం వుంది. కడుపున పుట్టిన బిడ్డ. దత్తత తీసుకున్నవాడు తప్ప, తక్కినవాళ్ళను అధర్మ సంతానంగా లెక్కించి, నీచంగా చూడటం జరుగుతుంది.

(ఉ) ఒకే స్త్రీ పెక్కుమందిని భర్తలుగా పొందే, బహుపతిత్వం లేదు. అయితే, ఒకే పురుషుడు ఇద్దరు, ముగ్గురు భార్యల్ని పొందే బహు సతీత్వం అక్కడక్కడా కనిపిస్తుంది.

(ఊ) మాంసం తినే వాళ్ళున్నారు. కాని, మాంసం తినటం పాపం - అనే ప్రచారం కూడా వుంది. పితరుల దినాలలో మాత్రం మాంసం తినటం శాస్త్రసమ్మతంగా భావింపబడుతుంది.

(ఋ) కులాన్ని బట్టి సమాజంలో గౌరవం - అగౌరవం కలగటం వుంది.

(ౠ) శక్తి పూజ- అనే వంకతో దేశంలో నరబలులు సాగుతున్నాయి. ఔరా! దీనిని బట్టి విచారిస్తే, కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుందని చెప్పే మాటకు అర్థం ఏమిటో తెలియకుండా వుంటుందా? నలుగురు కలిసి ఎంత నీచ కార్యాన్నైనా, ఎంతటి అధర్మాన్నయినా ధర్మంగా ప్రచారం చేసి చిత్రించారన్నమాట. మసిపూసి మారేడుకాయ చేశారు. తెలియని సంస్కృత భాషలో వున్న కథలని ప్రజలు తప్పకుండా అంగీకరిస్తారనేది అందరికీ తెలిసిన విషయం. దానిలో ఏముందో? ఏం చెప్పబడ్డదో తెలియదుగా? ఏదో గొప్పతనం వుందనుకొందాం. అందుకే బ్రాహ్మణులు సంస్కృత భాష చాలా పవిత్రమైందనీ, అది దేవతల భాష అనీ, ఆ భాషలో చెప్పబడ్డదంతా భగవంతుడు చెప్పిందేనని, ఆ భాషలో వున్న గ్రంథాలను ఇతర భాషల్లోకి అనువాదం చేస్తే ఆ గ్రంథాలకున్న పవిత్రత నాశనమౌతుందనీ ప్రచారం కావించారు .

సంస్కృత భాషలో వుండే మంత్రాలను తెలుగు భాషలోకి అనువదిస్తే, వాటిలో వుండే అర్థాలు సులభంగా బోధపడతాయి. అందులో వుండే నీతులూ, ధర్మాలూ

తేటతెల్లంగా తెలుస్తాయి. వాటిల్లో ఏమన్నా ప్రజలు గ్రహించవలసిన మంచి వుంటే స్వీకరిస్తారు. లేకపోతే తిరస్కరిస్తారు. కార్యకలాపమంతా ఇట్లాగే సంస్కరింపబడడం ఎంతో ఉత్తమం.

పూర్వం ఒకప్పుడు ఇంగ్లీషు జాతికి చెందిన పెళ్ళిళ్ళు మొదలైన శుభకార్యాలకు సంబంధించిన మంత్రాలూ- అంత్య కర్మలకు సంబంధించిన మంత్రాలూ – ఆ ప్రజలకు అర్థంకాని – 'లాటిన్' భాషలో వుండేవి. అర్థం కాని భాషలో వుండే ఆ మంత్రాలను కాలక్రమంలో ఇంగ్లీషు భాషలోకి అనువాదం చేసుకొన్నారు. దీని వల్ల ప్రజలకు 'తాము' ఏం మాట్లాడుతున్నామో ఆ మంత్రాల్లో వుండే అర్థం ఏమిటో తేలికగా గ్రహించగలిగారు. భావం ఏమాత్రం తెలియకుండా, మంత్రాలను ఉచ్చరించే విధానంకన్నా, అందరికీ సులభంగా తెలిసేట్టు చేయటం ఎంత మంచిది? సామాన్య ప్రజలు భావాన్ని గుర్తించకుండా, అర్థాన్ని తెలుసుకోకుండా, కేవలం శబ్దాలకు మాత్రమే ఎంతకాలం గౌరవాన్ని చూపిస్తారో, అంతకాలం అభివృద్ధి అనేది కనిపించదు. అన్ని వేల సంవత్సరాలు కడచినప్పటికీ ద్విజులు కానివారికి సామాన్య ధర్మంతో కాలక్షేపం చేసే అర్హత కల్గలేదు. స్మృతులు ఉదారభావాన్ని చూపించటం లేదు.

హిందూరాజులు తమకు ధైర్య సాహసాలు లోపించటం వల్ల, బానిస సంకెళ్ళను తగిలించుకుని సామాన్య ప్రజల బాధలకు విముక్తి చూపించలేకపోయారు. పైపెచ్చు అడ్డంకుల్ని కల్పించారు కూడా. చివరకు విదేశీ ప్రభువుల పాలనలో ప్రజలకు విముక్తి మార్గం లభిస్తుంది. ఈ మార్పు చాలా విచిత్రమైంది.

స్వదేశీ ప్రభువుల కాలంలో లభించని మహోపకారం విదేశీ రాజుల కాలంలో తటస్థించటం ఎంతైనా చెప్పుకోదగ్గది.

# సూత పురాణ రచన ఎందుకు?

వేదం చదివే అర్హత లేని జన సామాన్యానికి, ఆ వేదంలో వుండే అర్థం సులభంగా తెలిసేట్టు చేయటానికి, వేదాన్ని చదువుకున్న పండితులూ, నిష్కాములూ, భౌతిక సుఖాలను కోరనివాళ్లూ, భూత దయ గల ఋషులూ, జన సామాన్యంపై దయ గలిగి వాళ్ళనుద్ధరించటం కోసమని 'స్త్రీ, శూద్ర ద్విజ బంధువులకు' అందుబాటులో వుండేట్టు వేదాలలోని అర్థాలను వివరిస్తూ పురాణాలు రాశారని పెద్దలంటుంటారు.

మూఢలోకం ఈ మాటలు నిజమని నమ్మి, పురాణాలన్నీ ఋషులు వేదార్థాన్ని మనకు వివరించటం కోసం రాశారనీ, అందువల్ల ఇవి పూజింపదగ్గవనీ అనుకొంటారు. అంతేగాక, ఆ పురాణాల్లో వుండే కథలూ – వాటిల్లోని నీతులూ – ధర్మాలూ – అన్నీ శిరోధార్యాలనే భ్రమిస్తున్నారు.

ఈ రకమైన విశ్వాసం వల్ల కలిగిన ప్రతిఫలం, ఆత్మద్రోహంగా పరిణమించింది. అందువల్ల పురాణాలు నిజంగా ఎంతవరకు వేదాలకు అనుకూలంగా వుంటాయో? ఎంతవరకు వ్యతిరేకంగా వుంటాయో? ఎంతవరకు నీతికి విరుద్ధంగా వుంటాయో? ఎంతవరకు పక్షపాతంతో నిండివుంటాయో కళ్ళు మూసుకున్న పండిత లోకానికి వివరించాలనే ఆలోచనతో సూత పురాణం రాయబడ్డది. ఆ కారణం వల్ల సూతపురాణం - కారణజన్మ - అని చెప్పాలి.

భగవంతుని అవతారాలని చెప్పేవాళ్ళను గూర్చి కూడా అసభ్యమైన వర్ణనలు చేయటానికి పురాణాలు జంకలేదు. దానికి నిదర్శనంగా ఒక కథను క్లుప్తంగా వివరిస్తా.

"పూర్వం ఒకప్పుడు తారకుడనే రాక్షసుడున్నాడు. అతడు ఎదురు లేని తన భుజబలంతో మూడు లోకాలనూ జయించాడు. ఇంద్రుడు మొదలైన దేవతలను గూడా తన యింటి దాసులుగా చేసుకొని పాలన చేస్తూ వున్నాడు.

తారకుడి దాడిని సహించలేక, యింద్రుడు మొదలైన దేవతలు విష్ణువుతో ఆలోచించారట. అప్పుడు విష్ణువు - 'పురాణ దంపతులైన పార్వతీ పరమేశ్వరులకు పుట్టిన కొడుకే తారకుణ్ణి చంపగలడ'ని గట్టిగా చెప్పాడు.

ఈ సంగతి తెలిసిన దేవతలు కొంతసేపు గుసగుసలు పోయి, చివరకు మన్మధుణ్ణి ప్రేరేపించి, పురాణ దంపతులకు కామోద్రేకం పుట్టించి, కామక్రీడకు లోనుచేశారు.

పార్వతీ పరమేశ్వరుల కామక్రీడకు అంతు అంటూ లేకుండా పోయింది. శత్రువైన తారకుని యింటిలో దాస్యం చేస్తున్న ఇంద్రుడు మొదలైన దేవతలు, ఈ ఆలస్యానికి తట్టుకోలేకపోయారు. ఇక భరించలేమని భావించి, అగ్నిని పిలచి, 'పురాణ దంపతులు ఏం చేస్తున్నారో చూచి రమ్మ'ని చెప్పి పంపారు.

అగ్ని భయపడుతూ, భయపడుతూ దొంగ నడకలతో పోయి "పురాణ దంపతులేం చేస్తున్నారో" అని తొంగిచూశాడు. అప్పుడు పార్వతి అగ్నిని చూచి, దిగంబరంగా వున్న ఆమె తత్తరపడి చాటుకు పోయిందట. ఆ పరమశివుడికి వెంటనే రేతస్సు పడిపోయిందట.

ఎక్కడ బడ్డది? ఎక్కడో కాదు; ఎదురుగా నిలుచున్న అగ్ని నోటిలో పడ్డదట; ఇంకేముంది? అప్పుడగ్నికి ఏం చేయడానికి తోచక, గబగబా గంగానదికి పోయి, నోరు కడుక్కున్నాడు. అప్పుడు అగ్ని నోటిలోని రేతస్సు గంగానది వొడ్డున పెరిగిన రెల్లు దుబ్బుల్లో పడిందట. వెంటనే, ఆ రెల్లు దుబ్బుల్లో నుంచి ఆరు మొగాలు, పన్నెండు చేతులతో కుమారస్వామి అనేవాడు పుట్టుకువచ్చాడట. ఇక తరువాత అతడే దేవతల సైన్యానికి నాయకుడై, తారకుణ్ణి చంపాడట."

ఈ కథ స్త్రీ శూద్ర ద్విజ బంధువులకు చెప్పబడ్డది.

ఇది స్త్రీలు నిస్సంకోచంగా చదవటానికి వీలుగా వున్న కథ - అని అందామా?

ఇట్లాంటి కథనూ - రోత పుట్టించే వర్ణనలూ - విన్న తరువాత మనస్సు చలించకుండా వుంటుందా? విపరీతమైన ఆలోచనలు పుట్టకుండా వుంటాయా? కొంతమంది మహానుభావులు బయలుదేరి, ఈ బూతుకథలకు వేరే అర్థాలున్నాయని చెప్పటానికి ప్రయత్నం చేస్తారు; చేస్తున్నారు; చేశారు కూడా.

బూతును నీతిగా మలచటానికి దొడ్డిదారి తొక్కుతారు.

నిజంగానే, ఇట్లాంటి కథలకు అందరూ మెచ్చుకోదగిన అర్థంగాని, నీతిదాయకమైన విషయం గాని వుంటే, ఇట్లాంటి భాషలో పనికిమాలిన అసభ్యకరమైన వర్ణనలతో ఈ కథలను చెప్పటం ఎందుకు? పనికిమాలిన విషయాలుంటాయా?

తెలుగుదేశంలో ప్రచారంలో వున్న చిత్ర విచిత్రాలైన ఎన్నో కథల్ని ప్రచారం చేసి, వాటినన్నిటినీ తెనాలి రామకృష్ణుడే చెప్పాడని, బూతు కథలు మొదలుకొని నీతికథల దాకా ఆయన మెడకు చుట్టారు.

అట్లాగే పిచ్చి పిచ్చి కథలు రాసి, పురాణాల పేరుతో ప్రచారం చేసి, అన్ని పురాణాలూ వ్యాసుడే రాశాడని ప్రచారం చేశారు. ఇదొక అలవాటుగా, ఆచారంగా మారింది.

అందుకే పాఠక మహాశయా! వివేకంతో మంచిచెడ్డల్ని ఆలోచించి పుస్తక పరిశీలన చేయడం అవసరం. ఇక పరమ దయాస్వరూపుడయిన సూతముని చిరంజీవి. ఆయన ద్వాపర యుగం నుంచి గంగానదివొడ్డున భయంకరమైన తపస్సు చేసుకొంటూ, ఈనాడు భారతదేశంలో జరుగుతున్న వంచనను - మోసాన్ని - కాపట్యాన్ని - పూర్తిగా గ్రహించాడు. ఈ స్థితికి జాలిపడి లోకాన్ని మంచిమార్గంలో నడిపించటానికి ఆలోచించాడు. మేమంతా ఆయన శిష్యపరమాణువులం. అందుకే మా మీద దయతలచి, సత్యాన్ని బోధించి మమ్మల్ని ఈ ప్రయత్నానికి పురికొల్పాడు. మేం కూడా గురువుగారి ఆజ్ఞకు కట్టుబడి ఈ గ్రంథం రాయడానికి పూనుకున్నాం.

ఓ బ్రాహ్మణుడా! లోకం మారుతోంది. ఈ మార్పును గమనించాలి. ఆత్మ రక్షణకోసం ఎట్లాంటి కట్టుదిట్టాలు జరుగుతున్నాయో చూడు - హిందూ సంఘంలో నీ వొక్కడివే పండితుడివై వుండి, తక్కిన వాళ్ళంతా పామరులుగా వుండి, అధికారం చెలాయించాలని, ఇంకా ప్రయత్నం గనుక చేస్తే, కొన్నాళ్ళకయినా కుల నాశనం - సంఘ నాశనం కాక తప్పదు. ఇతర సమాజాలు నిన్ను దిగమింగుతాయి, ఇది తప్పదు.

జపాను దేశంలో - "సామోయ్" - జాతి చూపించిన ఆత్మత్యాగంలో నూరోవంతు చూపించినా చాలునే? అది కూడా చూపించలేవా? ఇది ఆత్మ త్యాగము కాదు; ఆత్మ రక్షణ కూడా! ముందుచూపుతో ఆలోచించు. బ్రాహ్మణులు కాని విద్యార్థులను కొండపల్లెకు తీసుకొని పోయి, 'పరాభవించానులే' అని కులుకుతున్నావా? దీని ప్రతిఫలం ఆలోచించు. బాలుర సుకుమారమైన మృదువైన మనస్సులలో ఏ రకమైన విషబీజాలు నాటుతున్నావో

ఒక్కసారి చూడు. నీ మంచిచెడ్డల్ని కూడా నీవు చూడడం లేదు; ఎందువల్ల?

జీవితంలో ఏ మచ్చా లేనివాడూ, మీ అందరికంటెనూ పూర్వాచారాలంటే మక్కువ గలవాడూ అయిన - మాలవ్యా - పండితుడిలో ఎంత మార్పు వచ్చిందో గమనించావా? ఆ విషయాన్నైనా నీవు గుర్తించాలి. దొంగవై, యిన్ని వేల సంవత్సరాలు ప్రత్యేకమైన హక్కుల్ని అనుభవించావు. వాటిని తిరిగి సంఘానికి అప్పజెప్పడానికి కొంపలు మునిగినంత బాధపడతావెందుకు? నీ తాత ముల్లె ఏమైనా పోతుందా?

సంఘానికి హక్కుల్ని అర్పించకుండా, యింకా ఎంతకాలం వాటిని పట్టుకుని వేలాడతావు? ముమ్మాటికీ ఆలోచించుకొని కార్యానికి సిద్ధంగా! పరుషంగా మాట్లాడుతున్నామని మాపై నీకు కోపం వద్దు. నిజం ఎప్పుడూ కఠినంగానే వుంటుంది గదా! పామరుల సంగతి యెట్లా వున్నా, పండితలోకం మాత్రం నేను రచించిన పుస్తకాల పట్ల ఇదివరకు చూపిన ఆదరణనే చూపాలని ప్రార్థిస్తున్నా.

మా అభిప్రాయంతో మీరేకీభవింపకపోయినా, కనీసం విమర్శించటం కోసమైనా గ్రంథాన్ని చదవాలని కోరుతున్నా -

**ఇట్లు**

**విధేయుడు**

**గ్రంథకర్త**

# వచన సూత పురాణం

నేను త్రిపురనేని రామస్వామిని. చిన్నతనంలో మీలాగే స్కూల్లో చదువుకున్నా - క్లాసు పుస్తకాలే గాక రకరకాల పుస్తకాలు చదివాను.

మనకు పద్దెనిమిది పెద్ద పురాణాలు - పద్దెనిమిది చిన్న పురాణాలు వున్నాయి. నేను అన్నీ చదివా. చదవటమంటే మామూలుగా గాదు సుమా! ఎంతో భయంతో, భక్తితో చదివా. చదువుతున్న కొద్దీ నా బుర్రలో ఎన్నో సందేహాలు పుట్టాయి. ఆ సందేహాలు తీరక, తీర్చే వాళ్ళనందరినీ అడిగేవాడిని. ఒక్కళ్ళు గూడా నా అనుమానాల్ని తీర్చేవాళ్ళు గాదు. విసుగు పుట్టింది. నా మనస్సు మనస్సులో వుండేది కాదు. అయినా తృప్తి తీరక ఇంకా ఎవరైనా చెపుతారేమోనని తిరుగుతూ వుండేవాడిని. “ఫలానా మనిషి” బాగా చదివాడని తెలిస్తే ఎంత కష్టమైనా ఆయన దగ్గరకు పోయేవాడిని. తీరా... వాళ్ళ దగ్గరకు పోయి “ఏమండీ! పురాణాల కథల్లో నాకు ఫలానా అనుమానం వుంది, కాస్త చెపుతారా? అని అంటే, వెంటనే - ‘తప్పు తప్పు- అట్లా అనగూడదని ఒకాయన అనేవాడు.

“ఏమండీ! నాకీ కథలో సందేహం వుంది - ఈ కథ నిజమేనంటారా? అని సందేహం బయట పెట్టాననుకోండి”, “లెంపలేసుకో! ఇంకెప్పుడూ ఇట్లా అనమాకు!” అని ఇంకో పండితుడు జడిపించేవాడు.

“అయ్యా! ఇదుగో ఈ పురాణంలో నాకేదో తప్పు కనిపిస్తుంది. ఏమంటారు?” అన్నాననుకోండి. “నీకేదో పోయేకాలం వచ్చింది. ఎంత అపచారం... ఎంత అపచారం!” అని నోటి మీద చేయి వేసుకొని నా నోరు నొక్కేవాడు ఇంకో పెద్దమనిషి.

“ఇటు చూడండి! నాకీ కథ నమ్మటానికి అనుమానంగా వుంది. దీంట్లో చాలా తప్పులు కనిపిస్తున్నాయి. నిజమో, అబద్దమో చెపుతారా?” అని అంటే, కొంప మునిగినట్లుగా బాధపడి, “నీవు చాలా తప్పు చేస్తున్నా వని” మందలించేవాడు ఇంకొక పండితుడు.

ఇట్లా రకరాలుగా చెప్పి నాలో కలిగిన సందేహాలను ఎవరూ తీర్చలేదు. పైగా నానారకాలుగా శాపనార్థాలు పెట్టేవాళ్ళు. పురాణాల్లోని ఒక్క కథ కూడా ప్రశ్నలు వేస్తే నిలవదు. అన్నీ అభూతకల్పనలుగా కన్పిస్తాయి;

రోజురోజుకీ నా బుర్ర వేడెక్కుతోంది. చదువుతున్న కొద్దీ సందేహాలు పేరుకుపోతున్నాయి. రాత్రిళ్ళు నిద్ర సరిగా పట్టదు. అన్నం తినబుద్ధిగాదు. రాత్రింబవళ్ళు ఒక్కటే ఆలోచన, కనిపించిన వాళ్ళందర్నీ అడగటమే. ఒక్కళ్ళూ సమాధానం చెప్పరు. ఏం చెపుతారు? అన్నీ పిట్టకథలేనాయె? వాళ్ళనీ, వీళ్ళనీ అడిగి అడిగి విసుగు పుట్టింది;

నిరాశ కూడా కల్గింది.

ఇట్లా కొంతకాలం గడిచింది. ఒకనాడు భోజనం చేసి కిళ్ళీ వేసుకుని నములుతూ ఏదో ఆలోచిస్తున్నా. ఉన్నట్లుండి ఆకస్మాత్తుగా మెరుపు మెరిసినట్లు ఓ ఆలోచన తట్టింది. దానితో ఎగిరి ఒక్క గంతేశా. 'భలే... ఆలోచన' అని నాలో నేనే సంబరపడ్డా.

"పురాణాలన్నీ వ్యాసుడనేవాడు చెప్పాడని గదా! అంటారు. ఇతడు అన్నీ తెలిసిన మంచివాడనే అంటారు. ఈయన సూతుడికి చెప్పాడంట. సూతుడు విచారించకుండానే నేర్చుకున్నాడా? ఇతడు మళ్ళా ఈ కథలన్నిటినీ యజ్ఞయాగాలు జరిగే సమయాల్లో, అక్కడకు జేరిన శౌనకుడు మొదలైన మునులందరికీ చెప్పాడట. మునులంటే సామాన్యులా? మంచి తెలివిగలవాళ్ళు. అంత తెలివిగల వాళ్ళు కూడా సూతుడు చెప్పిన కథల్ని ప్రశ్నించకుండా, ఎదురు మాట్లాడకుండా విన్నారట.

ఎట్లా విన్నారు? 'దున్న ఈనిందంటే దూడను గాట్లో కట్టేయమన్నట్లుంది' వీళ్ళ తెలివి చూస్తుంటే. చిలిపి కథలు వింటుంటే, అనుమానాలే రాకపోవటం, అందులో శౌనకుడులాంటి వాళ్ళు నోరు మూసుకుని ఊ... కొట్టడం ఆశ్చర్యంగానే వుంది.

కానీ,... ఈ కథలన్నీ చెప్పిన సూతుడు ఇప్పటికి బ్రతికేవున్నాడని కూడా అంటారు. అతడు చిరంజీవట. అయితే ఆయననే నేరుగా కలిసి నా సందేహాలు తీర్చుకుంటే పోతుంది గదా? ఆయన్ను చూడడానికి పోతే సరిపోతుంది. నా బుర్ర ప్రశాంతంగా వుంటుంది. మరి సూతుడ్ని చూడమంటే ఎట్లా? ఎక్కడుంటాడో? ఏమో? ఒక్కసారి విన్నట్లు గుర్తు.

హిమాలయ పర్వతాలలో పుట్టి జలజలమని ప్రవహిస్తూ, ఉత్తర భారతదేశాన్ని సుసంపన్నం చేస్తున్న గంగానది ఒడ్డున సూతుడు తపస్సు చేస్తూ వుంటాడని, ఆయన ఎప్పుడూ బ్రతికే వుంటాడని విన్నా. బహుశా గంగానది దగ్గరకు పోతే, సూతుడి ఆచూకీ తెలియవచ్చునేమో? సూతుడే గనుక వుంటే ఇక వాళ్ళనీ, వీళ్ళనీ అడిగి సందేహాలు తీర్చమని బ్రతిమిలాడవలసిన పని కూడా లేదు. నా బుర్ర కూడా హాయిగా తేలిక పడుతుంది.

ఇట్లా అనుకొని, గంగానది దగ్గరకు పోవటమెట్లా అని నాలో నేనే తర్జనభర్జన పడుతున్నా. సాయంకాలం అయింది. భోజనం చేసి, పొద్దుపోయేవరకు ఇదే ఆలోచనతో వుండగా ఎప్పుడు పట్టిందో తెలియ కుండా నిదురపట్టింది. కాసేపు గాఢంగానే నిద్రపోయా. ఇంతలో కల వచ్చింది.

కలలో ఓ వ్యక్తి కన్పించాడు. చూడటానికి ఒక మహానుభావుడిలా వున్నాడు. ముఖం ఎంతో కాంతితో వున్నది. వెడల్పాటి నుదురు, ఆజానుబాహుడిలా వున్నాడు. కలలో ఆ వ్యక్తిని చూస్తుంటే ఓ మేధావిని చూస్తున్నట్లనిపించింది. అట్లాగే ఆశ్చర్యపోతూ ఆయన

వంకే చూస్తూ వుండిపోయా. తనవంకే చూస్తున్న నన్ను జూచి, ఆ మహామనిషి నాతో మాట్లాడడం మొదలుపెట్టాడు.

"అబ్బాయి! ఇన్ని సందేహాలతో తల పాడుచేసుకోబోకు. రాత్రింబవళ్ళు తీరని సందేహాలతో సతమతమైతే ఎట్లా? సూతముని దగ్గరకు పోవాలి అనుకుంటున్నావు గదా! తప్పకుండా వెళ్ళు. ఆయన గొప్ప మేధావి. చాలా విషయాలు తెలిసినవాడు. నీ సందేహాలన్నీ తప్పకుండా తీరుస్తాడు. ఆయన తప్ప నీ సందేహాలను తీర్చగలవాడు ఇంకొకరు ఎవరూ లేరు. నిన్ను ఎంతో ప్రేమతో చూస్తాడు. మనిషి కూడా చాలా మంచివాడు. నిన్ను తప్పకుండా ఒక మేధావిగా చేస్తాడు. ఆ మహాముని దగ్గర తెలుసుకున్న విషయాలన్నిటినీ నీవు లోకానికి పంచిపెట్టవచ్చు. దీనితో మూఢలోకం తెలివి తెచ్చుకుంటుంది.

ఆయన ఇప్పుడు గంగానది తీరంలో తపస్సు చేసుకుంటున్నాడు. నీవు వెళ్ళవచ్చు. ఒక సంగతి మాత్రం నీకు మనవి చేస్నున్నా.

సూతముని చెప్పిన విషయాలన్నీ బాగా గుర్తు పెట్టుకుని నీవు పుస్తకరూపంలో రాయాలి. అప్పుడే నీ శ్రమకు విలువ వుంటుంది. సూతముని భావాలకు మన్నన, గౌరవం వుంటాయి. నీకు కూడా లోకంలో గొప్ప పేరు వస్తుంది. మనశ్శాంతి గూడా కలుగుతుంది. ఎంతోకాలం నుంచి సూత మహాముని పేరుతో చిలువలు పలువలుగా ప్రచారంలో వున్న పిచ్చి పిచ్చి కథల రహస్యం తెలుస్తుంది. వీటి నిజమెంతో సామాన్య ప్రజలకు బోధపడుతుంది.

ఆలస్యం చేయబోకు. నీ నిర్ణయం చాలా మంచిది. తప్పకుండా నీ శ్రమ ఫలిస్తుంది. నీ వల్ల లోకానికి ఎంతో మేలు కలుగుతుంది. మూర్ఖులు నిన్ను జూచి ఎగతాళి చేస్తారు. అయితే వాళ్ళ మాటలను నీవు పట్టించుకోవద్దు. నిజాన్ని తెలుసుకుని, దాన్ని లోకానికి చాటిననాడే మనిషి. తక్కిన వాళ్ళను మనం మనుషులుగా గుర్తించవలసిన పనిలేదు. కాబట్టి నా మాట విను, నీ వనుకున్నట్లుగా సూతముని దగ్గరకు పో-"

అని చెప్పి వెళ్ళిపోయాడు. ఇది నిజంగా జరిగిన విషయం గదా! అని కళ్ళు తెరిచా. అంతా కల అని గ్రహించా. అప్పటికింకా చాలా చీకటి వుంది. ఎంతసేపటికి తెల్లవారటం లేదు. ఏదో కష్టం మీద ఆ రాత్రి గడిపా. తెల్లవారింది.

# ప్రయాణం

సరిగా నిద్ర పట్టలేదు గదూ! అందుకని రోజుటి కంటే చాలా పెందలకడ లేచా. అంతేకాకుండా ప్రయాగపోయి సూత మునిని చూద్దామని కూడా అనుకున్నా. ఇక నిదురేం పడుతుంది?

బాగా చీకటితో లేచి, తెల్లవారకముందే కాలకృత్యాలు తీర్చుకున్నా. స్నానం చేసేశా. ఇక కావలసినవన్నీ సర్దుకుని బయలుదేరా. గంగానది వొడ్డునే తపస్సు చేసుకుంటున్న సూతమునిని చూడడం, ఆయనకు నా గోదునంతా వినిపించటం - ఆయన చెప్పేవన్నీ గ్రహించటం, ఇదంతా చాలాకాలం పడుతుందనే భావంతో కావలసిన జాగ్రత్తలతో బయలుదేరా.

ఉత్తర దేశం పోవాలిగా; అక్కడకు పోవాలంటే ముందుగా విజయవాడ రావలసిందే. మా వూరి నుండి ఆరోజు ఉదయం బయలు దేరి ముందుగా విజయవాడ వచ్చా. ఇది మాత్రం తక్కువదా!

విజయవాడ కృష్ణానది వొడ్డునే వుంది. ఒడ్డులకావైపు, ఈవైపున అందమైన మేడలు. అల్లంత దూరాన నదిలో పచ్చ పచ్చగా అద్దినట్లున్న లంకలు దిద్ది తీర్చబడ్డాయి. నిజంగా ఎంతో అందంగా వుంది. ప్రయాణపు బడలిక వుండడం వల్ల నదిలో స్నానం చేశా.

ఇంకేం చేయాలి? అటు చూస్తే కొండ, ఆ కొండ మీద దుర్గ గుడి. దానికి సమీపంలో ఒకదానిపై ఒకటి పేర్చినట్లున్న ఇళ్ళు - నిజంగా కొండపై కట్టిన ఆ ఇళ్ళను చూస్తుంటే, ప్రకృతి వింత ఎంతటిదో అర్థమవుతుంది.

వచ్చా గదా! అని మెట్ల వరుసనే కొండపైకెక్కి దుర్గ గుడిని కూడా చూశా...

మనిషికి తిండిలేక పోయినా, గుడిసె లేకపోయినా గుడిలో బొమ్మకున్న అలంకారాలూ - సోయగాలు చూచి ఆశ్చర్యపోయా. అంతకుముందు చాలామంది చెపుతూవుంటే విన్నా. కాని, ఇప్పుడు ప్రత్యక్షంగా చూచా.

అప్పటికే చాలా సమయం అయింది. నేనెక్కవలసిన రైలుబండి మరుసటి రోజు ఉదయానికి గాని రాదట. కొండ దిగి స్టేషను వైపు వెళదామని బయలుదేరా, దిగగానే, బ్రిటిషువాళ్ళు కట్టిన ఆనకట్ట కంటబడ్డది. ఈ మంచిపని చేసినందుకు లోలోపలే ఆంగ్లేయుల్ని పొగడక తప్పలేదు.

నడుచుకొంటూ రైల్వే స్టేషనుకు వచ్చా. పల్లెటూరి నుంచి వచ్చానుగా, విజయవాడ రైల్వే స్టేషను చూచేటప్పటికి నాకేదో అనిపించింది. వచ్చే పోయే రైళ్ళ రణగొణ ధ్వనితో - ప్రయాణికుల సందడితో స్టేషనంతా అదోలా అనిపించింది.

నెమ్మదిగా కొంతసేపటికి సంబాళించుకొన్నా.

అప్పటికి చీకటి పడ్డది. మరుసటి రోజు ఉదయానికి గదా నా ప్రయాణం! అందుకని ఆ రాత్రి అక్కడే పడుకోక తప్పింది గాదు. మరుసటి రోజు ఉదయం లేచి, నా గమ్యస్థానం చేరటానికి పోవలసిన రైలుబండి రాగానే, బండెక్కి ప్రయాణమైపోయా. ఎక్కింది ఎక్స్‌ప్రెస్ బండి. బాగా వేగంతో పోతుంది. గాలికంటే ముందుకు దూసుకుపోతున్నట్లనిపించింది.

రైలు పోతూ వుంటే ప్రక్కనే వున్న చెట్లు, కొండలు - గుట్టలు - అన్నీ గిర్రున వెనక్కి

తిరిగిపోతున్నట్లనిపించింది. రైలు ఎన్నో పల్లెల్ని దాటుకొంటూ- పట్టణాలను దాటుకొంటూ పోతూ వుంది. బండి అంత వేగంగా పోతున్నా శరీరం కదలనన్నా కదల్లేదు.

ఇట్లా వెళుతూ వుండగా, కొన్ని దినాలు గడిచాయి.

ఉన్నట్లుండి, వొకనాడు – 'ప్రయాగ – ప్రయాగ' అనే కేకలు వినిపించాయి. 'అమ్మయ్యా! చేరవలసిన చోటు వచ్చింది గదా!' అని సంబరపడ్డా. బండి దిగా. అప్పటికి తెల్లవారొస్తోంది. పొద్దున్నే చల్లగా – మెల్లగా వీస్తున్న గాలి ప్రయాణం వల్ల కలిగిన శ్రమను పోగొట్టుతున్నట్లనిపించింది. వచ్చే గాలి, సువాసన గల పూలతోటల మీదుగా వస్తుంది కాబోలు. మంచి వాసన కూడా వేస్తోంది.

ఇంతలో 'పోర్టరులు' స్టేషనంతా తిరుగుతూ, "దిగండి– దిగండి – ప్రయాగ వచ్చింది" అని కేకలు వేస్తున్నారు. పోర్టరుల కేకలతో, ఎక్కే దిగే జనం గోలతో ప్లాటుఫారమంతా బహు సందడిగా వుంది.

ఎక్కుతూ వున్న జనాన్ని తోసుకుని ఏదో రకంగా బండి దిగా. కాసేపు స్టేషనులో విశ్రాంతి తీసుకుని, కాలకృత్యాలన్నీ ముగించుకుని పట్టణం చూద్దామని బయలుదేరి వెళ్ళా. కాసేపు ముఖ్యమైన ప్రదేశాలు చూచి వచ్చా. ఇక్కడిదాకా వచ్చి పట్టణం చూడకపోతే యెట్లా?

అక్కడికి ఒక్క కూత వ్రేటు దూరంలో గంగ కనిపిస్తుంది. పెద్ద పెద్ద అలలు, ఆ అలల తాకిడికి లేచిన నీటి తుంపురులు ఎంతో హాయి గొల్పుతున్నాయి. గాలి కూడా తామర పూల మీద నుంచి వస్తుందేమో, సువాసన వేస్తోంది. చాలా నెమ్మదిగా వీస్తోంది గాలి కూడా. నది అలల మధ్యన రకరకాల పక్షులున్నాయి. అలల మధ్యన వుండేటప్పటికి అవి ఉయ్యాల వూగుతున్నట్లనిపించింది. నదిలోని వివిధ పక్షుల అరుపులు చెవికింపుగా వున్నాయి. అందులో కలహంస కంఠస్వరం మధురంగా వినిపిస్తుంది. ఆ నదిలోని ఈ సుందర దృశ్యం చూచేటప్పటికి, అందులో స్నానం చేయాలనిపించింది.

ప్రయాగ గొప్ప పుణ్యక్షేత్రమని. అక్కడ స్నానం చేయడం గొప్ప పుణ్యమనీ సంప్రదాయంగా చెప్పటం విన్నా. చూద్దామని, ఎటూ అలసిపోయాను స్నానం చేయవలసిన అవసరం కూడా వుంది. కాబట్టి గంగా నదిలో స్నానానికి దిగాను.

స్నానం చేస్తుంటే మన పెద్దలు దాన్ని గూర్చి చెప్పే మహత్తు గుర్తుకువచ్చింది.

గంగ హిమాలయాలలోని కైలాస పర్వత శిఖరంలో పుట్టి ఉత్తర భారతంలోకి అడుగుపెట్టింది. బెంగాలు మొదలైన ప్రాంతాలను అది సస్యశ్యామలం చేసింది. దీని డెల్టా భూములు సారవంతమైనవై సిరిసంపదలకు నిలయాలయ్యాయి. ఒకప్పుడు మన దేశానికి వచ్చిన ఆర్యులకిది చాలా పవిత్రమైనదిగా అనిపించింది. దాన్ని వాళ్ళు ఆ

భావంతోనే సేవించేవాళ్ళు.

ఈ నది వొడ్డున శ్రాద్ధాలు పెట్టడం ఎక్కువ. శ్రాద్ధంలో పెట్టిన పిండాలను, అది పితృదేవతల కందిస్తుందని ప్రతివాడూ నమ్ముతాడు. హిమాలయ పర్వతాల నుంచి వస్తుంది కాబట్టి దీని నీరు స్వచ్ఛంగా తెల్లగా కనిపిస్తుంది. చూడ్డానికి ముచ్చటగా వుంటుంది.

స్నానం చేసేటప్పటికి, అవయవాల బడలిక కనిపించకుండా పోయింది. ఆకలి గూడా తీరినట్లనిపించింది. సూతమునిని చూడాలనే కోరిక రెట్టింపయింది.

స్నానం చేసి, నీటిలో నుండి బయటకు వచ్చా. బట్టలు వేసుకుని అక్కడ నుంచి దానికి ఉత్తర దిక్కుగా కొంత దూరం పోయా.

అబ్బో! ఏం జనంలే! జనంతో కిటకిటలాడుతోంది ఏమిటా? అని చూద్దును గదా? అది గంగా యమునా సంగమ ప్రదేశం. అక్కడే గంగానది, యమునానది రెండు నదులూ కలుస్తాయి. ఈ చోటు చాలా పవిత్రమైందిగా చెప్పుకుంటూ వుంటారు. ఇక్కడ మునిగితే, చేసిన పాపాలన్నీ పోతాయని అనుకుంటారు. అందుకే దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి, ఆడా - మగా; పిల్లా - పాప వందలేమిటి? వేల సంఖ్యలోనే వచ్చి స్నానం చేస్తూ వుంటారు. స్నానం చేస్తే తరించినట్టేనని భావిస్తారు.

ఇది వినటమే గాని, అంతకు ముందెప్పుడూ చూడలేదు. ఇప్పుడు సూతముని పుణ్యమా.... అని గంగా, యమునా సంగమ ప్రదేశం కూడా ప్రత్యక్షంగా చూడడం జరిగింది. నా కళ్ళ కరవు తీరినట్లయింది.

ఈ సంగమం ఓ వింతగా అనిపించింది. ఒకవైపు గంగాజలం తెల్లటిది; యమునా జలం నల్లటిది. తెలుపు - నలుపు నీళ్ళు కలిసి వింత దృశ్యంగా కనిపిస్తుంది. అందుకేనేమో, ప్రాచీన కవులు దాన్ని రకరకాలుగా వర్ణించారు. ప్రాచీన సాహిత్యంలో చదివిన వర్ణనలు కొన్ని గుర్తుకు కూడా వచ్చాయి.

తెల్లటి బూడిద పూసుకున్న శివుడి వొంటి మీద నల్లటి త్రాచుపాము వ్రేలాడినట్లుంది. తెల్లగా వుండే బలరాముడు నల్లటి వస్త్రం ధరించినట్టుంది. నీలాకాశంలో శరత్కాల మేఘాలు కమ్మినట్లుంది. ఇంతేనా, ఇంకా రకరకాలుగా వుంది. ఆ ప్రయాగ దగ్గరలో గంగా, యమునా నదులు రెండూ కలసి మహావేగంతో సుడులు తిరుగుతూ, నురుగులు గట్టి గంతులు వేస్తూ ప్రవహిస్తున్నాయి.

ఈ రెండు నదులతోపాటు సరస్వతి - అనే నది కూడా వీటిల్లో లీనమై ప్రవహిస్తూ వుంటుంది. అది కూడా తలంపులోకి వచ్చింది. ఒక్కసారి ఆ విషయం గుర్తుకు తెచ్చుకుని సూతమునిని చూడాలని ప్రయాణం కొనసాగించా.

యమునా నదిని చూద్దామనే కోరికతో కాస్త ముందుకు సాగా. ఆ నది వొడ్డున

రకరకాల చెట్లు అల్లిబిల్లిగా వుండి దట్టమైన నీడనిస్తున్నాయి. బాగా, ఏపుగా దట్టంగా పెరిగిన కానుగుచెట్లు నల్లటి కారుచీకటి ముద్దల్లాగా కనిపిస్తున్నాయి. సూర్యకిరణాలు చొరబడడానికి వీల్లేనంత వొత్తుగా వున్నాయి ఆ చెట్లు. అట్లా యమునా నది ఒడ్డు సౌందర్యాన్ని చూస్తూ వెళుతున్నా.

యమునా నదిని చూస్తుంటే, చిన్నప్పుడు భాగవతంలో చదువుకున్న కృష్ణుడు గుర్తుకువచ్చాడు. కృష్ణుడి కథకు, యమునా నదికి చాలా సంబంధం వుందిగా. చిన్నతనంలో కృష్ణుడు యమునా నది వొడ్డున చాలా చిలిపి పనులు చేసినట్లుంది.

ఈ నది వొడ్డునే కృష్ణుడు ఆలమందల్ని మేపుతూ తిరిగాడు; ఎంతో రసికుడై శరత్కాలపు రాత్రుల్ని గడిపాడు; మనోహరంగా, మధురంగా - పిల్లనగ్రోవి కూడా వూదుతూ తిరిగేవాడు. గోపికా స్త్రీలు స్నానం చేస్తుంటే, చిలిపితనపు చేష్టలుగా, వాళ్ళ చీరలు కాజేసి వాళ్ళ మానాన్ని కూడా దొంగిలించాడు. ఎదురులేకుండా విర్రవీగుతూ తిరుగుతూ వుండే శత్రువుల్ని చంపి వ్రేపల్లెను కాపాడాడు.

అదుగో, ఆ ప్రక్కనే బృందావనం కనిపించింది. ఈ బృందా వనంలోనే కృష్ణుడు ముగ్ధమనోహరంగా పిల్లనగ్రోవి వూదుతూవుంటే గోపికా స్త్రీలు అరమోడ్పు కనుదోయితో పారవశ్యం చెందారట. ఆలమందలు మేయటం మానివేసి, రాతిబొమ్మల్లాగా కదలక మెదలక వున్నాయట. చెట్లు చిగురించాయట. శరత్కాలపు రాత్రులన్నీ కృష్ణుడికి ఇట్లాగే గడిచాయట.ఆ నల్లని మాయదారోడు తన సోయగంతో, గోపికా వనితలతో సయ్యాటలాడేవాడని కూడా చదివా.

అప్పుడే పెట్టిన జాజిపూల పొదరిండ్లు పెళ్ళి పందిళ్ళుగా వుండేవి. బాగా విచ్చి పై నుండి జలజల రాలే పూలు తలంబ్రాలుగా అయ్యేవి; కసరెక్కి గీరపోకుండా మధురంగా పాడే కోకిల పాటలు మంత్రాలుగా అనిపించేవి; వీనులవిందుగా పాడే చిలుకా గోరువంకల పాటలు మంగళహారతులుగా వుండేవి; అక్కడి ప్రకృతే పెళ్ళి సరంజా మాలను సమకూర్చిపెట్టేది.

ఇవే గాక, భాగవతంలో కృష్ణుడు చేసిన ఇంకా రకరకాల వింత కార్యాలు నాకు గుర్తుకు వచ్చాయి.

యమునా నదిని చూడగానే కాళీ సర్పం మనసులో మెదలింది.

వివిధ రకాల వృక్షాలతో - లతలతో - పొదరిళ్ళతో - అందంగా వున్న యమునానది మధ్యలో - కాళి - అనే సర్పం పడగపై నెక్కి, దాని మదాన్ని అణచి, అక్కడి ప్రజలకు కృష్ణుడు సంతోషాన్ని కలిగించాడని చదివా. ఆ కథలోని కాళీ సర్ప ఘట్టం ఎవరికైనా గుర్తుకు వస్తుంది.

కాళ్ళకు గట్టిన గజ్జెలు గలగల మోగుతుంటే, చిందులు తొక్కుతూ, అల్లరి చేస్తూ

వుంటే, కృష్ణుడి తల్లి బెత్తం పట్టుకొని వెంటపడుతూ వుంటే చిలిపిగా నవ్వుతూ తల్లి దెబ్బలను లెక్కచేయక గంతులు వేసే వెన్న దొంగ చేష్టలెన్నో ఈ సమయంలో గుర్తుకు వచ్చాయి.

ఇట్లా కృష్ణుడు అల్లరి చేష్టలను తలచుకొంటూ వుండగా, వచ్చిన కార్యం గుర్తుకువచ్చి 'అది నన్ను వెన్ను దట్టి తొందర పెడుతూ వుంది. అటూ ఇటూ తిరిగి చివరకు గంగానది వొడ్డుకు చేరా, సూతముని గంగానది వొడ్డున గదా తపస్సు చేస్తూ వుంటారని విన్నా!

నడక సాగించా. వచ్చిన పని నెరవేర్చుకోవాలి; ఎటుచూచినా ఏముంది? అడవిలో దొరకిన కాయలు, దుంపలూ తింటూ, నదిలో జలజల పారే నీళ్ళు తాగుతూ ఆకలి దప్పుల్ని తీర్చుకుంటూ వెళుతున్నా.

శరీరం సత్తువ కోల్పోయింది; కాళ్ళు చచ్చుబడ్డాయి; నడక తడబడసాగింది. నా శక్తి సామర్థ్యాలేమయ్యాయో? నాకే వింతగా అనిపించింది. ఏమీ తోచక, ఊగులాడుతూ అట్లాగే పోయా.

పైగా, అది మండు నిండు వేసవి. ఎండ మండిపోతోంది. సూర్యుడు నిప్పులు చెరగుతున్నాడు. చెమట కాల్వలు కట్టటం మొదలుపెట్టింది. నడక అంతంతమాత్రగా వుంది. నడవలేక నడుస్తున్నా.

దారి భయంకరంగా వుంది. దట్టమైన అడవులతో, రాళ్ళు రప్పలతో నడవటానికే కష్టంగా వుంది. నా కార్యం నెరవేరే ఆశలు సన్నగిల్లాయి. తిండి లేక - ఇంతటి కష్టమైన దారితో తూలుతూ నడవడం నావల్ల గాదనిపించింది.

ఉన్న జవసత్వాలు ఉడిగిపోయాయి. విచారం ఎక్కువయింది. అలసిపోయి చివరకు నిట్టూర్పు వచ్చి, వొక మామిడి చెట్టు క్రింద కూలబడ్డా.

మంచి గంధం వెదజల్లే చల్లని మెల్లని గాలి యెదురుగా వచ్చింది. ఎంతో ఉత్సాహంతో కిలకిలారావాలు చేస్తున్న పక్షులు గుంపులు కట్టి కనిపించాయి. పెక్కు రకాల లతలు, పూ బొదరిళ్ళు, వివిధ రకాల చెట్లు కనిపించసాగాయి. మనోహరమైన కోకిలగానం వినిపించింది. వీటన్నిటినీ గమనిస్తూ ముందుకు సాగబుద్ధి పుట్టక, కండువా తీసి పరచుకొని పండుకొన్నా.

పలకరించే దిక్కు కూడా లేని, ఆ నిర్జన ప్రదేశంలో ఆ వనమే నాకు సకల సపర్యలు చేసి, అతిథి మర్యాదలు చేసినట్లుగా అనిపించింది.

నిద్ర సుఖమెరుగదంటారు. పండుటాకులే మెత్తటి పరుపులుగా చేసుకున్నా. చల్లని చిరుగాలి వీస్తుంటే, శరీరానికి పట్టిన చెమట హాయి గొల్పుతూ వుంటే, ఎక్కడలేని హాయిని అనుభవించా. మదించిన శారికలు గొంతెత్తి పాడుతూ వుంటే, చెవులకు ఎంతో ఇంపుగా వుంది.

ఇదంతా చూచాక, ఇంతదూరం తిండితిప్పలు లేక, కాయగసరులు తింటూ, నది నీళ్ళు తాగుతూ పడ్డ కష్టమంతా మరచి, వొళ్ళు మరచి నిద్రపోయా, ఎంత గాఢమైన నిద్ర పట్టిందో, చెప్పటం కష్టం. అంతా మాయగా వుంది.

లేత మామిడి చెట్లు నా శ్రమను పోగొట్టి నిద్రపుచ్చాయి.

మైమరచి యిట్లా ఎంతసేపు నిద్రపోయానో, నాకే తెలియదు. లేచి చూచేటప్పటికి. ఓ ముసలివాడైన ముని నా కళ్ళ ముందున్నాడు. ఆశ్చర్యపడ్డా. తొట్రుపాటు కలిగింది. వెంటనే, రెండు చేతులెత్తి నమస్కరించా. ఇక నా కోర్కె నెరవేరినట్లేనని భావించా. నే పడ్డ శ్రమనంతా మరచిపోయా. ఈ సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బయ్యా.

చిన్నప్పటి నుంచీ నాలో కలిగిన సందేహాలన్నిటిని తీర్చటానికి వచ్చిన మహానుభావుడు గాదా! అని అనుకొన్నా. నేను కలలు గనే వ్యక్తి యితడేనని మురిసిపోయా. నన్ను ఉద్ధరించే మహాత్ముడని సంబరపడ్డా. ఇక ఆపుకోలేక పోయా. మాట్లాడాలని అనిపించింది.

"మహాత్మా! మీరెవ్వరు?"

నా గోడు వింటానికి ఇక్కడికి వచ్చారా?

నేను ఎదురుచూస్తున్న మునీంద్రులు మీరేనా?

సమస్త పురాణాలను చదివిన మహానుభావులు గదా!"

అని పిచ్చి పిచ్చిగా వుండబట్టలేక అడిగేశా. నా ఉత్సాహం, తొట్రుపాటు - నా మాటలతీరంతా పరికించాడు ఆ ముసలి ముని.

నా మాటలన్నీ విన్నాడు. దగ్గరకు వచ్చాడు. ముఖం చూస్తుంటే, ఆయనకు నా మీద ఎంతో ప్రేమ, దయ వున్నట్లు కనిపించాయి. తదేక దీక్షతో నా వంక చూస్తూ చేత్తో తల నిమురుతూ-

"బాలకా! నీకు సందేహమేమీ వద్దు. సూతముని చాలా మంచివాడు. ఆయన మనసు నవ్యనవనీతం లాంటిది. దయాస్వభావుడు. నీవు వచ్చిన పని తప్పకుండా చెప్పు. నీకెంతో ఉపకారం చేస్తాడు. చేదోడువాదోడుగా కూడా వుంటాడు.

పురాణాలన్నీ జీర్ణించుకొన్న గొప్ప పండితుడు సూత ఋషి. మహా మేధావి. నేను ఆయన శిష్యుణ్ణి. నన్ను తన కొడుకుతో సమానంగా చూచుకుంటాడు కాని...

"నీవెవరవు?

మీదే వూరు?

ఏం పని మీద అంత దూరం నుంచి, ఇంత దూరం వచ్చావు

చెప్పటానికి అభ్యంతరం లేకపోతే చెప్పు"

అనేటప్పటికి, నా సంగతులు చెప్పకుండా యెట్లా వుంటాను?

మహానుభావా! నేను త్రిపురనేని రామస్వామిని.

మాది ఆంధ్రదేశం. కృష్ణాజిల్లాలోని అంగలూరు అనే గ్రామం జన్మస్థానం. చిన్నప్పటి నుంచీ పురాణాలు చదవటం అలవాటు. చదువుతున్న కొద్దీ నాకు వాటిల్లో ఎన్నో సందేహాలు కలిగాయి. ఆ సందేహాల్ని తీర్చుకోవటానికి యిక్కడికి వచ్చా.

సూతముని వాటిని తీరుస్తాడని విని కొండంత ఆశతో యిక్కడికి వచ్చా. అష్టకష్టాలు పడ్డా.

మునుపు సూతుడు చెపుతూ వుంటే, వివేకవంతులైన శౌనకుడు మొదలైన మునులంతా పద్దెనిమిది పురాణాలు విన్నారట కదా! ఆ పురాణాల్లో వున్న సందేహాలు నన్ను బాధిస్తూ వుంటే, పండితులనుకొన్న వాళ్ళనల్లా అడిగా. కాని, ఒక్కరూ సమాధానం చెప్పలేదు.

సూతముని తప్ప నా సందేహాలను ఎవరూ తీర్చలేరు. దయవుంచి నన్ను ఆ మహాత్ముడి దగ్గరకు తీసుకుపోండి. నా విజ్ఞప్తిని తప్పకుండా ఆలకించండి. నాలాంటి ఆపన్నుని రక్షించే భారం మీదే గదా!

ఆ ముని నా మాటల్ని ఎంతో ప్రేమతో విన్నాడు

"రా! బాబూ! వెళదాం. నిన్ను ఆ మహాముని దగ్గరకు తీసుకువెళతా" అని నడవడం మొదలుపెట్టాడు. నేను ఆయన్ని అనుసరించా.

కొంతదూరం పోయినాక, ఒకచోట ఆగాడు. ఆ దారి సమస్తం మనోజ్ఞంగా వుంది. అందమైన చెట్లు - వాటిల్లో రకరకాల పూలు - ఆ చెట్లకు అల్లుకున్న వివిధ సుమవల్లరులు - అదంతా చూస్తూపోతే, ఏదో నిజంగా కొత్తలోకం వుందా? అక్కడికి వెళుతున్నామా? అనిపించింది.

ఠక్కున ఆగాం. అది ఓ ఆశ్రమంలా వుంది. దాన్ని చూచేటప్ప టికి, బాల్యంలో ముని ఆశ్రమాల గూర్చి చదువుకున్న వర్ణన అమాంతం గుర్తుకువచ్చింది.

నాట్యమాడే నెమళ్ళ పైబడి కోడె త్రాచులు అటూ ఇటూ పచారులు చేస్తున్నాయి. అప్పుడే ఈనిన పెద్ద పులులు బ్రతిమిలాడి లేడి పిల్లలకు పాలిస్తున్నాయి. సింహపు పిల్లలు పిల్లయేనుగులపై ఎక్కి స్వారీ చేస్తున్నాయి; ఇంతేగాదు. ప్రకృతిలోని పరస్పర విరుద్ధ స్వభావం గల ప్రాణులు స్నేహభావంతో ఏక కుటుంబంలోని జంతువుల్లాగా మెలగటం కళ్ళారా చూచా.

ఇట్లాంటి అద్భుతాలు చూస్తూ ఆ మునివరుడితో కలిసి ముందుకు సాగిపోతున్నా. ప్రక్కనే వున్న పూపొదరిండ్ల నుండి తుమ్మెద ఝుంకారం చెవుల్ని చిల్లులు పొడుస్తూ వుంది. గాలికి పుప్పొడి దుమారం కళ్ళల్లోపడి, కళ్ళు మూసుకుపోయి, పుష్ప మకరందం కనిపించక తుమ్మెదలు కోపంతో గాలిని కసరుకొంటున్నాయా? అన్నట్లు ఝుంకారం వుంది.

ఇంతలో పొద్దుగూకవచ్చింది. అంతా మంటలు కమ్మినట్లు ఆకాశం కనిపించసాగింది.

నిజంగానే, మంటలు చుట్టుతున్నాయేమోనన్న భయంతో కాకులు "కావు - కావు"మని అరుస్తూ పరుగులు తీయసాగాయి.

సంధ్యాసమయం పొద్దు ఎఱ్ఱ ఛాయలకు ఆ వనంలోని పూలన్నీ మంకెన పూవుల్లాగా ఎఱ్ఱగా కనిపించసాగాయి. ఆకులు గూడా. చిగురుటాకుల్లాగా, ఎరుపెక్కాయి. ఆ సుందర దృశ్యం చూస్తుంటే, వనమంతా ఎంతో అందంగా కనిపించసాగింది. దాని నిసర్గ సౌందర్యాన్ని మాటలతో చెప్పలేం.

మసక మసక చీకట్లు క్రమ్ముతున్నాయి. మేతకు పోయిన పూరేడు పిట్టలు గూళ్ళకు తరలివస్తున్నాయి. ఆవులు మందలు గట్టి గమ్యస్థానానికి చేరుకొంటున్నాయి.

మేం కూడా సుందరవనం చూస్తూ పోతున్నాం. ఇంతలో సమీపంలో పొదలమాటున నుండి ఓ పర్ణకుటీరం కంటపడ్డది. పైభాగం మాత్రం కనిపిస్తుంది. కొంతదూరం పోయాక, చిలుకలు - కోకిలలు పాడే పాటలు చెవులకింపు గొలుపుతూ వినిపిస్తున్నాయి. ఇంతలో పర్ణశాల రానే వచ్చింది.

ఆ కుటీరం చుట్టూ పలువిధ ఓషధులు సారవంతాలైనవి గుబురుగట్టాయి. బాగా విరగబూసిన తీగలు కుటీరాన్ని అలముకొన్నాయి.

ఏనాడేసిన కుటీరమో అది? ఆకులన్నీ చివికి  జీర్ణాలై చెదలు పట్టాయి. అలనా పాలనా లేక ముంగిటిలో వున్న చెట్లనుండి రాలిన పండుటాకులు రాసులు పోసినట్లున్నాయి. ఆదరించేవాళ్ళు లేక దొడ్డిలో పెట్టిన చెట్లను పందులు పెళ్ళగించేస్తున్నాయి. బాగోగులు చూచేవాళ్ళు లేక కుటీరపు గోడల మట్టి రాలిపోయి వుంది. చూస్తుంటే, వందల సంవత్సరాల నాటి పర్ణశాలలా వుంది.

అయినా, మంచి నివాసయోగ్యంగానే వున్నట్టుంది.

పరామర్శించేవాళ్ళు లేక, చీకిలి - మాకిలిగా వున్న పర్ణశాలకు దారి గూడా సక్రమంగా లేదు. దారికి రెండువైపులా గడ్డిగాదం దిట్టంగా, దట్టంగా పెరిగింది. ఆ దారినేపోయి పర్ణశాల వాకిటివైపుకు నడచా.

బ్రహ్మచారులు రోజుకు మూడుపూటలా స్నానాలు చేయటానికి వస్తూ పోతూ వున్న అడుగుల గుర్తులు ఇసుకలో గూడా కనిపించసాగాయి. ఆ కాలి గుర్తులు చూస్తూ వుండగానే పర్ణశాల దృగ్గోచరమైంది.

స్వచ్ఛమైన గంగానదీ జలాలలో ఈతలాడుతున్న వివిధ జాతుల పక్షుల మధుర స్వరాలు గూడా వీనుల సోకాయి. మధురాతిమధురంగా వున్న ఆ పక్షుల కంఠనాదం వింటుంటే, అక్కడి నుంచి కదలబుద్ధి కాలేదు.

అనుకొన్న పర్ణశాల రానే వచ్చింది. పోయి చూద్దును గదా!

ఆ పర్ణశాల ముందున్న ఎత్తయిన వేదికపై ఓ మహానుభావుడు ఆసీనుడై వున్నాడు.

శరీరం నిండా బూడిద పూసుకొన్నాడు, పద్మాసనం వేసి కూర్చున్నాడు. ఆయన్ని చూడగానే, యెంత కుతూహలం కలిగిందో యెట్లా చెప్పేది?

ఆ మహాత్ముడి ముఖం చూస్తుంటేనే కాంతులీనుతుంది. నిష్కల్మషమైన ఆయన ఆకారాన్ని చూచేటప్పటికి ఎంతో ప్రశాంతత నాలో చోటుచేసుకుంది. నెమ్మదిగా ఆయన తన చూపుల్ని అక్కడ నుంచున్న నాపై పడేశాడు.

అబ్బా....! ఎంత దయామయుడో? ఎంత తేజస్సంపన్నుడో! ఆయన్ని చూస్తుంటే తన్మయత్వం కలిగింది.

వెంటనే తేరుకున్నా; నా కష్టాలు తీరాయని సంతసించా. అన్ని పురాణాల రహస్యాలు తెలిసినవాడు. మూడు కాలాల సంగతి ఎరిగిన వాడు. చారువాకుడు - నిస్వార్థజీవి - అకలంకుడూ - అహంకార రహితుడూ - ప్రశాంతచిత్తుడూ - గంభీర హృదయుడూ - అయిన సూతముని యీతడేనని అనుకొన్నా. భక్తిశ్రద్ధలతో రెండు చేతులు జోడించి సాష్టాంగంగా నమస్కరించా.

కాళ్ళ మీద బడ్డ నన్ను చూచి, వాత్సల్యం కలుగ రెండు చేతులతో లేవనెత్తాడు.

"బాలకా! ఏమీ దిగులు పడబోకు" నీవు నా కోసం ఇక్కడికి వచ్చేసంగతి ముందుగానే గ్రహించా-

మొన్న వ్యాసుడు వచ్చాడు. తొందరలోనే ఒకడు జ్ఞాన సముపార్జన కోసం శిష్యుడుగా వస్తాడు. అతని సందేహాలన్నీ తీర్చి పంపు. దాని వల్ల నీకూ - అతనికే గాక సమస్త లోకానికి మేలు జరుగుతుంది - అని చెప్పి వెళ్ళాడు. ఇటురా అని నన్ను తన సరసనే కూర్చుండ బెట్టుకొని, మేను నిమురుతూ ఎంతో ఆప్యాయంగా చేరదీశాడు.

ఆ మహానుభావుడి వాత్సల్యానికి ముగ్ధుడనయ్యాను. కొంతసేపటికి మేఘధ్వనిలాంటి గంభీర స్వరంతో మొదలుపెట్టాడు ముని.

"వత్సా! యజ్ఞాలూ - యాగాలూ జరిగేటప్పుడు పొద్దుపోవటం కష్టంగా వుండి, కాలక్షేపం కోసం కథలు చెప్పమని శౌనకుడు మొదలైన ఋషులు నన్నడిగారు. చిన్నతనం నుంచీ వ్యాసుడి దగ్గర విన్న ధర్మాలనన్నిటినీ, పురాణాల రూపంలో పోగు చేసి, ధర్మాన్ని స్థాపించాలనే భావంతో ప్రచారం చేశానని వంచకులు చెప్పారు. లోకమంతా, ఇది నిజమేనని నమ్మి మోసపోతుంది. దీనివల్ల నాకెంతో బాధగా వుంది.

నా పేరుతో సమాజానికి ఇంత అపకారం జరుగుతూ వుంటే సహించలేకపోతున్నా. దీనినంతటినీ యెట్లా రూపుమాపుకోవాలా? అని ఆలోచిస్తున్నా. రాత్రింబవళ్ళూ ఇదే చింత నన్ను వేధిస్తూ వుంది.

ఒకదానికొకదానికి సంబంధం లేని పుక్కిట గాథలనన్నిటినీ, నొకచోట చేర్చి (పుస్తకంగా) చెప్పినంత మాత్రాన, అది మంచితన మౌతుందా? ధర్మాన్ని

స్థాపించటమౌతుందా? లేనిపోని అద్భుత కల్పనల వల్ల ప్రజల్ని మోసం చేయటానికి ఆడిన అబద్ధాలన్నీ ధర్మాలౌతాయా? అట్లా చెప్పినవి ధర్మ గ్రంథాలౌతాయా? ఇంత అపవాదాన్ని నేను మోయ గలనా?

నా పేరుతో రాసి, బూతులన్నీ నా మెడకంటగట్టి, ఈ పుస్తకాలన్నీ నేనే రాశానని ప్రచారం చేశారు, న్యాయాన్ని - అన్యాయంగానూ, ధర్మాన్ని - అధర్మంగానూ; పుణ్యాన్ని పాపంగానూ; సత్యాన్ని అసత్యంగానూ; కల్పించి రాశారు. ఇన్ని రకాల అక్రమాలతో నిండిన పురాణాలు నేనే చెప్పానని అనటం ఎంత ఘోరమైన విషయమో నీకు తెలియదు. నాపై వున్న నిందను తప్పకుండా తొలగించుకోవాలి. దీని కోసం నా శాయశక్తులా ప్రయత్నించాలి" అని చాలా బాధపడ్డాడు.

ఇదే సమయంగదా! అని నేను కూడా నా గోడు విన్నవించుకొన్నా.

"మునీంద్రా! నేను కూడా పురాణాలన్నీ చదివా. నిజంగానే మీరన్నట్లు వాటి నిండా పరస్పర విరుద్ధాలైన విషయాలెన్నో వున్నాయి. అన్నీ చదివాక నా మనస్సు పాడైపోయింది. ఒకదానికొకదానికి సంబంధం లేని కథలు ఒక వ్యక్తి పేరనే యెట్లా వున్నాయి? ఒక వ్యక్తే ఒకదానికొకటి భిన్నంగా వుండే విషయాలను ఎట్లా రాస్తాడు? ఇవి నిజంగా ఒక వ్యక్తి రాసినవేనా? కాదా? అన్న సందేహాలు కలిగాయి. ఈ సందేహాలను తెలుసుకోవాలనీ - తీర్చుకోవాలనీ - తపనతో, పండితులని లోకంలో పేరుపొందిన వాళ్ళనందరినీ అడిగా. ఒక్కరూ నా సందేహాలకు సమాధానాలు చెప్పిన వాళ్ళు లేరు. నా అనుమానాలన్నీ అట్లాగే వుండిపోయాయి. మహాత్మా!

ఒక్క మనిషే ఏడు సముద్రాలను ఒక గుక్కతో తాగిపారేశాడని చెపుతుంది ఈ కథ.

ఒక వ్యక్తి భూమిని చాపగా చుట్టి చంకలో పెట్టుకుని సముద్రంలో దాక్కొన్నాడని ఇంకో కత చెపుతుంది.

కొండలకు రెక్కలుంటాయనీ, ఆ రెక్కల్ని ఒకడు ఆయుధాలతో నరికాడని మరో కథ చెపుతుంది.

కోతులకూ-కొండముచ్చులకూ - చేపలకూ - చిలుకలకూ - దొప్పలకూ మనుషులు పుట్టారని కొన్ని కథల్లో వుంది.

అన్నీ ఈ పురాణాల్లోనే వున్నాయి.

ఒకచోట విష్ణువు భగవంతుడుగా కనిపిస్తాడు; ఇంకోచోట అతడే ఆడవాళ్ళ శాపానికి గురైనట్లు కనిపిస్తాడు.

ఈశ్వరుడొక కథలో అద్వితీయ బ్రహ్మగా చెప్పబడతాడు. ఆ ఈశ్వరుడే ఇంకో కథలో మునుల భార్యల వెంట తిరిగే పచ్చి వ్యభిచారిగా రాయబడ్డాడు.

ఒక కథలో బ్రహ్మ సొంతంగా ఎవరి ప్రమేయం లేకుండా పుట్టాడని కీర్తింపబడ్డాడు

– ఇంకోచోట ఈ బ్రహ్మ శత్రువుల పాదాలతో తొక్కబడ్డాడని చెప్పబడ్డది.

ఒక కథను బట్టి చూస్తే, కృష్ణుడు గొప్ప నిగ్రహం కలవాడుగా – ఇంద్రియాలను జయించినవాడుగా కనిపిస్తాడు. కాని, ఇంకోచోట ఈతడు తిరుగుబోతుగా – వావి వరుసలు లేకుండా స్త్రీలతో ప్రవర్తించినట్టుగా కనబడతాడు.

శుక్రుడు ఒకచోట శుద్ధ జడుడులాగా వుంటే– ఇంకో చోట సంసారిగా, పిల్లల తండ్రిగా ప్రత్యక్షమౌతాడు.

ఇట్లాగే ఎంతో వైరుధ్యం గల కథలన్నీ పురాణల్లో వున్నాయి. ఇవన్నీ పిట్ట కథలా? వాస్తవాలా?

హిరణ్యకశిపుణ్ణి విష్ణువు నరసింహావతారం యెత్తి చంపితే– ఆ నరసింహాన్ని శివుడు ఇంకో అవతారంలో వచ్చి చంపాడని ఒక పురాణం ఘోషిస్తుంది. ఇంకో పురాణం చూద్దును గదా! ఆ శివుణ్ణి విష్ణువు మరో అవతారంతో వచ్చి నాశనం చేసినట్టు వుంది.

ఇట్లా పద్దెనిమిది పురాణాలూ గజిబిజి గందరగోళంగా వున్నాయి. వీటనన్నిటినీ నమ్మేదెట్లా? ఒకే చేతి మీదుగా వ్యాసుడు ఇన్ని విరుద్ధాలతో చెప్పాడని అంటారా? వీటిని వ్యాసుడు చెప్పి వుండడు; అంతేగాదు సూతుడు గూడా వీటిని రాయలేదు.

ఎవడో అసూయాద్వేషాలతో పై వాళ్ళ పేరు మీద వీటిని ప్రచారం చేశాడని భావిస్తున్నా.

మునివర్యా! అంతేగాదు.

కృష్ణుడు దేవుడు. కృష్ణుని కన్నతల్లి యెవరు? కృష్ణుని మేనమామ కంసుడెవరు?

కశ్యపుడనే వాడికి ఒక భార్య వల్ల దేవతలు – ఇంకో భార్య వల్ల రాక్షసులు పుట్టారా?

ఎంత విడ్డూరమైన కథలు కల్పించి ప్రచారంలోకి పెట్టారో? లోకాన్ని వంచించి తమ ప్రయోజనం పొందారో? తెలుస్తుంది.

ఒకచోట కుల వ్యవస్థకు కారణం, గుణ – కర్మలు అని చెప్పారు. ఇంకోచోట పుట్టుకతోటే కుల నిర్ణయం జరుగుతుందని చెప్పారు.

ఇందులో ఏది నిజం? ఏది అబద్ధం?

దేన్ని నమ్మాలి? దేన్ని నమ్మకూడదు?

జాతి మాత్రోప జీవులెవ్వరో, సిగ్గూ బిడియము లేకుండా తమ గొప్పతనాన్ని చాటుకోవటం కోసం పద్దెనిమిది పురాణాలు రాశారనే వదంతి బాగా ప్రచారంలోకి వచ్చింది.

ఎవరికి యిష్టం వచ్చిన కథను వారు రాసేసి పురాణాల పేర గుదిగుచ్చి పేర్చారు. ఇంతకాలం సామాన్య ప్రజానీకాన్ని ఈ మోసపు కథలతో వంచించారు. నిజం మరుగున పడ్డది. అసలు సంగతి అడుగం టింది.

మహాత్మా! మీరు గదా! వీటికన్నింటికి గురువులు. మీ పాదాల నాశ్రయించా.

లోకంలోని ప్రజలంతా మెచ్చుకొనే రీతిలో ధర్మమార్గాన్ని చెప్పండి.

జరిగిన సంగతులూ - జరుగబోయే సంగతులూ మీకు తెలుసు. ఇంతటి మహాశక్తి సమన్వితులని తెలిసే, నేను భయంకరమైన అడవులు దాటి - కొండలు కడచి - గుట్టలు దూకి - తిండికి మొగం వాచి- దొరికిన కాయగసరులే తిని - నదులలోని నీటిని తాగి - మీ దగ్గరకు వచ్చా- మీ దర్శనం వల్ల సత్యం తెలుసుకొని, లోకానికి చాటుదామనే తాపత్రయం నన్ను వెంటాడుతున్నది. దయచేసి నాకు ఆ జ్ఞానాన్ని అనుగ్రహించండి".

నేనిట్లా అనడంతోనే, సూతమునికి ఎంతో సంతోషం వేసింది. ప్రసన్నవదనంతో నన్ను చూచాడు. సాదరంగా మాట్లాడాడు.

"బాబూ! ఇక్కడ వుండడం నీ వనుకొన్నంత తేలిక గాదు. ఇంటిలో తల్లిదండ్రుల చాటున కష్టమంటే యేమిటో తెలియకుండా పెరిగి వుంటావు. వేళకు తల్లి పిలిచి భోజనం పెడితే, కడుపారా రుచికరమైన ఆహారం తిని వుంటావు. అత్యంత సుందరమైన భవనాలలో, మెత్తని పరుపులపై పవ్వళించి సుఖాలననుభవించి వుంటావు. సుకు మారంగా పెరిగావని నీ ముఖ కవళికలే చెబుతున్నాయి.

కానీ, యిక్కడ దానికి భిన్నంగా వుంటుంది. గంగానది యిసుక తిన్నెలపై కట్టిన ఈ పూరి గుడిసెలో నివసించగలవా? షడ్రసోపేతమైన భోజనం చేసిన నీవు - కందమూలాలు తిని, గంగానదిలోని నీరు తాగి ఎంతకాలముండగలవు? స్నేహితుల - బంధువుల - తల్లిదండ్రుల మధ్య తిరిగి కాలం వెళ్ళబుచ్చిన నీవు - వీళ్ళందరినీ విడిచి ఎట్లా వుంటావు?

గంగానదిలో ఊయలులూగే కొదమరాయంచలే నీ కబుర్లకు ఊ... కొడతాయి. కట్టెలకోసం అడవిలోకి వెడితే - వన్యమృగాలే నీకు తోడుగా వుంటాయి; గానం చేయటానికి ప్రయత్నిస్తే - మైనా గోరువంకలే నీతో పాట అందుకోవటానికి ప్రక్కన వుంటాయి. ఆదమరచి నిద్రపోతుంటే పక్షులే నిన్ను ఉదయం నిద్రలేపుతాయి.

మెత్తటి పరుపులపై సుఖంగా నిద్రించిన నీవు, కటికరాతి నేలపై పడుకోవలసి వస్తుంది. చలికి కంపించిపోతావు. బ్రహ్మచర్యమే నీకు వృత్తి అవుతుంది. నిన్ను విడిచిపెట్టినందుకు నీ తల్లిదండ్రులు, బంధువులు విచారిస్తారు. దాన్ని దిగమింగి వుండాలి. వాటన్నిటినీ భరించి వుంటే నీవడిగిన ధర్మ సూక్ష్మాలూ - రహస్యాలూ చెప్పటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కానీ, నీవిక్కడ వుండడమే సాధ్యమౌతుందో, కాదో అని ఆలోచిస్తున్నా.

సూతమహర్షి మాటలు నన్ను కదిలించలేదు. నా నిశ్చయాన్ని ఏ మాత్రమూ చెదరగొట్టలేదు. వెంటనే నమస్కరించి, వినయంతో

ఆ మహాముని పాదాలపై దృష్టి నిలిపి విన్నవించుకున్నా.

"మహానుభావా! నీ మాటలు యదార్థాలే; కాదనను. కానీ, నా విషయం మీరు తక్కువగా చూడవద్దు. కష్టాలకు భయపడి వచ్చిన పని మానుకొని, ఇంటికి తిరిగి వెళ్ళే పిరికివాణ్ణి కాను, అట్లా వెళ్ళటానికి ఇంత దూరం రాలేదు. ఇక్కడికి రాకముందే, నా పరిస్థితి నిర్ణయించుకొని వచ్చా. నన్ను అన్యథా భావించవద్దని మనవి చేస్తున్నా.

ఋషి వర్యా! పవిత్రమైన గంగానదీ జలాలు – చిలుకల – గోరువంకల సుమధుర వచస్సులు – కోకిలల సుమనోహర సంగీతం, చల్లగా – మెల్లగా వీచే మనోజ్ఞమైన గాలి, మీ సంగాతం ఇవన్నీ వుండగా నాకెట్లా యింటికి తిరిగిపోవాలని బుద్ధి పుడుతుంది?

ఈ సుందర వనాల్లో దొరికే పండ్లు – అనేక రకాల జబ్బులకు నిలయాలైన మా వంటలకు సాటిరావా? సుప్రశాంత వాతావరణంలో వున్న ఈ పర్ణకుటీరం – కృత్రిమమైన మా భవనాలకు తీసిపోతుందా? నిస్వార్థ – నిరాడంబర జీవితం సాగించటానికి వీలుగా వున్న ఈ వనాలు పొట్టకూటికి ఆరాటపడే మా పట్టణాలకు తక్కువ స్థాయివని అంటారా?

అంతదూరం నుండి యింతదూరం ఎందుకు వచ్చాను? మహాత్ములు ధర్మవిదులు అయిన మిమ్మల్ని చూచి, కొత్త విజ్ఞానాన్ని సంపాదించుకోవాలనీ – దాన్ని మూర్ఖ లోకానికి పంచిపెట్టాలనీ వచ్చా. మీరు కాదంటే; వెనక్కిపోయి మీ పరోక్షంలో నేను చేసేదేమీ లేదు. ఈ ధర్మ సూక్ష్మాల నింకెవరి దగ్గర నేర్చుకొంటాను?

కృత్రిమ సుఖాలనిచ్చే ఆ లోకం నాకు పరమ అసహ్యమనిపిస్తుంది. సకల జంతు సామాన్యమైన, నిరాడంబరమైన ఈ వనంలోని జీవితమే బాగా వుంటుంది. నేనీ సుఖాలనే కోరుకుంటున్నా.

ఎన్ని కష్టాలు కలిగినా, మీ సాన్నిధ్యంలో భరిస్తా. గురుకుల వాసుల వల్ల కలిగే సాధక బాధకాలను అనుభవిస్తా. కత్తి మీద సాము లాంటి ఈ జీవితం కొనసాగించి బ్రహ్మచారిగా బ్రతుకును వెళ్ళబుచ్చుతా.

కాబట్టి గురూత్తమా! మీరెంతకాలం వుండమంటారో అంతకాలం మీ పాద సేవ చేస్తూ వుంటా. ఉపవాసాలు చేస్తా. కాయగసరులే తింటా. కటిక రాతి నేలపైనే పడుకొంటా. కానీ, సమస్త పురాణాలలోని సందేహ నివృత్తిని చేసి, నాకు విజ్ఞాన భిక్ష పెట్టండి. నన్ను మీ శిష్య పరమాణువుగా స్వీకరించండి.

సారంలేని చచ్చు చదువు చదివి పొట్టకూటికి అంగలార్చే ఉపాధ్యాయులను సేవించా; విసిగి వేసారినాను, ఇక ఆ ఉపాధ్యాయుల వూసే యెత్తను. ఆ పనికిమాలిన చదువే చదువను. మిమ్మల్ని విడిచిపెట్టేది లేదు."

నా దృఢమైన నిర్ణయాన్ని తెలుసుకొన్నాడు సూతముని కంఠీరవుడు ఒక్క నవ్వు నవ్వి నా వంక చూచాడు.

వత్సా! నీ అచంచల నిర్ణయం నాకు సంతోషాన్ని కలిగించింది. నేను కూడా నా

మీద మోపబడ్డ నిందల్ని తొలగించుకోవటానికి, తగిన వ్యక్తి కోసం రాత్రింబవళ్ళూ ఎదురుచూస్తున్నా. మొన్న వ్యాసుడు చెప్పినప్పటి నుంచీ నీ రాక కోసం అదే పనిగా చూస్తున్నా.

ఇవ్వేళటికి నాకోర్కె నెరవేరింది. మన యిద్దరి లక్ష్యం ఒకటే. అది తప్పకుండా నెరవేరుతుంది. లోకానికి మేలు కలుగుతుంది.

యోగ్యుణ్ణి చూచి దానం చేయమంటారు. అట్లాగే అర్హత గలవాడికే విజ్ఞానం దానం చేయాలి. ఇక నా మనస్సు కుదుటపడ్డది. ఏమీ ఆత్రం లేకుండానే, ధర్మ సూక్ష్మాలన్నీ నీకు చెపుతా!

ఇప్పుడు సమయం చాలా అయింది! సూర్యుడస్తమిస్తున్నాడు. చీకటి అలముకొంటూ వుంది. ఇప్పటికి నిద్రపో! రేపు ఉదయం కూర్చుని విషయచర్చ చేయవచ్చు" అని నన్ను పంపాడు.

నేను కూడా నమస్కరించి, అక్కడి నుంచి సెలవు తీసుకున్నా. సాయంకాలపు కాలకృత్యాలు తీర్చుకొని, పగలే సంపాదించి దాచుకొన్న పండ్లు తిన్నా. అక్కడే వేదికపై నున్న దర్భల చాప తీసుకొని, పరచుకొని సుఖనిద్రపోయా.

గంగానది నుంచి వచ్చే చల్లని గాలులకు నిద్ర లేచా. దిగులు మరచి నిద్రపోయిన రాత్రి గదా! అది. చాలా హాయిగా వుంది.

వెంటనే కాల్యకరణీయాలు తీర్చుకున్నా. ప్రపంచానికి వుపకారం చేసేవాడు - కఠినమైన తపస్సు చేసేవాడూ అయిన సూతమునిని దర్శించా. ఆయనకు సాష్టాంగ నమస్కారం చేసి, అనుమతి తీసుకొని దగ్గరలో కూర్చున్నా.

విప్పారిన మోముతో - దయగల చూపుతో నన్ను చూచాడు. నాతో మాట్లాడడం ప్రారంభించాడు.

"పుత్రా! భయంకరమైన ఎండల్ని లెక్కచేయకుండా, అంతదూరం నుంచి యింతదూరం వచ్చావు, కాని దేశమని కూడా లెక్క పెట్టలేదు. నీలో వున్న జ్ఞాన కాంక్ష నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నీకు కలిగిన సమస్త సందేహాలు చెప్పు. తప్పకుండా వాటిని తీరుస్తా.

వ్యాసుడు గురువుగా వుండగా నాకెన్నో విషయాలు చెప్పాడు. ఆయన చెప్పిన పద్ధతిలోనే నీ సంశయాలన్నీ తీరుస్తా" అని సెలవిచ్చాడు మహాముని.

దేని కోసం ఇంతదూరం వచ్చానో? ఎవరి దయ కోసం ఎదురు చూస్తున్నానో? ఆ మహానుభావుడు నన్ను సంశయాలు చెప్పమనేటప్పటికి నా సంతోషానికి పట్టపగ్గాలు లేకుండాపోయాయి. ఆలస్యం కూడా చేయదలచుకోలేదు. తడుముకోకుండా వరుసనే చెప్పటం మొదలుపెట్టా.

"మహా మునీ!

సంస్కృతం దేవతల భాషట గదా! అది చాలా ప్రాచీనమైన భాష గదా? ద్విజులు మాత్రమే (బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య) ఈ భాషను చదవాలి గాని, యితరులు చదువరాదట గదా!

ఒకవేళ శూద్రులు మొదలైన వాళ్ళు సంస్కృతం చదువుకొంటే వాళ్ళకు నరకం వస్తుందటగా!

ఇది వాస్తవమా!

శూద్రులు మొదలైనవాళ్ళు చదువకూడదా! చదివి పై కులాల వాళ్ళైన బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య కులాల వాళ్ళకి వినిపించకూడదా?

ఇట్లా పై కులాల వాళ్ళకు శూద్రులు చెపితే, శూద్రులే నరకంలో కూలతారట గదా!

మీరు గొప్ప వివేకులు కాబట్టి, తప్పకుండా నాకీ సందేహాలు తీర్చగలవారు మీరొకరే"

"అబ్బాయి! రామస్వామీ! మంచీ చెడు విచక్షణ లేకుండా, బ్రాహ్మణులు ధర్మాలను చెప్పారు. ఇది కార్యం- ఇది అకార్యం అనే బుద్ధి వాళ్లకు లేదు. మానవత అనేది వాళ్ళకు కనిపించదు. మర్యాద అంటే వాళ్ళకర్థం కాదు.

అంతేగాదయ్యా! వాళ్ళు తిరిగిన ప్రదేశానికి ఆర్యావర్తమని పేరు పెట్టారు. ఇది గంగా, యమునా, సరస్వతీ నదుల మధ్య భాగమని రాసుకొన్నారు. ఈ ఆర్యావర్తం చాలా పుణ్యభూమిగా ప్రచారం చేసు కున్నారు. తక్కిన నేల మ్లేచ్ఛ దేశం - తక్కిన ప్రజలు మ్లేచ్ఛులు. ఈ తుచ్ఛమైన ఆలోచన ఒక్క బ్రాహ్మణులకే చెల్లింది.

భవిష్యత్తు సంగతి అట్లా వుంచు. వేద ప్రమాణంగా నాకు తెలిసిన ధర్మాలను చెపుతా విను.

మునుపు సత్రయాగం జరిగేటప్పుడు ఇట్లాంటి గొడవ వచ్చింది. అప్పుడు శౌనకుడేమీ మారు మాట చెప్పలేక భయపడి ఆలోచించి - ఆలోచించి వ్యాసుణ్ణి ధ్యానించాడు. వ్యాసుడు ప్రత్యక్షమయ్యాడు. పక్షపాతం లేకుండా ఈ సత్రయాగంలోనే వ్యాసుడు ధర్మ నిర్ణయం చేశాడు. అప్పుడే వ్యాసుడికి - శౌనకుడికి సంవాదం జరిగింది. ఇది చాలా అవసరం. అందరూ తెలుసుకోవలసిన సంవాదమిది. దీని వల్ల ఎంతో మంచి జరుగుతుంది. నీకున్న సందేహాలన్నీ పటాపంచలౌతాయి. ఈ సంవాదం చెపుతా; జాగ్రత్తగా విను.

# వ్యాస శౌనకుల సంవాదం

మునుపొకప్పుడు నైమిశారణ్యంలో మునులు సత్రయాగం చేయాలనుకొన్నారు. ఆ యాగానికి ప్రసిద్ధులైన ఋషులందరినీ పిలిచారు. శౌనకుడు గూడా ఆ యజ్ఞం చూడటానికి

బయలుదేరాడు. వెళుతూ, వెళుతూ దారిలో నా దగ్గరకు వచ్చి నన్ను కూడా రమ్మన్నాడు.

"సూతమునీ! నేను సత్రయాగం చూడటానికి వెళుతున్నా. అక్కడికి పేరుమోసిన ఋషులంతా వస్తున్నారు. ఎందరో మహానుభావులు ఆ యాగం చూడాలని బయలుదేరారు. నీవు కూడా రా! అక్కడ చాలా మంది ఋషుల్ని చూడవచ్చు. అందరితో పరిచయం సంపాదించు కోవచ్చు. నీకు పెద్దవాళ్ళంటే గౌరవం చాలా వుంది గదా! అది నీ బోటి వాడు తప్పకుండా రావలసిన చోటు. ఏ మాత్రం సందేహించకు. మన జన్మ సార్థకమౌతుంది. వేరు మాట మాటాడక బయలుదేరు."

శౌనకుడి మాటలు విని, నేను కూడా ఎదురు మాట్లాడకుండా బయలుదేరా.

పుణ్య చరిత్రుడూ- సహృదయుడూ - నిష్కపటి - అయిన శౌనకుడి వెంట పోవటం మంచిదనే అనుకొన్నా.

నైమిశారణ్యం ఎప్పుడూ ఋషులకు నిలయమని తెలుసు. నాలో కోర్కెలు రకరకాలుగా సందడి చేస్తూ వున్నాయి. ఉత్సాహం వురకలు వేస్తూ వుంటే, శౌనకుడితో కలిసి సత్రయాగం జరిగేచోటికి వెళ్ళా.

అప్పటికి చీకటి వడ్డది. వెన్నెల రోజులు; నిండు పున్నమి. అప్పడే చంద్రోదయమయింది. వెన్నెల పిండారబోసినట్లుంది. ఆ వెన్నెలను చూచి కోకిలలు అది పట్టపగలనుకొని కూయటం మొదలుపెట్టాయి. కోకిల పాట విని బ్రహ్మచారులు ఉలిక్కిపడి లేచారు. బ్రహ్మచారుల ఈ స్థితి గమనించిన బైరాగులు ముసిముసి నవ్వులతో వాళ్ళను ఎగతాళి చేస్తున్నారు.

ఇంతలో మేము అక్కడకి చేరాం. మమ్మల్ని చూసీ చూడటం తోటే మునులంతా ఎదురువచ్చారు. అంతా కూర్చున్న తరువాత, కుశల ప్రశ్నలు అయిపోయి, యజ్ఞ ప్రదేశంలో కూర్చుని కాలక్షేపం కబుర్లలో మునిగాం.

అంతా పొడవాటి గడ్డాలవాళ్ళే. అడవిలో సుగంధ సుమాల వాసనను మోసుకొని వచ్చే చిరుగాలికి గడ్డాలు కదులుతున్నాయి. ఇంతలో ఓ తాపసవరుడు మాట్లాడటం ప్రారంభించాడు.

"మునీంద్రులారా! రేపు సత్రయాగం ప్రారంభం కాబోతున్నది. సమస్త పురాణ రహస్యాలు తెలిసిన మంచి కథకుడొకరు మనకు కావాలి. వచ్చిన వాళ్ళల్లో ఒకరిని ఎన్నుకోవటం అవసరం. పురాణ కథలు వినటం వల్ల పుణ్యం లభిస్తుంది. సమర్థుడైన వాని నొక్కణ్ణి చూపండి" అని అంటుండగానే శౌనకుడందుకొన్నాడు.

"ఓ పుణ్య చరిత్రులారా! కథకుడి కోసం మనం వెతుక్కోవలసిన అవసరం లేదు. కథాకథనంలో అందె వేసిన చేయి. వాక్చమత్కారంలో ఆరితేరినవాడు. పూత చరిత్రుడు - అయిన సూతుడున్నాడు. ప్రస్తుతం మన దగ్గరే వున్నాడు సూతుడు. ఈతణ్ణి కాదని

మనం ఇంకొకరిని కథకు ఎన్నుకోవటం చాలా చిన్నతనంగా వుంటుంది.

సకల ధర్మశాస్త్రాల రహస్యాన్ని తెలిసినవాడు. ఈతడు నిజంగా ఇక్కడ వుండడం మన భాగ్యమనే చెప్పాలి.

సమస్త శాస్త్రాలను చదివాడు; పెద్దలంటే వినయమూ - భక్తి పెనవేసుకున్నవాడు - సద్గుణశీల సంపద గలవాడు. డాంబికాలకు దూరంగా వుంటాడు. పరుషాలెరుగనివాడు. మృదు స్వభావుడు. సకల పండిత మండలి సన్నుతుడు. ఇన్ని శుభ లక్షణాలున్నవాడు సూతుడు. తప్పకుండా మనకు కథకుడుగా వుంటాడు" అని శౌనకుడు మృదుమధుర వచస్సులతో సహజ గంభీర స్వరంతో అన్నాడు.

దుర్వాసుడు ముక్కోపి; కానీ - నిష్కపటి. వాక్పారుష్యం గల వాడు అప్పుడక్కడే వున్నాడు. శౌనకుడి మాటలు విన్నాడు. తన సహజ ధోరణిలో ఎత్తిపొడుస్తూ మాట్లాడాడు.

"శౌనకా! మహా బాగా చెప్పావు. భేషు....! భేషు...! సభ్యులంతా నేమో వేదవేత్తలా...! ఇక భాష అందామా...! సంస్కృతం, కథాక్షేత్రం... జన్మ రాహిత్యాన్ని ప్రసాదించే నైమిశారణ్యం. సమయమందామా....! సత్రయాగం.

ఇట్లాంటి పరిస్థితుల్లో సూతుడు కథకుడా? ఒకవేళ సమస్త ధర్మాలు తెలిసినవాడు కావచ్చు - గొప్ప వివేకి కావచ్చు- ఇంకా వివిధ సల్లక్షణ సంపన్నుడు కావచ్చు. ఎంత మంచివాడైతే మాత్రం? ఈ శూద్రుడీ శుభ సమయంలో మన మధ్య కథకుడిగా వుండటమా? ఆహా...! ఎంత మంచివాడిని చూపించావయ్యా?

బ్రాహ్మణ - క్షత్రియ, వైశ్య జాతులను సేవించి లోకంలో ఎవరైనా నీతులూ - ధర్మాలూ నేర్చుకోవచ్చు. ఆ ద్విజుల్ని పూజించి స్వర్గానికి చేరవచ్చు. కానీ, శూద్రులు అగ్రకులాల వాళ్ళకు ధర్మ సూక్ష్మాలు ఉపదేశించటం మనం వాళ్ళ ద్వారా వినటం - ఎక్కడైనా వుందటయ్యా? అసలిది తగునా? మొత్తం మీద మంచి సలహాయే యిచ్చావు...!

సృష్టి మొదలైనప్పటి నుంచీ బ్రహ్మ యిల్లాలికి సరస్వతికి ఏ భాష జిలిబిలి పలుకులయిందో...? ఆబాలగోపాలం దేవతలు ఏ భాషలో పరమేశ్వరుడిని స్తుతిస్తూ వుంటారో? మనకు పూర్వులైన ఋషులు

ఏ భాషలో నేతి - నేతి - అని తాత్త్విక చర్చలు జరిపారో....? ఆదినారాయణుడు వేదాలను, వేదాంగాలను ఏ భాషలో చెప్పి ముని శ్రేష్ఠులకందిచ్చాడో...! అట్లాంటి పూజనీయమైన భాషలో సూతుడు కథలు చెపుతాడా!

సంస్కృత భాష చదవటానికీ వినటానికీ - మాట్లాడటానికీ సూతుడికి అర్హత వుందా...? తనకు అర్హత లేదని తెలిసి కూడా అతడీ పనికెట్లా సాహసిస్తాడు? తగుదునమ్మా...! అని మన మధ్యలో గొంతెత్తి ఎట్లా మాట్లాడుతాడు? వర్ణాశ్రమ ధర్మాలను వ్యతిరేకిస్తే వచ్చే ఫలితం అతనికి తెలియదా?

శౌనకా....! అనవసరంగా ఎందుకు లేనిపోని గొడవలు సృష్టిస్తావు? ఇంత అనాలోచితంగా, ప్రవర్తించడం ఎవరికీ మంచిదిగాదు. తన అర్హతను గుర్తించి ప్రవర్తించడం సూతునికే మంచిది. స్వధర్మాన్ని వదలి ప్రవర్తిస్తే ఎంత పాపం చుట్టుకుంటుందో తెలిసి కూడా శూద్రుడు బరి తెగించటం దుస్సాహసమే అవుతుంది"

దుర్వాసుడి నిసర్గ వాక్పారుష్యానికి సభికులంతా నిశ్చేష్టులయ్యారు. కొందరు మునులు విషాద వదనాలతో దిక్కులు చూడసాగారు. ఇంకా సంయములు స్థంభించిన మొగాలతో నా వంక చూడటం మొదలుపెట్టారు - మరికొందరు తాపసులు విహ్వల మనస్కులై ఏమీ తోచక యెవరేమి చెపుతారోనని అందరివంకా చూస్తూ వేచి వున్నారు. ఇంకా మరికొందరు తమలో తాము గుసగుసలు పోతూ - 'మనకెందుకులే' అన్నట్లున్నారు.

శౌనకుడు గూడా కొంతసేపు పిడుగు పడ్డట్టయి మౌనంగా వుండి కాసేపటికి తెప్పరిల్లుకొని సభ్యుల మొఖాల వంక చూచి గంభీర ముద్రదాల్చి జలదస్వన గాంభీర్యంతో అన్నాడు.

"తాపసేంద్రులారా! దుర్వాస మహర్షి పలికిన విధం విన్నారు గదా! ఇది వాదించుకునే సమయం గాదు. విషయం గూడా వివాదానికి తావిచ్చేది గాదు.

వేదవ్యాస మహర్షి సూతమునికి మునుపెన్నడో, నాలుగు వేదాల ధర్మసూక్ష్మాలను వినిపించాడు; వేదాంగాలు బోధించాడు. ఆనాడే, సూతుడు దేవతల భాషయైన సంస్కృతం నేర్చుకొన్నాడు. ఇతరులకు కూడా నేర్పాడు. కొత్తగా మళ్ళా యిప్పుడు దాని విషయం చర్చించటం అనవసరం. సంస్కృతం నేర్చుకోవటానికి - ఇతరులకి నేర్పటానికీ శూద్రులు ఏనాడో అర్హత సంపాదించారు. ఇప్పుడీ సందేహం అనవసరం.

ఒకవేళ మీరు నేను చెప్పినదానిని నమ్మకపోతే, వేదవ్యాసుడే వచ్చి, ఈ వివాదాన్ని పరిష్కరిస్తాడు. మీకున్న సందేహాన్ని తొలగిస్తాడు. ఇదమిత్థమని నిర్ణయిస్తాడు. ఏది ధర్మమో - ఏది అధర్మమో - గూడా తీర్పు చెబుతాడు.

బాదరాయణుడొక్కడే వేదవేత్త. ఈ సంశయాన్ని తీర్చగలవాడాతడొక్కడే. ఇతరులెవ్వరూ దీనిని తీర్చలేరు - అని చెప్పి శౌనకుడు కన్నులు సగం మోడ్చి వ్యాసుణ్ణి సంస్మరించాడు.

శౌనకుడు స్మరించినంతనే, వ్యాసుడు ప్రత్యక్షమయ్యాడు. చలికి, ఎండకు - గాలికి ఏమాత్రం చెక్కుచెదరని గొప్ప తేజస్సు గల శరీరం మిరుమిట్లు గొలుపుతూ వుంది. మొల చుట్టూ వచ్చేట్టు అందంగా చుట్టిన జింక చర్మం మెరుగులీనుతూ వుంది. గంగానది నీటితో నింపిన కమండలు శరీరపు ఎడమ భాగాన సుందరంగా వ్రేలాడుతూ వుంది. యోగదీక్షాసమయంలో వుపయోగపడే త్రిదండం కుడి చేతిలో ప్రకాశిస్తూ వుండగా హిమ పర్వత ప్రాంతం నుండి, పొడవాటి జడలు వ్రేలాడ వ్యాసమహర్షి మా కళ్ళెదుట కనిపించాడు.

హిమాలయ పర్వతం ఎక్కడ? స్మరించి గడియ కూడా గడవకముందే, యింత దూరం వచ్చాడు. ఏ మాత్రం చెదరడు; చెమర్చ లేదు. నిజంగా అతడెంత గొప్పవాడో? సిద్ధసంకల్పులంటే, నిజంగా యిట్లాంటివాళ్లే.

ముఖంలో అద్భుతమైన తేజస్సు తాండవిస్తోంది. వ్యాసుడి వదనం ఎంతో ఆకర్షణగా వుండి మమ్ములనందరినీ సమ్మోహింపజేసింది. వ్యాసముని రాకతో సభ్యులంతా లేచి ఆమందానందంతో - 'నమో - నమ' అని నమస్కరించారు.

మమ్మల్ని చూచీ చూడగానే, అభిమానం - ప్రేమ వుట్టిపడేట్టు మా వంక చూచాడు. వాత్సల్యంతో మందహాసం చేస్తూ 'కూర్చోండ'ని సంజ్ఞ చేస్తే కూర్చున్నాం.

"మునులారా! అంతా క్షేమమేనా? మీరేమీ విచారించకండి. ఓర్పుతో వుండడం మంచిది.

శౌనకా! నీవు నన్ను మనస్సులో స్మరించినంతనే, నా కంతా స్ఫురించింది. సమస్తం తెలుసుకొన్నా. నీ సందేహాన్ని తీరుస్తా. దుర్వాస ముని కూడా తనకు గలిగిన సంశయాన్ని నివృత్తి చేసుకొంటాడు.

నా సూక్తులు విను; దుష్టకార్యాలను దరిచేరనీయకు; ధర్మాలను పాలించు; కార్యాకార్యాలను తెలుసుకుని ప్రవర్తించు. అని దుర్వాసుడి వంక చూచి -

"దుర్వాస మహామునీ! కోపతాపాలు మాని చెప్పేది విను. గర్వం దిగవిడిచి శ్రద్ధతో ఆలకించు. ముందు వెనుకల విషయం చర్చించి ధర్మమార్గాన్ని వినిపిస్తా.

సంస్కృత భాషను పతితపావన భాష - అని అంటాం గదా! పతితులైన శూద్రులకు పనికిరాక, ఇతరులకు పనికివచ్చేటట్లయితే, ఆ భాషా గౌరవం ఇంకేముంటుంది? శూద్రులు పామరులుగా బ్రతుకుతున్నారు. వాళ్ళు ఏ రకంగానూ సంస్కృతం చదువరాదంటే, వాళ్ళు నాగరికులుగా కాగూడదనేగా మన భావన; వాళ్ళు విజ్ఞానవంతులు కాగూడదనేగా మన ఆలోచన. పామరులను తరింపచేయని భాష ఉన్నా వొక్కటే - చచ్చినా ఒక్కటే. ఇక మనం ఆ భాషను గురించి తలవటమే అనవసరం. దాని పేరే యెత్తగూడదు; ఆలోచించు.

పవిత్రమైన గంగానది జలాల్లో మునిగిన మాత్రాన ఎంత ఘోరపాపం చేసినవాడైనా, తరిస్తాడని అంటారు గదా! అట్లాగే యెంతటి పామరుడైనా, సంస్కృతభాషను నేర్చుకొంటే తరిస్తాడు; విజ్ఞానవంతుడౌతాడు. నాగరికుడౌతాడు. దీన్ని కాదనగలవా?

శూద్రుల వల్ల ధర్మాలను తెలుసుకోవటం ద్విజుడికి సిగ్గుచేటుగా వుంటుందను కొంటున్నారా? ఇది శిష్టాచారం కాదనుకొంటున్నారా? ధర్మవిరుద్ధమంటారా? వేద విరుద్ధమంటారా? ఏమంటారు. ఎందుకట్లా భావిస్తున్నారో నాకర్థం కావటం లేదు. అయితే, ఒక విషయం చెపుతా విను.

ఒక పతివ్రత పంపగా, గర్విష్ఠుడూ - ముక్కోపి - అయిన కౌశికుడనే బ్రాహ్మణుడు ధర్మవ్యాధుడనే బోయ వద్ద ధర్మ మార్గాన్ని విన్నాడు. వేద రహస్యాలను తెలుసుకొన్నాడు. ఈ కథ మీకు సవిస్తరంగా చెపుతా వినండి.

# ధర్మవ్యాధుడి కథ

కౌశికుడనే బ్రాహ్మణుడున్నాడు. అతడొక వట వృక్షం క్రింద ఘోర తపస్సు చేస్తున్నాడు. ఒకనాడతడు యోగ నిష్ఠలో వుండగా ఆ చెట్టుపై నున్న కొంగ అతనిపై రెట్ట వేసింది. దానికి ఆగ్రహోదగ్రుడైన కౌశికుడు తీవ్రమైన చూపులతో పైకి చూచాడు. అతని తీవ్రమైన కంటి చూపుకు కొంగ మాడి కిందపడ్డది. అది చూచిన కౌశికుడు ఆ ప్రదేశం నుండి లేచి వెళ్ళాడు.

ప్రక్కనే వున్న వొక పల్లెకు భిక్షాటన కోసం వెళ్ళాడు. ఒక పతివ్రత యింటి ముందాగి - "భవతీ! భిక్షాందేహి!" అని భిక్ష కోసం కేక వేశాడు.

భిక్ష కోసం వచ్చిన కౌశికుడి కంఠస్వరం విని, ఆ పతివ్రత లోపల నుండి భిక్ష తీసుకొని వస్తోంది. ఇంతలో ఆమె భర్త మండుటెండలో నడచి యింటికి అప్పుడే వచ్చాడు.

చెమట కారుతూ- అలసి సొలసి మండుటెండలో వచ్చిన భర్తను గాంచి, వెంటనే స్నానానికి చల్లని నీళ్ళు పెట్టింది. భర్త స్నానం చేసిన తరువాత తెల్లని శుభ్ర వస్త్రాలిచ్చి ధరింపజేసి, భోజనం పెట్టింది. శ్రమపడి వచ్చిన భర్తతో కాసేపు వూసులాడి భోజనం ముగిసిన వెంటనే నిద్రకు పడక యేర్పాటు చేసింది. భర్త నిదురించిన తరువాత భిక్ష తీసుకొని ఆమె బయటకు వచ్చింది.

చిరునవ్వుతో భిక్ష తీసుకొని వస్తున్న పతివ్రతా తిలకాన్ని చూచిన కౌశికుడు కోపంతో పెదవి కొరుకుతూ కళ్ళెర్ర జేసి కఠిన స్వరంతో-

"ఓసీ! ఇంటి ముందు బ్రాహ్మణుడు భిక్ష కోసం నిలబడితే, ఏమీ పట్టనట్టు నీ పనిపాటలన్నీ ముగించుకుని తీరిగ్గా భిక్ష తీసుకొని వచ్చావా? కొరవితో తలగీరుకోవటం సమ్మతమా? ఎందుకిట్లా పిచ్చి పని చేశావు? బ్రాహ్మణుడికి అపకారం తలపెట్టి బ్రతికినవాడింతవరకూ ఈ విశాల ప్రపంచంలో లేడు" అని గద్దించాడు.

దానికా వనితారత్నం మొగాన చిరునవ్వు చిందులాడ, ఆ బాపని ఆగ్రహానికి కొంచెం కూడా చలించకుండా -

"ఓయీ తాపసీ! కొంగ రెట్ట వేసిందని కోపంతో బుద్ధిమాలి దాన్ని పొట్టన బెట్టుకున్నావు. నీ తపశ్శక్తిని బూడిదపాలు చేశావు. నిగ్రహం లేని నీవు బ్రాహ్మణుడవా? నీకు సద్గతి కలుగుతుందా? ఈ మాత్రం ఓర్పు లేనివాడు బ్రాహ్మణుడెట్లా అవుతాడు? తెలిసిన వాళ్ళెవరు విన్నా ఫక్కున నవ్వుతారు గదా!

శమం దమం లేకుండా, విజ్ఞానం లేకుండా, సమదృష్టి లేకుండా సహనం కించిత్తు కూడా లేకుండా బ్రాహ్మణుడెట్లా అవుతాడు ? బ్రాహ్మణుడని -గీ - పెట్టినంత మాత్రాన యెవ్వడూ బ్రాహ్మణుడు కాలేడు.

బ్రాహ్మణుడు కోపిస్తే ప్రపంచం భయపడటం నేనెరుగుదును. కానీ, నీ కోపాగ్ని కొంగను బూడిద చేసింది. అయినా పాతివ్రత్యం గల శీలవతులను కదలించలేదు. ఒక సామాన్యమైన చెట్టును కదిలించగల ఝంఝూమారుతం పర్వతాలను కదలించలేదు గదా!"

అని వెటకారంగా, నర్మగర్భితంగా, మర్మ భేదకంగా పలికిన ఆమె పలుకులు విన్నాడు కౌశికుడు. పతివ్రత పలుకులకు చకితుడయ్యాడు. ఆ సాధుశీల గొప్పతనానికి ఆశ్చర్యపడి "తల్లీ! క్షమించు. తెలియక యిట్లాగా మాట్లాడా. నీవెంతో ధన్యురాలవు. నా తప్పు క్షమించు; నాపై దయవుంచ వేడెద, దుర్లభమైన యోగదృష్టితో అంతా గ్రహించినట్లున్నావు. ఇదెట్లా సంభవించింది? నీ వల్లనే తెలుసుకోవాలని నా మనస్సు ఉబలాటపడుతోంది. సెలవీయ గోరుతున్నా."

కౌశికుడి గర్వభంగం జరిగిందని తెలుసుకొన్న పతివ్రతా తిలకం-

"ఓయీ! కౌశికా! భర్తకు నిష్కపటంగా సేవచేయటంవల్ల నాకీ శక్తి సామర్థ్యాలబ్బినాయి. నీవు కోపంతో కొంగను చంపి భిక్ష కోసం యిటు వచ్చావు. అప్పుడే నా భర్త పనికిపోయి, మండుటెండలో యింటికి వచ్చాడు.

శ్రమ చేసి వచ్చిన భర్తకు స్నానం - భోజనాదులు చూచి, నీకు భిక్ష తెచ్చా. ఈ ఆలస్యానికి సహించని నీవు ఎంతో మండిపడ్డావు. ఇదేనా నీ ధర్మం?

ఎంతకాలం నుండి, ఎంత తపస్సు చేస్తే మాత్రం ఏం ప్రయోజనముంది? మానవత్వమే లేని నీకు బ్రాహ్మణత్వమెట్లా సిద్ధిస్తుంది. తపస్సు చేసినంత మాత్రాన వుత్తమ బ్రాహ్మణుడనయ్యానని పొంగిపోకు. బ్రాహ్మణత్వమనేది పుట్టుకతో రాదు. గుణాల్ని బట్టి వస్తుంది.

ఇక్కడికి కొంతదూరంలో ధర్మవ్యాధుడనే బోయవాడున్నాడు. నీవు అక్కడికి పో. నీకు కావలసిన ధర్మాలన్నీ అతడు బోధిస్తాడు. ధర్మవ్యాధుడు వేద వేదాంగాల సారమెరిగిన వాడు."

ఈ మాటలకు జాతి బ్రాహ్మణుడైన కౌశికుడు కటకటపడ్డాడు.

"అమ్మా! బ్రాహ్మణోత్తముడైన నన్ను ఒక బోయకు శిష్యుడిగా పంపటం న్యాయమేనా? నేనాతనికి శిష్యరికం చేయడం సంభవమా? ఇంత శిక్ష విధించటం తగునా?" అని ఆవేదన వ్యక్తం చేశాడు.

"ఓయీ పిచ్చి బ్రాహ్మణుడా! ధర్మవ్యాధుడు పేరుకు బోయవాడు కావచ్చు. కానీ,

అతడు తాను చేసే కర్మను బట్టి, గుణగుణాలను బట్టి బ్రాహ్మణుడు. అతడు చాలా వివేకం గలవాడు. మహా మేధావి; అతనితో సమానమైన పండితుడు మరెక్కడా దొరకడు. నీవు నిజంగా బ్రాహ్మణత్వాన్ని పొందాలనుకొంటే, తప్పకుండా అతణ్ణి సేవించాలి. వెంటనే అతని దగ్గరకు వెళ్ళు.

ఒకవేళ నా మాట విని బోయకు శిష్యరికం చేయటం అవమానమనుకొంటున్నావా? అతడు పవిత్రాశయుడు. నీకు ధర్మతత్త్వాన్ని తప్పకుండా వివరిస్తాడు. పక్షపాతమంటే ఏమిటో యెరుగనివాడు.

ధర్మవ్యాధుడికి శిష్యరికం చేస్తే నీకు చిన్నతనం గాదయ్యా వచ్చేది, గొప్ప పేరు వస్తుంది. ఎంతో గౌరవం కలుగుతుంది" అని చెప్పింది.

ఆ నారీరత్నం మాటలకు ఎదురుచెప్పటానికి భయపడ్డాడు కౌశికుడు. ఆమె దగ్గర సెలవు తీసుకొని 'సరే' – అని ధర్మవ్యాధుడి దగ్గరకు ప్రయాణమైపోయాడు.

ధర్మవ్యాధుడు కటిక వృత్తి చేస్తాడు. జంతువుల మాంసం అమ్ముతూ వుంటాడు.

కౌశికుడు పోయే సమయానికి ధర్మవ్యాధుడు మాంసం అమ్ముతున్నాడు. చంపిన జంతువొకటి పైన వేలాడగట్టి వుంది. ఇంటి ప్రక్కనే మాంసం ఎండకట్టబడి వుంది. ఒక ప్రక్కన చీకులు వేలాడుతున్నాయి. అంతా నంజువాసన వస్తోంది.

మాంసం కొనడానికి వస్తూ పోతూ వుండే జనంతో అంతా గజి బిజిగా వుంది. చుట్టూ మాంసపు ఖండాలు – మధ్యలో ధర్మవ్యాధుడు. ఈ సన్నివేశం కౌశికుడి కంటబడ్డది.

ఆ పతివ్రతారత్నం ఈతని దగ్గరకు పొమ్మనేనా? మాంసం అమ్ముతున్నాడు. జంతువధ చేసి హింస చేసే యితడు నాకు ధర్మాన్ని యెట్లా చెపుతాడు? ఏమని చెపుతాడు? ఈతని వుపదేశం విని యెట్లా తరిస్తాను? నాకెట్లా బ్రాహ్మణత్వం సిద్ధిస్తుంది?" అని తనలో తానే తర్కించుకొని వనితా లలామ చెప్పిన పల్కులను తిరస్కరించటానికి భయపడి, ధర్మశీలుడైన ధర్మవ్యాధుడి దగ్గరకు వెళ్ళాడు కౌశికుడు.

"మహాత్మా! పతివ్రతా తిలకం ఒకామె పంపగా ధర్మసూక్ష్మాలు తెలుసుకొందామని మీ దగ్గరకు వచ్చా. మీరు సమస్త ధర్మాలు తెలిసినవారనీ, వాటి మర్మాలను వివరించి చెప్పగల సమర్థులనీ తెలిసి మిమ్మల్ని ఆశ్రయించి పరమపదం పొందాలని వచ్చా" అని విన్నవించుకొన్నాడు.

మందహాసం మొగంలో తొలుకాడ ధర్మవ్యాధుడు కౌశికుణ్ణి చూచాడు.

"కౌశికా! కోపంతో నీవు చెట్టుమీది కొంగను చంపటం తెలుసు. పతివ్రతామణితో వివాదం పెట్టుకొని, కోపంతో పరుషంగా మాట్లాడడం యెరుగుదును. అక్కడి నుండి, ఆమె పంపితేనే నీ జన్మ సార్థక్యం చేసుకోవడానికి యిక్కడకు రావటం గమనించా. నీ సంగతి సమస్తం యెరుగుదును. నీవిక యేమాత్రం చెప్పవలసిన పనిలేదు"

ధర్మవ్యాధుడి దివ్యజ్ఞానానికి ఆశ్చర్యపడ్డ కౌశికుడు, ఏమీ అసహ్యించుకోక యిష్టపడి సేవ చేసి, కావలసిన ధర్మసూక్ష్మాలు తెలుసుకొని కృతకృత్యుడై కొంతకాలానికి మోక్షపదం పొందాడు.

శౌనకా! ఒక స్త్రీ, ఒక బోయవాడు పుట్టు బ్రాహ్మణుణ్ణి ధర్మ మార్గంలో పెట్టడం- దానివల్ల అతడు మోక్షపదం పొందటం విన్నాం గదా! ఇంత విని గూడా మీరింక సందేహపడడం దేనికి?

"మేమే జ్ఞానులం. మాకంతా తెలుసునని" గర్వించి, పామరులను చూచి యేవగించుకోవటం మంచిది గాదు. నిజంగా జ్ఞానవంతుడైతే, అజ్ఞానుల దగ్గరకు పోయి, వాళ్ళకు తెలియని విషయాలను తెలియజెప్పి, జ్ఞానులుగా చేయటం మొదటి కర్తవ్యం. అట్లా గాకుండా, తక్కువ చూపుతో దూరంగా పోయి, అసహనంతో - చులకనగా చూడడం పెద్ద నేరం. దీన్ని తప్పకుండా నిరోధించాలి.

విద్యా సముపార్జన చేసిన ప్రతివాడూ పామరులను చైతన్యపరచాలి. ఒకవేళ ఏదో రకంగా, పామరుడొకడు జ్ఞాన సంపాదన కావించి ముందుకు వస్తే, అతణ్ణి పక్కకు పంపాలనే దురాలోచన గర్హనీయం. అది మూర్ఖ లక్షణమౌతుందే గాని, సజ్జన లక్షణం గాదు. పామర స్వభావమనిపించుకొంటుందే గాని, పండిత స్వభావం గాదు.

అందుకే ఈ విషయం గుర్తించే నేను, సూతుణ్ణి చిన్నతనంలోనే దగ్గరకు చేరదీశా. ఎంతో ప్రేమతో వేదాలు - వేదాంగాలు వివరించి చెప్పా. ధర్మశాస్త్రాల సారం వివరించా. సమస్తమైన ఆచార విధులను తెలిపి పండితుణ్ణిగా మలిచా.

అతడెంతో భక్తిశ్రద్ధలతో సేవించాడు. దానికెంతో మురిసిపోయా. అతనికంటే యోగ్యుడైన కథకుడు మీకెవరు దొరుకుతారు? మీ సత్రయాగంలో కథకుడుగా వుండటానికి కావలసిన అర్హతలన్నీ సూతుడికి వున్నాయి.

దేవతల భాషగా చెప్పబడే సంస్కృతభాషను ఆమూలాగ్రం నేర్చుకొన్నాడు. ఆ భాషలో ఆరితేరిన పండితుడయ్యాడు. అంత నేర్చినా, గర్వం సుంత కూడా లేదు. ఎంతో చిత్తశుద్ధి గలవాడు. ధర్మబద్ధం గాని విషయం చెప్పానని భావించకు. వేద సారమంతా తరచి - తరచి ఈ విషయం చెప్పా. అనవసరంగా లేనిపోని సంశయాలు తెచ్చుకొని మల్లగుల్లాలు పడకు. ఇంకా ముందు పిదపకాలం రాబోతోంది.

మీ సత్రయాగం కోసం యిక్కడ వుందామని వుంది. కానీ, వుండటానికి అవకాశమే లేదు. ఉదయమే సేతుబంధంలో మునగాలి. కాబట్టి, అక్కడికి పోవాలి" అని అంతలోనే అంతర్ధానమయ్యాడు వ్యాసుడు.

వ్యాసుడు చెప్పిందంతా విన్నాడు దుర్వాసుడు. సంతోషంతో నా వంక చూచాడు.

"సూతమునీ! వ్యాసుడు చెప్పిందంతా విన్నా. మాకున్న సందేహాలన్నీ పటాపంచ

లయినాయి. ధర్మాధర్మాలను తెలుసుకోవాలని ఆరాట పడ్డా. అందుకే నేనట్లా ప్రవర్తించా. ఇప్పుడు నాకు ధర్మమంటే ఏమిటో తెలిసింది. నేను నీ పట్ల ప్రవర్తించిన ధోరణికి అన్యథా భావించకు; క్షమించు.

ఇక మాకు కథకుడిగా వుండి, మా కోర్కెలు తీరే విధం తెలుపగోరతా. మా వ్యధలు పోయేట్టుగా విష్ణుకథలు వినిపింపగోరుతా" - అని కోపమంతా దిగమ్రింగి అన్నాడు.

సత్రయాగ ప్రదేశంలో చేరిన మునీంద్రుల సమక్షంలో వేదవేద్యుడూ - తపో మహిమచే తెలియదగినవాడూ అయిన భగవంతుణ్ణి సంస్కృతభాషలోనే పొగిడా. పాపుల పాపాలను నాశనం చేసే ఆ పరమాత్మ కథలనన్నిటినీ వరుసబెట్టి చెప్పా.

మంచి మాటయితే చిన్నపిల్లలు చెప్పినా వినాలనే పెద్దల సూక్తి మంచిది. లోకానికి వుపకరించేది అయిన వాక్యం ఎవరు చెప్పినా వినాలి. ఫలానా కులంవాడు చెపితేనే వినాలి అనే నియమం లేదు. ఉన్నత కులంవాడుగా చలామణీ అయ్యేవాడు ఎంత నీచమైన మాట చెప్పినా వింటామా? వినవలసిందేనని నియమం వుందా?

శూద్రుడు మంచిమాట చెపితే వినరాదా? వినగూడదని శాసనం వుందా? జాతి - మత - లింగ వివక్ష లేని మంచిమాట యెవరు చెప్పినా వినవలసిందే. బురదలో పుట్టిన తామరను తలపై ధరించటం లేదా? పుట్టినచోటు బురద కాబట్టి దాన్ని తిరస్కరిస్తున్నామా?

ధర్మం శూద్రుడి నోట వింటే, శూద్రుడు చెప్పితే, వాటిని ఆచరిస్తే కొంపలు మునిగిపోవు. తప్పనిసరిగా మేలు కలుగుతుంది.

అంతేగాకుండా, ఇంకో సంగతి కూడా చెపుతా. జాగ్రత్తగా పరాకు లేక విను.

రామస్వామీ! నీవు తెలుగుదేశం నుంచి వచ్చావుగా! నీకో విషయం తెలిసి వుండాలి. మీ దేశంలో కంచర్ల గోపన్న అనే రామభక్తు డొకడున్నాడు. అతడెవరు? ఏ కులంవాడు? బ్రాహ్మణుడు గదా! బ్రాహ్మణ కులంలో పుట్టిన గోపన్న రామభక్తుడెట్లా అయ్యాడో తెలుసా? అతనికి భక్తితత్వాన్ని ఎవరు బోధించారో తెలుసా?

పై కులాల వాళ్లచే మ్లేచ్ఛుడుగా చెప్పబడే - కబీరు - అనే మహమ్మదీయుడు గదా!

ఒక మహమ్మదీయుడి భక్తితత్వం బ్రాహ్మణుడు గ్రహించాడు. అతడు మీ తెలుగుదేశంలో గొప్పవాడయ్యాడు. అతనికే పాపం అంటలేదు.

కానీ, ఒక శూద్రుడు చెపితే, అగ్రకులాల వాళ్ళు ధర్మం వినరాదా? వింటే దోషం వస్తుందా? ఇదెక్కడి న్యాయం? ఇది వేద విరుద్ధం గాదా?

వ్యాసుడికి, శౌనకుడికి జరిగిన సంవాదం నేను కళ్ళారా చూచా; విన్నా. ఆ విషయం నీకు తు.చ. తప్పకుండా చెప్పా. ఇది విన్న తరువాత బహుశః నీ సందేహాలు తీరిపోయి వుండాలి." అని నా వంక చూచాడు సూత మహాముని.

"మహాత్మా! అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అన్ని విషయాలు వివరించారు. సందేహాలు తీరకుండా ఎట్లా వుంటాయి? ధర్మశాస్త్రాల ఆనుపానులు తెలిశాయి.

ఇప్పటివరకు మీరు వ్యాసుడు చెప్పిన పూర్వ ధర్మాలన్నీ వివరించారు. కానీ, మేము కలియుగంలోని వాళ్ళం. మరి - మాకు మా యుగధర్మాలు రావాలి. కాబట్టి, కలియుగంలో వుండే ధర్మాలు - వాటి రహస్యాలు వివరించగోరుతా.

నా మాటలకు మందహాసం చేశాడు మునీంద్రుడు.

"అబ్బాయీ! ఆర్యధర్మాలు - సనాతన ధర్మాలు - ఇవి యెల్లప్పుడూ ఒకే రకంగా వుంటాయి. కాలాన్ని బట్టి మారవు. ధర్మం అనేది - ఒక కాలంలో ఒక రకంగా - ఇంకో కాలంలో ఇంకోరకంగా వుంటుందని చెప్పటం అవివేకులు చేసే పని. కాలాన్ని బట్టి మారక, యెల్లప్పుడూ ఒకే రకంగా వుంటాయి కాబట్టే, వాటిని ధర్మాలని అన్నారు. వైదిక ధర్మంలో వుండే గొప్పదనమే అది.

ధర్మం కృతయుగంలో ఒకరకంగా, త్రేతాయుగంలో ఇంకో రకంగా, ద్వాపర యుగంలో మరో రకంగా, కలియుగంలో వేరేవిధంగా వుంటుందని అనటం బుర్రలేని వాళ్ళు చెప్పే మాటలు. ఏ యుగంలోనైనా వైదిక ధర్మం చలించకుండా ఒకే రకంగా వుంటుంది. యుగాన్ని బట్టి మారదు. అట్లా కాలాన్ని బట్టి తారుమారయేట్టయితే, అది ధర్మంగా చెప్పబడదు.

కర్మభ్రష్టుడికైనా - నియమ శీలుడికైనా ధర్మం ఒక్కటే. కాలం ధర్మాన్ని మారుస్తుంది అని చెప్పే మాట అబద్ధం.

కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతోనూ, త్రేతాయుగంలో అదే ధర్మం మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలతోనూ, కలియుగంలో ఒక పాదంతోనూ నడుస్తుందని అంటారు. ధర్మద్యుతి మూలాన యుగ భేదమైందని చెపుతారు" అంటూ చెప్పుకుపోతున్నాడు.

ఇంకా, యిది యెంత కొనసాగుతుందోనని మధ్యలో అందుకొన్నా.

"స్వామీ! తెలిసో, తెలియకో అడుగుతున్నా. సంస్కృతం గూర్చి కొన్ని విషయాలు చెప్పారు. వాటిని అర్థం చేసుకున్నా. కానీ, తెలుగుభాషా విషయం గూర్చి కొంత తెలుసుకోవాలి. తేటతెల్లంగా నాకు దీని గురించి చెప్పగోరుతా.

తెలుగువాడై కూడా పరాయి భాషయైన సంస్కృతాన్ని గడిదొంగ లాగా చదివి, దాంట్లో పేరు ప్రతిష్ఠలు సంపాదించి, ఓర్పు - ఔదార్యాలు లేకుండా, లగ్గా - ఎగ్గా చూడకుండా అప్పకవి అనేవాడు తెలుగు కవుల్ని, తెలుగు కావ్యాలను గూడా చాలా నీచంగా చూచాడు.

శూద్రుడైనవాడు మంచి మంచి అలంకారాలతో, ఎంతో అందంగా వ్యాసం

రాసినప్పటికినీ అతని గ్రంథాన్ని ఎవ్వరూ ఆదరించరాదు; గ్రహించరాదు.

హోమంలో వేల్చే ద్రవ్యం ఎంత మంచిదైనా, కాకి తాకితే పనికి రాదు గదా! కావ్యం బాగా వుండవచ్చు; కానీ శూద్రుడు రాశాడు కాబట్టి దాన్ని బహిష్కరించాలి."

ఇంత క్రూరంగా వ్యవహరించిన అప్పకవి విషయం మీరేమంటారు? ఇట్టా రాయటం సబబేనంటారా?

అని నేననేటప్పటికి, అర్ధ నిమీలిత నేత్రాలతో ఆలోచించి దయగల చూపులతో నా వంక చూచి తల నిమిరాడు.

"కుమారా! నీవడిగిన విషయం మంచిదే. ఎరిగిన సంగతి చెప్పాలి. అట్లా తెలిసిన సంగతి చెప్పకపోవటం మంచిదిగాదు; ధర్మహాని అవుతుంది. నిజంగా ఈ రోజుల్లో మానవ సమాజం ఎంత దురభిమతంగా వుందో ఎట్లా చెప్పాలి?

అప్పకవి వ్రాసిన వ్రాతలకు కోపం తెచ్చుకోవలసిన పని లేదు, కులం పేరుతో ఇతరులను చులకన చేసి నిందించే తులువలు తగిన ఫలితం కాలక్రమంలో అనుభవిస్తారు.

ఏదియేమైనా, అడిగావు కాబట్టి చెపుతా. తెలియనిదాన్ని తెలుసుకోవడం కూడా చాలా మంచిదే.

ఆప్పకవి లాంటి చదువుకొన్న మూర్ఖుల ప్రవర్తన అట్లాగే వుంటుంది ఎంత చదువు చదివినా! ఎన్ని శాస్త్రాలు తిరగవేసినా సంస్కారహీనులు అవగుణాలను మానలేరు. తాను చదివిన చదువుల ఫలితం ఏమిటో గూడా తెలియని పండితమ్మన్యుడు అప్పకవి.

సత్యము - శౌచము - సౌశీల్యము - లేని చదువులెన్ని చదివినా యెందుకు? తగులబెట్టనా? పొట్టకూటి కోసం మన పూర్వులెవ్వరూ చదివిన దాఖలాలు లేవు. కానీ, అప్పకవి లాంటి పొట్టకూటి రాయుళ్ళ చదువులిట్లాగు తగులబడి చస్తాయి.

ప్రజల్ని పీల్చి పిప్పి చేసే దురాచారాన్ని విడనాడని చదువు లెందుకూ పనికిరావు. మూఢత్వాన్ని - మూర్ఖత్వాన్ని పెంపొందించే చదువుల వల్ల ప్రయోజనం కించిత్తు గూడా వుండదు.

శాస్త్రాల పేరుతో మోసపు రాతలు రాసి, సాటి మానవుణ్ణి మానవుడిగా చూడటానికి అవకాశం ఈయని ప్రబుద్ధులు అప్పకవి లాంటి వాళ్ళు అక్కడక్కడా వుంటారు.

మానవత్వాన్ని ప్రసాదించలేని చదువులు - చదువులే గాదు. అమానుషంగా ప్రవర్తించే విద్యాధికుడు పామరుడి కంటె హీనుడు.

సాటి మానవుడి శ్రమను కాలరాయటానికి కొంటె రాతలు చాలా రాశారు. చేతికి చిక్కిన ప్రతి అవకాశాన్ని తీసుకొని, నీతి పేరుతో దుర్నీతి బోధించారు. ధర్మం పేరుతో అధర్మం ప్రచారం చేశారు. మేక వన్నె పులుల్లాగా వ్యవహరించారు.

అధిక సంఖ్యాకులైన ప్రజల్ని చదువు సందెలకు - నాగరిక జీవితానికి దూరం చేశారు. తమ ముఖానే పొద్దు పొడిచినట్లు ప్రవర్తించారు.

పాండిత్యం ఏ ఒక్క జాతికో - ప్రతిభ ఏ వొక్క కులానికో చెందినట్లుగా కుటిల మనస్తత్వంతో కుక్షింభరులు వ్యవహరించారు. అందుకే రామరాజ భూషణుడు రాసిన మహత్తర కావ్యం వసుచరిత్రను చూచి కళ్ళు కుట్టి, శూద్రుడికింత పాండిత్యం యెక్కడ నుంచి వచ్చింది? ఇంత గొప్ప కావ్యం – అందులోనూ ప్రపంచ సాహిత్యంలో ధ్రువతారగా నిలిచే కావ్య సృష్టి శూద్రుడు చేయటమా! అని పళ్ళు పులిసి అప్పకవి, 'శూద్రుడు రాసిన పుస్తకం ఎంత మంచిదైనా పరిగ్రహించరా'దని శాసించాడు.

ఇట్లాంటి తప్పుడు రాతలు రాసినవాడు, ఆ మాట మీద నిలబడ్డాడా? అంటే అదీ లేదు. తాను రాసిన అప్పకవీయమను లక్షణ గ్రంథంలో, ఓ లక్షణం రాసి దానికి ఉదాహరణగా తాను దూషించిన శూద్రకవి భట్టుమూర్తి రాసిన వసుచరిత్ర నుండే ఒక ఉదాహరణ తీసుకోక తప్పలేదు.

ఎందుకీ పనికిమాలిన రాతలు రాయాలి? తాను, ఏ మహోన్నతకార్యం పనికి రాదన్నాడో, దాని నుండే వుదాహరణ ఎందుకు తీసుకోవాలి? వీళ్ళ నీతినేమనాలి? వీళ్ళు నీతిపరులా? అవినీతిపరులా? వీళ్ళు సాటి మానవులపైన చూపేది సోదరభావమా, శత్రుభావమా? మానవతకే యెంత మచ్చ తెచ్చే విషయాలివి?

అన్నమాట నిలబెట్టుకోలేని వ్యక్తిత్వం గల అప్పకవులు మన సమాజంలో పుట్టకొక్కుల్లా వున్నారు. వాళ్ళ సాంఘిక నీతే అట్లాంటిది.

రామస్వామీ! అయినా, కులాన్ని బట్టి ఒక కావ్యం విలువను నిర్ణయించే కుటిల బుద్ధులకు నిజంగా ప్రాయశ్చిత్తమనేదే వుండదు, ఏ కావ్యానికైనా దాని విలువ, అది రాసిన కవి కులాన్ని బట్టి వుంటుందా? కావ్యంలోని గొప్పదనాన్ని బట్టి వుంటుందా?

ఒకే కవి రెండు కావ్యాలు రాస్తే, రెండూ ఒకే విధంగా వుండేట్టు రాయలేడు. అందులో బాగా వున్న కావ్యాన్ని ప్రజలు చదువుతారు. ప్రసిద్ధమైన దాన్ని ఆదరించినట్టుగా, అప్రసిద్ధమైన కావ్యాన్ని ఆదరించరు. ఇది అందరికీ అనుభవంలో వున్న విషయం.

అంతెందుకు? తిక్కన కవి భారతం రాశాడు; ఆయనే నిర్వచనోత్తర రామాయణం -అనే గ్రంథం కూడా రాశాడు. కానీ సాహితీ ప్రపంచంలో భారతానికున్న పేరు ప్రఖ్యాతులు నిర్వచనోత్తర రామాయణానికి లేవు. భారతాన్ని చదివినంత వుత్సాహంగా, తిక్కన రామాయణాన్ని యెవ్వరూ చదువరు.

"వింటే భారతం వినాలి. తింటే గారెలే తినాలి" అనే తెలుగు సామెత, తిక్కన భారతం వల్లనే వచ్చింది. ఈ విషయం అప్పకవికి తెలియదా?

అవేశ పడకుండా గంభీరముద్రతో, సూత మహాముని చెప్పాడు. నేనూ ప్రశాంతంగా

విన్నా. నాలో పొంగులు పారుతున్న జ్ఞానతృష్ణ పీడిస్తోంది. ఇంకా తెలుసుకోవాలనే, వుబలాటంతో ఆ మునీంద్రుని వంక చూచా.

"మునివర్యా! ప్రపంచంలోనే మధురాతిమధురమైన తెలుగు భాషను తిట్టి - శపించి - ఇది మ్లేచ్ఛ భాష - దీనినెవ్వరూ చదువరాదని బడబడ గ్రంథాలు రాశారు. తెలుగువాళ్ళు మ్లేచ్ఛులు - అని కూడా నానా రకాలుగా కూశారు. ఇట్లాంటి వాళ్ళకు సద్గతులుంటాయా?

తల్లి భాష అయిన తెలుగును - గాసట బీసట భాష - అని ప్రచారం చేసి, "మాకు సంస్కృతం మాతృభాష" అని మాట్లాడే మాతృద్రోహులకు - విశ్వాసఘాతకులకు - ఏ రకమైన ప్రతిఫలం వస్తుందో సెలవిస్తారా?

తల్లిబాస అయిన తెలుగును తెగడే బాపనయ్యలకు శిక్ష ఏమిటో గూడా వివరించగోరుతా"

ఈ మాటలకు మౌనిచంద్రుడర్ధనిమీలిత నేత్రుడై కొంత తడవుండి, ఆపై నన్ను చూచి - "రామస్వామీ! తెలుగుతల్లి కడుపున బుట్టి, తెలుగు నేర్చి, తెలుగు మాగాణంలో ఆటలాడి - పాటలు పాడి, తెలుగు గాలి పీల్చి, తెలుగు చీమునెత్తురులు గలిగినవాడు, తెలుగు భాషను - తెలుగు ప్రజలను - తెలుగు దేశాన్ని నిందించటమంటే, సహించరానిది. అట్లాంటివాడికి నిష్కృతి వుండదు. తెలుగును తెగడువాడు తెలుగమ్మ బిడ్డడు గాదు.

అంతేగాదు; త్రికాలవేదులయిన మునీంద్రుడు, బ్రాహ్మణులు దయ్యాలు వేయి సంవత్సరాలు నకరంలో యమయాతనలనుభవిస్తారు, ఆ తరువాత కొంతకాలానికి వీరజన్మమెత్తి, చివరకు మానవుడిగా భూమిపై అవతరిస్తాడు. ఇది వేద వాక్యం.

దీనికి నిదర్శనంగా నీకో చిన్న కథ వినిపిస్తా.

# కబీరు

"తెలుగుదేశంలో గోదావరి నది ప్రవహిస్తుంది. అది సప్తఋషుల ఆశ్రమస్థలినే అంటుకొని ప్రవహిస్తుంది. ఈ నది తెలుగునాట, వేగీ మండలాన్ని సస్యశ్యామలం చేస్తుంది. ఈ నదిని దక్షిణ గంగానదిగా పొగడుతారు. గౌతమ ముని దీన్ని తీసుకువచ్చాడట. అందుకే యిది గౌతమీనదిగా పిలువబడుతుంది.

ఈ నది నీరు రైతుల భూముల్ని ఫలవంతం చేస్తుంది.

ఇట్లాంటి గోదావరి నది వొడ్డున ద్రాక్షారామమనే పుణ్యక్షేత్రం వుంది. ఈ క్షేత్రంలో తెలుగుల మూలదైవం భీమేశ్వరుడుంటాడు.

ద్రాక్షారామ క్షేత్రంలో దేవశర్మ - అనే బ్రాహ్మణుడొకడు కాపురం చేస్తున్నాడు. ఇతడు

వేద వేదాంగాలు చదివాడు; కర్మిష్ఠి, ఉదారస్వభావుడు కానీ, అతనికి సంతానం లేదు.

సంతానం కోసం ఎన్నో యజ్ఞాలూ - యాగాలూ చేశాడు, ఎంతోమంది బ్రాహ్మణుల్ని సంతృప్తి పరచాడు.

పుత్ర సంతానం లేకపోతే, సద్గతులుండవని విన్నవాడు. అందుకని సంతానం కోసం పరిపరివిధాల తపిస్తున్నాడు. చేసిన పుణ్యం - ఎటు పోయిందోనని వాపోతూ వున్నాడు.

అంతలో కొంతకాలానికి - చేసిన నోములు ఫలించాయా! అన్నట్లు దేవశర్మకు ఒక కొడుకు పుట్టాడు. పుత్రుడు కలగటంతో దేవశర్మకు కలిగిన ఆనందానికి అంతే లేదు. గ్రామంలోని జనులంతా ఎంతో సంతోషించారు. పిల్లవాడు కూడా ఎంతో చూడముచ్చటగా, శుభ లక్షణాలతో గొప్ప తేజస్సంపన్నుడిగా వున్నాడు.

దేవశర్మ జ్యోతిష పండితుల రావించి, కుమారుణ్ణి చూపించాడు. బాలుడు శుభ లక్షణాలను పండితులంతా ఒకే గొంతుకతో కొనియాడారు. విద్వాంసులు సంతుష్టులయ్యేట్టు దేవశర్మ వారిని చందనాదులతో పూజించి, బహువిధ వస్త్రాది బహుమానాలిచ్చి పంపాడు. పండితుల అనుమతితో ఆ కుర్రవాడికి శాస్త్రి అనే పేరు పెట్టాడు.

తల్లితండ్రుల గారాబు బిడ్డ శాస్త్రి యెదుగుతూ వున్నాడు. బాల్యం గడువగానే, విద్యా బుద్ధులు నేర్పించటానికి కులాచారం ప్రకారం గురు సన్నిధికి పంపాడు. కుశాగ్రబుద్ధియైన శాస్త్రి అరవై నాలుగు కళల్లో ఆరితేరిన వాడయ్యాడు. అసమాన పాండితీ ప్రకర్షతో వెలుగొందాడు.

గానవిద్యలో అతనికతడే సాటి. శ్రావ్యమైన గొంతెత్తి సామగానం చేస్తుంటే, నారద తుంబురులే తమ వీణలు గిరాటుకొట్టి, చెవుల్ని యిటు తిప్పి వింటారు.

తర్కం - వేదాంతం - మీమాంస - ఆయుర్వేదం - ఒకటేమిటి? సంస్కృతంలో ఎన్ని విద్యలున్నాయో, అన్ని విద్యలూ నేర్చాడు. ఇంత చదివినా, ఏ మాత్రం గర్వం లేదు.

కొంతకాలం గడిచింది.

చెట్టు చెడుకాలానికి కుక్క మూతి పిందెలు పుడతాయన్నట్లు శాస్త్రికి సంప్రదాయ విరుద్ధమైన - కులాచార వ్యతిరేకమైన ఆలోచన వొకటి పుట్టింది.

సకల శాస్త్రాలూ - సకల కళలూ - వేదవేదాంగ విద్యలూ - తుదివరకూ నేర్చిన శాస్త్రి, తాను సకల భాషలలో పండితుడు కావాలని భావించాడు. తండ్రి వద్దన్నా వినకుండా, తెలుగుభాష చదవాలని పట్టు బట్టాడు. పది రోజుల్లోనే తెలుగులో అపారమైన పాండిత్యాన్ని సంపాదిస్తానని పంతం పట్టాడు.

ఈ విషయం గ్రహించిన తండ్రి శాస్త్రిని వారించటానికి యత్నం చేశాడు.

"కుమారా! నీవు చాలా వివేకం గలవాడవు. సర్వశాస్త్ర పారంగతుడవు, ఇంకొకళ్ళు నీకు చెప్పవలసిన పనిలేదు. ధర్మాన్ని తారుమారు చేయకు. పర ధర్మం హాని కలిగిస్తుంది. స్వధర్మం శ్రేయస్సును కలిగిస్తుంది.

తెలుగుభాషను చదవడం మంచిది గాదు. మనం యెన్నో తరాల నుండి ఈ భాషను చదవడం మానివేశాం. చదవడం వల్ల ఎంతో కీడు వస్తుందని పెద్దలు చెప్పారు. తెలిసి ఎందుకీ అకార్యానికి తలపడ్డావు"

తండ్రి మాటల్ని శాస్త్రి పెడచెవిని పెట్టాడు. కంటి రెప్పల కొసలచే గెంటివేశాడు. నిర్వాతదీపంలాగా మౌనంతోటే తన మనోనిశ్చయాన్ని స్పష్టపరిచాడు.

ఒక సంవత్సరం గడిచిందో లేదో, తెలుగు భాషలో యెనలేని పాండిత్యాన్ని సంపాదించాడు. పండిత శ్రేష్ఠులనబడేవాళ్ళే, శాస్త్రి- ఆంధ్రభాషా పాండిత్యాన్ని చూచి ముక్కుపై వేలు వేసుకునేవాళ్ళు.

తండ్రి, దేవశర్మ తన కొడుకు అనతికాలంలో అపార పాండిత్యాన్ని, అద్భుత వైదుష్యాన్ని, నిరుపమాన శేముషీవిభవాన్ని సంపాదించినందుకు సాటి పండితులలో దీటు ఎవ్వరూ లేకుండా ప్రతిభ గడించినందుకు అమితానందాన్ని పొందాడు. కానీ, తెలుగు నేర్చుకొన్నందు వల్ల వచ్చే అనర్థాన్ని తలచుకుని కుంచించుకుపోయాడు.

ఒకవైపు మోదం, ఇంకోవైపు ఖేదం పెనవేసుకుపోగా దేవశర్మ ఎటూ పాలుపోక వున్నాడు.

ఎంతో ప్రతిభా సంపత్తి నుపయోగించి, అసమాన పాండిత్యాన్ని గడించాడు శాస్త్రి. అయినా, ధర్మాన్ని విడిచి అధర్మవర్తనుడైనందుకు ఫలితంగా క్రమక్రమంగా మానసిక జాడ్యానికి గురయ్యాడు. వివేకానికి విడాకులిచ్చాడు. పాడ్యమినాడు కానరాని నెలబాలుడు తరువాతనైనా కనుపించకపోడు గదా!

సుకుమారమైన శాస్త్రి ఆకారం వికారంగా మారింది. దబ్బ పండులా వుండే శరీరం, వైవర్ణ్యం చెందింది. అంతా నల్లటి మాడు చెక్కలా అయింది. అంత తెలివి ఏమైందో? యేమో వెర్రివాడుగా అయ్యాడు.

ఎంతో గొప్పవాడవుతాడనుకొన్న కొడుకు, యౌవనం వచ్చీ రాకుండానే యిట్లా నాశనం అయినందుకు దేవశర్మ మధనపడి శుష్కించాడు.

ధర్మాతిక్రమణం చేసినందుకు శాస్త్రి రూపురేఖలన్నీ మారి, క్రమక్రమంగా క్షీణించి చివరకు మరణించాడు. చేసిన కర్మ ఫలితం అనుభవించక తప్పుతుందా?

పెద్దల మాట వినకపోతే చాలా నష్టం జరుగుతుంది. మనుధర్మాన్ని దాటి ప్రవర్తించవద్దు - అని చెప్పిన తండ్రి మాటను త్రోసి పుచ్చి - 'అద్దంలోని నీడకు భయపడతావా?" అని మొండిగా ప్రవర్తించినందువల్ల యెంత చేటు మూడిందో,

అర్థమవుతుంది గదా! శాస్త్రి దుస్థితి గాంచిన తండ్రి హృదయం ఎంత విలవిల్లాడిందో గూడా తెలుస్తుంది గదా!

ధీమండలి మండనుడు - పండితవర్యుడు - అయిన బ్రాహ్మణుడు మనుమార్గాన్ని తప్పినందువల్ల కొంతకాలం నరకరూపంలో వుండి, శేషజీవితం గడపవలసి జన్మ పరంపర అనుభవించవలసి వచ్చింది. అతడు శ్రీరంగంలో ఒక ఆసామి యింట గంగి గోవుకు దూడగా జన్మించాడు.

వత్సంగా పుట్టిన అతడు ఒకపూట తల్లి చనుబాలు తాగి, గడ్డిపోచ కూడా ముట్టకుండా దుఃఖిస్తూ చివరకు ప్రాణాలు వదిలాడు.

మరణించిన వెంటనే, సుందరాకారుడూ - మహోన్నత గుణాల కాలవాలమైన - దేశికేంద్రుడూ- రామభక్త పరిపూర్ణ హృదయుడూ అయిన కబీరుగా జన్మించాడు. పుట్టుకతోటే రామభక్త పరతంత్రుడుగా పుట్టాడు. దూషణ, భూషణ తిరస్కారాలను లెక్కింపక వీతరాగుడుగా నిర్మోహుడుగా అవతరించాడు.

పూర్వజన్మలో తండ్రి చెప్పిన మాటలు వినక దుర్గతిపాలైన విషయం గ్రహించాడు కబీరు. మోక్ష సంపాదన కాంక్షియై ఈ జన్మలో రామభద్ర చరణ ధ్యానంచే యోగిగా సంచరించాడు.

నిరీహుడై తెలుగుదేశమంతా తిరిగి - తిరిగి గోపన్న అనే బాపనయ్యకు భక్తియోగాన్ని నేర్పి రామదాసుగా మార్చాడు. ఎక్కడా ఒక్క నిముషమైనా నిలువక సంచరిస్తూ చివరకు అన్యజన దుర్లభమైన మోక్షాన్ని పొందాడు కబీరు.

ఏ మాత్రం వ్యామోహం లేని సత్పురుషులు మోక్షాన్ని పొందటం ఆశ్చర్యమేమీ గాదు.

ఇట్లా శేష కర్మఫలం అనుభవించక కబీరు మరణించాడు.

నీవు తెలుగువాడివి గదా! మీ తెలుగుదేశంలో ఈ విషయం నలుమూలలా తెలిసే వుంటుందే...? నీకు తెలియదా!

ఎంత నిస్సంగుడైనా- ఎంత జ్ఞానియైనా - ఎంత సాధు చరిత్రుడైనా - మానవుడు కర్మఫలం అనుభవిస్తేనే గాని, మోక్షాన్ని పొందడు. లోకంలో ఈ మాటకు తిరుగులేదు.

శిష్య వాత్సల్యంతోనూ - దయతోనూ - సూతుడు నాకు ధర్మాలు స్పష్టంగా బోధించాడు. అప్పటికి చాలా సమయం అయింది. మిగిలిన ధర్మాలు రేపు చెపుతానని చెప్పి లేచాడు మునీంద్రుడు.

నేను గూడా - 'సరే' నని భక్తిపూర్వక నమస్కారాలు చేసి సెలవు తీసుకున్నా.

## 2

పాఠక మహాశయా! సూతముని దయవల్ల, ఆ మహామహుడి అనుగ్రహంవల్ల మొదటి భాగం రాశాను. ఇక రెండో భాగం కూడా వినిపిస్తా - శ్రద్ధతో విను.

సూర్యోదయం కాకముందే, వేకువ జామున భారత విహంగాలు ప్రభాత గీతాలాపన చేయటం మొదలెట్టాయి. పక్షులు కిలకిలారావం చేస్తూ గుంపులు గుంపులుగా గూళ్ళను వదలి వస్తున్నాయి. సుగంధంతో నిండిన తామరల మీద నుంచి వస్తూ మందమందంగా పిల్లగాలి వీస్తుంది. రాత్రి అంతా వేటాడి పులుల గుంపులు గుహల్లో దూరి గుర్రుపెట్టి నిద్రపోతున్నాయి. ఈ సమయంలో నేనూ, సూతమహాముని గంగానదికి పోయాం. ఆ నదిలో స్నానం చేసిన తరువాత జపం చేసి సాధుమూర్తి సూతుడు నాతోపాటే ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

దట్టంగా అలముకోవడం వల్ల చీకటిగా వున్న కానుగుచెట్టు క్రింద చింపిరిచాపపై కూర్చున్నాడు, కోకిల కాకలీస్వనం చెవులకెంతో విందు చేస్తుంది. ఏ మాత్రం వ్యాకులపాటు లేని హృదయంతో కూర్చున్న మహాముని చూపులు నాపై పడ్డాయి. ఆ చూపుల అర్థం గ్రహించిన నేను సక్రమంగా కూర్చున్నా.

అంతలో నా వంక చూచాడు. "పుత్రా! నిన్న చెప్పగా మిగిలిన ధర్మాలను చెపుతానన్నానుగా. బాగా ఆలోచించి, నీవు తెలుసుకోవలసిన ధర్మాలు ఏమేమి వున్నాయో నిర్భయంగా, నిస్సంకోచంగా అడుగు" ఈ మాటలు వినగానే ఉప్పొంగిన ఉత్సాహంతో, ఎంతో భక్తి గౌరవాలు నాలో తొందర పెడుతుండగా, ఆయన ఆజ్ఞను శిరసావహించా. వచ్చిన అవకాశాన్ని సరిగా వినియోగించుకోదలచా.

"మహాత్మా! అకలంక చరిత్రా! పురాణాలను శ్రద్ధతో, భక్తితో వింటే అరచేతిలో వైకుంఠం కనిపిస్తుందని కొంతమంది పండితులు గొంతు చించుకొని చెపుతూ వుంటారు, మీరు గొప్ప గొప్ప మునులు, పండితులు చెప్పగా విని వుంటారు గదా! పురాణాల గూర్చి పండితులు చెప్పేది నిజమేనా? అందులో ఎంతవరకు నిజం వుందో? దాచకుండా చెప్ప వేడుకొంటున్నా. ఈ శిష్యుని మీద అనుగ్రహం వుంచి వివరించగోరుతా.

సర్వసంగ పరిత్యాగులైన మీరు ఎవరికీ భయపడరు. మొగమాటమనేది కూడా మీకుండదు. దూషణ భూషణ తిరస్కారాలు మీ దరి జేరవు. సత్యం చెప్పటానికి మీకు అడ్డంకి లేదు. నా సందేహ నివృత్తి చేసి, నాకూ, లోకానికీ ఉపకారం చేయగోరుతా.

దేవతల లోకం ఏ దిక్కున వుంటుంది?

ఆ లోకంలో కాలాన్ని ఎట్లా లెక్కిస్తారు?

దేవతలంటే ఎవరు?

దేవేంద్రుడు ఎట్లాంటివాడు?

ఆయన ఆకారం ఎట్లా వుంటుంది!

దేవేంద్రుణ్ణి మూడు లోకాలకు అధిపతి అని అంటారు గదా! ఎందువల్ల?

దేవలోకంలో వుండే దేవతల శీలం ఎట్లా వుంటుంది? వాళ్ళ ప్రవర్తన ఎట్లా వుంటుంది?

దేవతల విరోధుల్ని అసురులని ఎందుకు పిలుస్తారు? వాళ్ళను ఇంకా పుణ్యజనులని, రాక్షసులనీ అంటారు గదా! ఎందువల్ల?

భారతీయులకూ, దేవయోనులకూ ఏమైనా సంబంధం వుందా?"

ముందుగా నాకీ సందేహ నివృత్తి చేయండి. ఇంకా అడుగవలసిన వాటిని, తరువాత అడుగుతా -

పౌరాణిక ప్రవరుడైన సూతముని నా మాటలు విని పట్టరాని సంతోషంతో ఉప్పొంగిపోయాడు.

"బాలకా! మంచి ప్రశ్నలు వేశావు. మునుపు నేను స్వానుభవంతో సంపాదించిన సమాచారం వుంది. జాగ్రత్తగా వింటే దేవతల గూర్చిన నీ సందేహాలన్నీ పటాపంచలై పోతాయి" అని చెప్పి తన అనుభవాన్ని సాదరంగా చెప్పసాగాడు.

# సూతముని స్వర్గలోక ప్రయాణం

దారుకావనంలో వున్న మునుల్ని చూడాలని నాకు ఒకనాడు బుద్ధి పుట్టింది. బుద్ధి పుట్టిందే తడవుగా, ఉప్పొంగి యోగబలంతో ఆకాశానికెగిరి అక్కడకు పోయా.

ఇంకేముంది, అక్కడకు పోయేటప్పటికి బ్రహ్మర్షులంతా పెద్దగా వాదోపవాదాలు చేసుకొంటూ గొడవలో వున్నట్లు కనిపించింది. ఎవరికి వాళ్ళు తమ తమ పాండిత్యం ప్రస్ఫుటమయ్యేట్టు సకల శాస్త్రాలు సమర్పిస్తున్నారు.

సభ్యులంతా ఆ మునుల వాదోపవాదాలు వింటూ ఆనందరసంలో మునిగి, మంచి యేకాగ్రతతో వింటున్నారు.

ఆ సమయంలోనే నేను పోయి, బ్రహ్మర్షులను చేరి నమస్కారం చేసి, సభాస్థలంలో కూర్చున్నా. ఆ క్షణంలో దేవతలు గూర్చి - దేవలోకం గురించి చర్చ తీవ్రంగా సాగుతోంది. సంయమీంద్రులంతా సంశయగ్రస్తులై ఆ విషయాన్ని ఎటూ తేల్చలేక వూరుకున్నారు. ఎవరికీ దారి - దిక్కూ తోచలేదు.

కొంతమంది మునులు 'ప్రతిదినం' - అంటే స్వర్గము దేవతల లోకమని చెప్పారు; ఇంకా కొంతమంది అదికాదు -'టిబెట్' అనేది దేవలోకమని చెప్పారు. హిమాలయ పర్వతాలు, అందులోనూ కైలాస శిఖరం దాటి ఉత్తరానికి వెళ్ళితే - టిబెట్ - కనిపిస్తుందని

మరి కొంతమంది ఋషులు చెప్పారు. ఇంకా కొంతమంది మునులు మరుభూమి కవతల వున్న భూమి దేవతల నివాసమని చెప్పారు.

ఇట్లా ఎవరికి తోచినట్టు వాళ్ళు, ఎవరికి తెలిసింది వాళ్ళు దేవలోకం గురించి చెప్పటం మొదలుపెట్టారు. సభలో అంతా గందరగోళం చెలరేగింది. అంతా సందడి సందడిగా వుంది. ఇట్లా వుంటే వాలఖిల్యులనే మునులు, మునులందరినీ వారించి నా వంక చూచారు.

"సూతమునీ! ఈ గందరగోళమంతా దేనికి గాని, నీవు కాయసిద్ధీ - సంకల్పసిద్ధీ - వున్నవాడవు గదా! కాబట్టి నీవు పోయి అసలు సంగతి తెలుసుకొని రా. ఈ వివాదమంతా సమసిపోతుంది.

హిమాలయం దాటితే మానవులు నివసించటానికి వీలుగాని ప్రదేశం వుంటుంది. అక్కడ మంచు విపరీతంగా కురుస్తూ వుంటుంది. ఆ మంచు రాతి ప్రదేశం పోయి, అక్కడ వుండే పంచజనుల్ని కన్నారా చూచి వచ్చి ఈ ఋషులందరికీ తేటతెల్లంగా చెప్పు. సందేహం తీర్చు" అని అన్నారు.

వాలఖిల్య మునీంద్రుల మాటలు విని, వారు నాపై పెట్టిన బరువును తలపై వేసుకొన్నా.

వినీ వినటంతోటే క్షణంలో ఆకాశానికెగిరి ఉత్తరం దిక్కుగా బయలుదేరా, మునులంతా నా వంకే చూస్తూ ఆశ్చర్యపోతున్నారు.

పైకెగిరి కిందకు చూద్దును గదా! భూమి మీద జలజల పారుతున్న నదులన్నీ సన్నగా నల్లటి త్రాచుల్లాగా కనిపించాయి, అంతంత పెద్ద పెద్ద కొండలు పిల్లలాడుకొనే బొమ్మరిండ్లగా నా కళ్ళకు కనిపించాయి. నేల, దాని మీద భౌతిక వస్తుజాలం ఎంత మనోహరంగా వుందో ఏం చెప్పేది? ఆ అనుభూతి వేరు. మాటల్లో చెప్పటం కష్టం.

ఆకుపచ్చని గడ్డి మైదానాలు పచ్చని పట్టుపరుపు పరిచిన ప్రదేశం లాగా ఇంపుగా వుంది. ముఖమల్ తివాచీ పరచినట్లు మనోహరంగా కనిపించింది. వెలి మబ్బు నుంచి జలజలమని రొద చేస్తూ తెలినీటిని తెచ్చే సన్నటి శిఖరాలు అద్భుతంగా వున్నాయి. ఇంకా ముందుకు సాగిపోతూ వుంటే, ఏ కోనలూ కనిపించని రీతిగా రకరకాల ఔషధాలకు పనికివచ్చే వేళ్ళూ - దుంపలూ - నాకళ్ళకు కట్టాయి. పిల్లి కూనల్ని గూడా పెంచజాలిన నీటిని తెచ్చే కొండనాగులు ముందు నిలిచాయి. మరీ ముందుకు పోయా. అంతా మంచుమయం. వెండి పూత పూసినట్లుంది. సూర్యకిరణాలు పడి కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. దేశానికే పెట్టనికోటగా వున్న మంచుకొండ కంటబడ్డది. కళ్ళ నిండా కనిపిస్తున్న దాని శిఖరాలూ - వాటి తళతళలూ చూచా.

ఆ మంచుకొండ వివిధ లతా వృక్ష గుల్మాలచే దట్టంగా వుంది. ఎన్నో క్రూర

జంతువులు దానిలో వాసం వుంటున్నాయి. చూస్తుంటే నిజంగా అది భయంకరంగా కనిపించింది.

దట్టంగా దిట్టంగా మంచు కురుస్తోంది. ఆ మంచు తుంపరల దుమారం కళ్ళను కప్పుతుంది. అప్పుడప్పుడు వడగళ్ళు వచ్చి శరీరానికి తగులుతున్నాయి. వడగళ్ళ దెబ్బ చురుకుచురుక్కుమని తేలు కుట్టినట్టనిపిస్తోంది. అయినా, లెక్కచేయకుండా, ఎంతో సాహసంతో ఆకాశంపై ప్రయాణం చేస్తూనే వున్నా.

కొంతదూరం పోయేసరికి మంచుపర్వత శిఖరం వొకటి నా దారి కడ్డం వచ్చింది. నా గమనాన్ని అడ్డగించింది.

నన్ను ముందుకు సాగనీయకుండా, దారికి కొండ శిఖరం అడ్డం వచ్చేటప్పటికి ఆశ్చర్యం వేసి అటూ ఇటూ దిక్కులు చూస్తూ వుండిపోయా. ఇంతలో ఎంతో సుందరంగా వుండే మందరపర్వతాన్ని కూడా సవాలు చేసే అందమైన పర్వతం ఇంకొకటి కనిపించింది.

ఈ పర్వతాన్ని, దాని శిఖరాన్ని చూచీ చూడడంతోటే దీన్ని గురించి ఎప్పుడో, ఎక్కడో బాగా విన్నట్లుగా అనిపించి ఆలోచించటం మొదలుపెట్టా.

తళుక్కున మెరుపు మెరిసినట్టుగా గుర్తుకు వచ్చింది. ఓహో! ఇది పర్వతం గదా! అని అనుకొన్నా. వెంటనే నేలకు దిగా. నేను దీన్ని గురించి విన్నదీ, చదువుకొన్నదీ గుర్తుకు వచ్చింది. దీని వైభవాన్ని విన్నానే కాని, ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడావకాశం వచ్చి, తదేకంగా కళ్ళార్ప కుండా ఆ గొప్పదనాన్ని చూస్తూ వుండిపోయా.

కదళీచెట్ల గుంపుతో నిండిన గుహలు ఎంతో మనోజ్ఞంగా, సుందరంగా కంటికింపుగా వున్నాయి. మాతులుంగాలు, లుంగాలూ, లవంగాలూ, రకరకాల లతలూ మరెన్నో పొదరిళ్ళూ ఆ పర్వతంపై అల్లిబిల్లిగా అందగించాయి. ఆకాశాన్ని తాకే ఎత్తయిన దాని శిఖరాలు శోభాయమానంగా వున్నాయి, అక్కడే సిద్ధమునులు వేసుకొన్న కుటీరాల వరుసలు కమనీయంగా కనిపించాయి.

మబ్బుల మాటున మాయం కావటం వల్ల సూర్యరశ్మి తగులక పోవటంచే ఆ కొండపై దట్టంగా వున్న మంచు కరగదు. తెల్లని మంచు వెండిలా తళతళ మెరుస్తూ వుంటే, అంతా దాన్ని వెండికొండ అని పిలవటం ఆరంభించారు. మన పురాణాల్లో శివుడు కైలాసపర్వతంపై వుంటాడని అంటారే. అదే యిది. ఇదే శివుడి లోకం కైలాసంగా - వెండి పర్వతంగా పురాణాల్లోకి ఎక్కింది.

ఒకచోట కొండ చరియలో నుంచి మంచు కరిగి కొద్ది కొద్దిగా కారి బయటకు వచ్చి గడ్డ కట్టింది. అది తెల్లని శివలింగం ఆకారంలో వుంది. స్ఫటికంలా మెరిసిపోతుంది. అందుకని దాన్ని చూచిన వాళ్ళంతా స్ఫటికలింగం - అనటం జరుగుతుంది.

ఈ ప్రాంతాల్లో భిల్లజాతి వుంది. భిల్లులు ఆ ప్రాంతమంతా సంచరిస్తూ అక్కడున్న

శివలింగాన్ని పూజించటం ప్రారంభించారు. భిల్లులు పూజించటం వల్ల ఆ శివుడు శాంబరీభిల్లుడైనాడు. ఈ విషయం పురాణాల్లో కూడా చోటు చేసుకొంది.

రామస్వామీ! అక్కడ నుండి కాస్త ముందుకుపోయా. కనుచూపు దూరం పోయేసరికి ఆముటెద్దు కన్ను లాగా తెల్లటి దోవలిలాగా గంగానది కంటబడ్డది. భలే ఆశ్చర్యమేసింది. తెల్లటి మంచు కొండ మీద నుంచి పడడం వల్ల దానిలో నీరు స్వచ్ఛంగా వుంది. ఆ నది అంత ఎత్తు నుంచి ప్రవహించటం వల్ల, దాని ప్రవాహ వేగానికి అరిగిపోయి, అక్కడ రాళ్ళు నున్నగా లింగాకారంగా తయారైనాయి.

దేవతలు, సన్యాసులు, మునులూ ఈ లింగాకారంగా వున్న రాళ్ళను ఎంతో భక్తి శ్రద్ధలతో కొలుస్తారు, వీటినిబట్టే ఈ కొండ శివుడి నివాసమని, దీని మీదే శివుడు నివసిస్తాడని అంటారు. దీని కోసం ఒక కథ కూడా కల్పించబడ్డది. నీవు జాగ్రత్తగా వింటానంటే ఆ కథ కూడా చెపుతా.

మహానుభావా! అన్ని సంగతులు తెలుసుకోవాలనే గదా! మీ దగ్గరకు వచ్చింది. మీరు ఏది చెప్పినా వినటానికి సిద్ధంగానే వున్నా. దయచేసి నాకు ఆ కథ చెప్పండి" అని బాగా సర్దుకుని కూర్చున్నా.

"బిడ్డా! విను, మతి లేని కవులు ఎవరో బతిమిలాడితే చెప్పిన కత యిది. అంతా వివరిస్తా - జాగ్రత్తగా విను.

# గంగావతరణం

సూర్యవంశంలో సగరుడు అనే చక్రవర్తి వున్నాడు. అతడు తన కత్తికి ఎదురులేకుండా రాజ్యం పాలించాడు. శత్రువులకు ఇతనంటే చచ్చే భయం. ఎంతో నిగ్రహం వున్నవాడు, దయగలవాడు, మంచి ప్రవర్తన గలవాడు, పాపం చేయటం తెలియనివాడు.

ఇట్లాంటి రాజు ఒకసారి తన బంధువులు, ఆప్తులు చెప్పగా అశ్వమేధం అనే యాగం చేద్దామని అనుకున్నాడు. బాగా సంపద వున్నవాడాయె. రాజు తలచుకుంటే దెబ్బలకేం కొదువ! తనకేం తక్కువ! అన్ని హంగులూ వున్నాయి, అశ్వమేధ యాగం చేస్తే పుణ్యం వస్తుందని చెప్పారు వాళ్ళూ వీళ్ళూ -

వెంటనే తన పురోహితులను పిలిపించి, మంచి ముహూర్తం ఒకటి పెట్టించి, యాగం చేయటానికి పనికివచ్చే గుర్రాన్ని చూచి శత్రు రాజ్యాలలో తిరగటానికి వదిలిపెట్టాడు. ఆ యాగాశ్వాన్ని రక్షించటానికి ధైర్యస్థైర్యాలు గల భటుల్ని పంపాడు.

అట్లా వదిలిపెట్టబడిన గుర్రం ఎదురులేకుండా తిరుగుతూ వుంది. తన గిట్టల తాకిడికి లేచిన ధూళి భూమ్యాకాశాల నడుమ భాగాన్ని ఆవరించగా ఒకనాడు అది తన గమన విశేషాలను చూపుతూ ఆకాశంలోకి పోయింది. అశ్వం పోయిన దిక్కుగా పాలకులు

కొంతమేర భూమిపై పరుగు తీశారు కానీ, కొంతసేపటికి దాని జాడే కనిపించలేదు, చూచి చూచి విసిగి వేసారిన అశ్వ రక్షకులు చేసేది లేక సగర మహారాజు దగ్గరకు తిరిగి వచ్చి జరిగిన సంగతులు చెప్పారు.

యాగాశ్వం అట్టా కనిపించకుండా అదృశ్యం అయిందన్న వార్త విన్న సగరుడు కూడా ఆశ్చర్యపడి తన అరవై వేలమంది కొడుకుల్ని పిలిపించి "పుత్రులారా! మన యాగాశ్వాన్ని ఎవరో దొంగిలించినట్టున్నది. అవి స్వర్గంలో వున్నా తప్పకుండా తీసుకురండి. ఒకవేళ మదగర్వంతో శత్రువులే ఎవరైనా పట్టుకొన్నచో, వాళ్ళ కుత్తుకలు కత్తికి బలి యిచ్చి ఆశ్వాన్ని విడిపించుకొనిరండి. సూర్యవంశపు పరువు ప్రతిష్ఠ మీ చేతుల్లో వుంది!" అని చెప్పి పంపాడు.

మంచి ఉత్సాహంతో, ఉద్వేగంతో, ఆర్భాటంతో సగర పుత్రులు అరవై వేలమంది యాగాశ్వాన్ని వెతకటానికి బయలుదేరారు కాని, వాళ్ళల్లో ఏ మాత్రం ఓర్పు లేదు.

సముద్ర పర్యంతం వున్న భూమిని వెదికారు కాని యాగాశ్వం కనిపించలేదు. ఎక్కడ వెతికినా గుర్రం కనిపించకపోయేటప్పటికి అందరి మొఖాలూ వెలవెలపోయాయి. ఏమీ తోచని స్థితిలో వున్నారు. తమకెంతో అవమానం జరుగుతున్నట్లుగా భావించి, అంతా ఒకచోట కూలబడ్డారు. తమలో తాము తర్జనభర్జనలు చేసుకొన్నారు.

ఇంతలో ఆరవై వేల మంది సగర పుత్రుల్లో ఒకరు ఎంతో తెలివిని ప్రదర్శిస్తున్నట్టుగా తక్కిన సోదరులతో-

"సోదరులారా' యాగాశ్వం కోసం ఈ భూమినంతా వెతికాం, కొండలు ఎక్కాం, కోనలు చూచాం, గూడేలు, పల్లెలు, పట్టణాలు, ఒకటేమిటి, బెత్తెడు చోటు కూడా విడువకుండా వెతికాం. చీమలు దూరని చిట్టడవులు, కాకులు దూరని కారడవులు గాలించాం. మనం దీని కోసం తిరగని ప్రదేశం అణువైనా లేదు. అయినా గుర్రం మనకు కనిపించలేదు. అశ్వం జాడ తెలుసుకోకుండా నరపాలుని దగ్గరకు పోలేము. తండ్రికి మన మొగాలు చూపలేము. అయితే నేనొక మాట చెపుతా వినండి.

మన యజ్ఞతురంగం చాలా తెలివిగలది, ఈ నేల మీద ఎక్కడ వున్నా తన్ను నలుగురు చేరి యాగం చేస్తారని భావించి అది పాతాళలోకంలో దాక్కొన్నదేమో? నా బుద్ధికి ఇదే నిజమని తోస్తుంది. అశ్వం లేకుండా యాగం పూర్తిగాదు. యజ్ఞం నెరవేరకపోతే, తండ్రి మనల్ని మన్నించడు. అంతేగాదు, ఇంతవరకెన్నడు చరిత్రలో జరగని అవమానం సూర్యవంశానికి సంభవిస్తుంది. ఇది ఈ వంశ చరిత్రలో మాయని మచ్చగా నిలిచిపోతుంది.

కాబట్టి బాగా ఆలోచించండి. ఎట్లాగైనా భూమిని త్రవ్వి పాతాళంలో వెతకాలి. అడ్డం వచ్చిన శత్రురాజులను తునాతునకలు చేయాలి. యాగాశ్వాన్ని ఎలాగైనా మన

తండ్రికి అప్పగించాలి" అని అన్నాడు.

సగర పుత్రులు తక్కిన వాళ్ళంతా తమ సోదరుడి మాట విన్నారు.

అంతా అవునంటే అవుననుకుని, వెంటనే ఆలస్యం చేయకుండా కావలసిన పరికరాల్ని తెచ్చి భూమిని త్రవ్వడం మొదలుపెట్టారు. తమ తమ శక్తినంతా ధారపోసి రాత్రింబవళ్ళు నేలనంతా తవ్వాలని నిర్ణయించుకున్నారు. నేలను త్రవ్వి యజ్ఞాశ్వాన్ని భూపతి చంద్రుడికి అప్పచెప్పాలని వాళ్ళ నిర్ణయం. తదేకంగా పనిచేయటం ప్రారంభించారు.

ఎట్లాగైతేనేం భూమిని తవ్వారు. రాతిలో గనక కప్ప వున్నట్టుగా భూమి లోపల ఒక మూల సగరుడి యాగాశ్వం కనిపించింది. గుర్రమే కాదు, దానితోపాటు తపస్సు చేసుకుంటున్న కపిలుడనే ముని కూడా ఆ ప్రక్కనే కనిపించాడు. ఈ దృశ్యాన్ని చూచి సగర పుత్రులంతా ముక్కు మీద వేలేసుకొని బాపురే! అని ఆశ్చర్యపోయారు.

అప్పుడు రాజకుమారులు మదగర్వంతో.

"వీడు మనల్ని మోసగించి, యాగాశ్వాన్ని దొంగిలించి ఏమీ ఎరగనట్టుగా ముక్కు మూసుకుని తపము జపము అనే వంకతో ఇక్కడకు వచ్చి కూచున్నాడు" అని ఆ కపిలమునిని గేలి చేయటం మొదలుపెట్టారు.

తపస్సు చేసుకుంటున్న కపిలముని సగర కుమారుల ఎకసక్కేలు విన్నాడు. తపస్సు నుంచి లేచి, రోషంతో ఎరుపెక్కిన కళ్ళతో ఒక చూపు చూశాడు. ఇంకేముంది? సగరకుమారులంతా ఆ కపిలుడి కంటి మంటలో బడి కాలి బూడిదయ్యారు. ఈ సంగతి వేగుల వాళ్ళ వల్ల సగరుడికి తెలిసింది. విచారించాడు. కొంతసేపటిలో మనస్సు యథాస్థితికి వచ్చింది.

మంచి గుణాలకు పేరు పొందినవాడు, దీక్షాదక్షతలు కలవాడు, ఉన్నతుడు అయిన తన మనుమడు అంశుమంతుడ్ని పిలిచి, జరిగిన సంగతంతా వివరించాడు. ఎట్లాగైనా సరే యాగాశ్వాన్ని తీసుకురావలసిందిగా చెప్పి పాతాళలోకానికి పంపాడు.

మతిమంతుడైన అంశుమంతుడు తాత సగరుడు చెప్పిన మాటలు విని పాతాళానికి బయలుదేరాడు. కపటం ఎరగనివాడూ, సత్య స్వభావం గలవాడూ అయిన అంశుమంతుడు ఏ మాత్రం తొట్రుపాటు పడకుండా కపిల మహాముని వద్దకు చేరి వినయంగా తలవంచి నమస్కరించాడు.

అంశుమంతుడి వినయానికి ముగ్ధుడై కపిలుడు,

"పుత్రా! సాధువుల్ని ఎగతాళి చేయడం వల్ల నీ తండ్రులేమైరో చూశావా! అదిగో చూడు, ఆ బూడిద రాసులన్నీ మీ తండ్రులవే. నీవు వివేకం గలవాడివి, వినయం గలవాడివి కావటం వల్ల మెచ్చుకొన్నా. అందులో మమ్మల్ని బతిమలాడటానికి వచ్చావు. కాబట్టి ఇదిగో మీ యజ్ఞాశ్వాన్ని తీసుకొని నగరానికి పోయి మీ నరపాలుడికి ఇయ్యి.

బూడిద రాసులైన మీ తండ్రులకు సద్గతులు కల్పించాలని నీవు భావిస్తే, ఆకాశగంగను కొని తెచ్చి ఈ బూడిద రాసులపై పారించు" అని చెప్పి పంపాడు.

అంశుమంతుడు కపిలుడి ఆజ్ఞ ప్రకారం యజ్ఞాశ్వాన్ని తీసుకుని వచ్చి తాతకు సమర్పించాడు. సగరుడు వచ్చిన యాగాశ్వంతో తన యజ్ఞాన్ని పూర్తి చేసుకుని కాలక్రమంలో పుణ్యలోకానికి వెళ్ళాడు.

తాత మరణించిన తరువాత అంశుమంతుడు రాజ్యమందలి ప్రజల మనోభీష్టం, ప్రకారంగా సింహాసనం ఎక్కాడు కాని, తన తండ్రులు దుర్గతి పాలైనందుకు విచారించటం మొదలుపెట్టాడు.

ఎంతో గొప్ప గుణాలు గలవాడు, గొప్ప కీర్తి గలవాడు అయిన అంశుమంతుడు తన తండ్రులకు సద్గతి కల్పించటానికి గంగను భూలోకానికి తేవాలనే యత్నంలో శివుని గూర్చి భయంకరమైన తపం చేశాడు. కాని, కార్యం నెరవేరకముందే అంశుమంతుడు మరణించాడు.

అంశుమంతుడి తరువాత అతని కొడుకు భగీరథుడనేవాడు నిష్ఠాగరిష్ఠుడై గంగాశివులను మెప్పించటానికి ఉగ్ర తపస్సు చేశాడు. కాలి బొటనవ్రేలుపై నిల్చుండి గాలి మాత్రమే తింటూ భయంకరమైన తపస్సు చేశాడు. భగీరథుని ఘోరతపస్సుకు మెచ్చుకుని గంగాశివులు ప్రత్యక్షమయ్యారు.

ఆకాశం నుంచి వెడలిన గంగ హోరుమని కడలొత్తి మ్రోగుతూ మిడిసిపాటుతో పరుగులు తీయడం మొదలుపెట్టింది. వివిధ రకాల సుడులతో నురగలు గ్రక్కుతూ జలజలా జారుతూ వచ్చి శివ జటాజూటంలో దూకింది.

అక్కడ నుంచి బ్రహ్మావర్త దేశం ప్రవేశించి, భగీరథ నరపాలుడు దారి చూప, అతని వెంట క్రేళ్ళురుకుతూ పారి వివిధ ప్రాంతాలు - దేశాలు దాటి సగర కుమారులు తవ్విన బొరియల గుండా ప్రవహించి, పాతాళానికి పోయి, నేరుగా సగరకుమారుల బూడిదరాసులపై పారింది.

ఆ విధంగా దుర్మార్గులైన సగరతనూభవులకు సద్గతి కల్పించిందని అంటారు.

దీనివల్ల గంగానదికి మందాకిని, భగీరథి - అనే పేర్లు ప్రపంచంలో వ్యాప్తి చెంది, గంగ పతితపావనిగా ప్రసిద్ధి పొందిందని కూడా చెపుతారు.

సగర పుత్రులు భూమండలమంతా తవ్వి ఏడు గుంటలు చేశారని గంగనీటితో ఆ ఏడు గుంటల్ని నింపారట. అవే ఏడు సముద్రాలు - అంటే సప్తసముద్రాలు.

ఔరా! సగర చక్రవర్తికి ముందు ఈ జగత్తులో సముద్రాలే లేవా?

సప్త సముద్రాలు సామాన్యమైనవా? ఎంతో విశాలమయినవి, అంతులేనివి, అంతా - ఇంతా అని చెప్పరాని లోతు గలవి. ఇట్లాంటి సముద్రాలను కేవలం ఒక్క నది నీటితో

నింపటం సాధ్యమా? ఈ సందేహం చాలా మందికి వస్తుంది కాని, రాత్రింబవళ్ళూ నీటితో నింపితే నిండవా?

అంతెందుకు?

గంగానది భగీరథుని వెంటబడి వచ్చేటప్పుడు 'జహ్నుడు' అనే ముని, తన యాగానికి విఘ్నం కలిగించిందనే కోపంతో మొత్తం నదిని పుక్కిటబట్టి తాగాడు. దాన్ని తిరిగి చెవి ద్వారా విడిచిపెట్టాడు. అందుకే గంగకు జాహ్నవి అనే పేరు వచ్చిందట! దానినేమందాం?

పుత్రా! రామస్వామీ! ఆకాశంలో నుంచి గంగ శివుడి జటాజూటంలోకి దూకిందని చెప్పే మాట అబద్ధం.

భీకరమైన తపస్సు చేసి భగీరథుడు శివుణ్ణి మెప్పించి, గంగను భూలోకానికి తెచ్చాడని వచించే పలుకు పచ్చి బూటకం.

సగర కుమారులు తవ్విన గుంటలు గంగానది నీటితో నింపబడ్డాయని రాసిన రాతలు అన్నీ హుళక్కి.

భూలోకంలోకి వచ్చిన గంగ పాతాళానికి పోయి, సగర కుమారుల బూడిద రాసులపై ప్రవహించి, వాళ్ళకు పుణ్యగతులు కలిగించినదని ఉగ్గడించటం వెర్రిమాట.

ఈ పుక్కిటి గాథలన్నీ టక్కులు నేర్చిన కవుల గంటాల నుండి వెలువడ్డ కల్పితాలు. ప్రాచీన కవులు గదా! వీళ్ళను కాదనటం కూడా కష్టమే.

అయితే, గంగానది మూలం తెలుసుకోవాలని వుబలాటంతో సగరుడి మనుమడు అంశుమంతుడు బయలుదేరి, తిరిగి తిరిగి దాని సంగతి తెలుసుకోలేక ఇంతలో ముసలివాడై మరణించి వుంటాడు.

ఆ తరువాత అతని కొడుకు భగీరథుడు ఆమూలాగ్రంగా తెలుసుకొని అనంతమైన కీర్తి సంపాదించాడు. ఇతని వల్లనే గంగకు 'భాగీరథి' అనే పేరు ప్రసిద్ధిలోకి వచ్చి వుంటుంది.

వినేవాళ్ళుంటే, కథలు చెప్పేవాళ్ళు చాలామంది వున్నారు. విన్న తరువాత, వాటిల్లో వాస్తవమెంతో నిగ్గు దేల్చి నిర్ణయించుకోవటం అవసరం.

వత్సా! కైలాస పర్వతంముందున్న గండశిలల్ని శివలింగాలుగా చెప్పటం, అక్కడే చుట్టుపట్ల అల్లిబిల్లిగా అల్లుకున్న లతల్ని అర్ధచంద్రాకారంగల జటాజూటం – అక్కడ బడ్డ నీటిధార భగీరథుని వెంట వచ్చే గంగగా వూహించి చెప్పటం, అంతా ఎంతో నమ్మకం కలిగేట్టుగా చిలువలు పలవలుగా చేసి చెప్పటం, ప్రాచీనకవుల పని.

ఎన్నో చిత్ర విచిత్ర కథలను నాటి కవులు రాశారు. ఇది స్వార్థమందామా? పరమార్థమందామా? ఏమో? ఇదంతా ఆ భగవంతుడికే తెలియాలి.

ఆ తరువాత ప్రకృతి శిల్ప కళా నైపుణ్యానికి ఆశ్చర్యపడి, హిమాలయ పర్వత

శిఖరాల సమ ప్రదేశం నుంచి క్రిందకి చూచా.

అబ్బా! ఇంకేముంది? ఆకాశం మీద వున్నట్టుగా కనిపించి విస్మయ పడి గంగలో మునిగా.

ఎత్తుగా వున్న హిమాలయ పరిసర ప్రాంతాలు తిరిగి - తిరిగి, వాటిని దాటి, మరుభూముల్ని చూచి, సుడిగాలి పెనవేస్తూ వుండగా వెనక్కు మరలాను.

ఆ మరుభూమి ప్రాంతమంతా, దట్టంగా మంచుతో కప్పబడ్డది. సూర్యకిరణాలు ఆ మంచుపై ఏటవాలుగా బడి, కళ్ళు మిరుమిట్లు గొలిపేట్టు తళతళమని ప్రకాశించి ఆకాశం వైపు చెదరిపోతున్నాయి.

ఎంతో అరుదైన గుట్టల్నీ - మిట్టల్నీ - చూస్తూ పోయి పోయి ఉత్తర కురు భూముల్ని దాటి దూరాన వున్న త్రివిష్టపాన్ని యెంతో సంబరపడుతూ చూచా.

అక్కడున్న అందమైన పచ్చిక బీళ్ళనూ, దొడ్లనూ వరుసగా చూచి, భ్రమాకులుణ్ణై అట్టే నిలబడిపోయా.

అట్లాగే చూస్తూ ముందుకు సాగిపోతున్నా. అంతలో ఓ సరస్సు నా దృష్టికి అడ్డం వచ్చింది. ఓహో! ఇదే గదా! నేను పురాణాల్లో చదువుకొన్న మానస సరోవరము అనుకొన్నా. ఆ సరస్సులోని అలలు ఉవ్వెత్తున లేచి తపతపమని ఒడ్డును కొట్టుకొంటూ ఉండగా రాజహంసలు రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయాయి. నేను చదివిన కావ్యాలలోని రాజహంసల వర్ణన గుర్తుకు వచ్చింది.

ఆ మానస సరోవరంలో తామరతూడులున్నాయి. ఆ తూండ్లు బంగారు పూత పూసినట్లు కాంతులీనుతున్నాయి. సువాసన గుబాళిస్తుంది. ఆ సరోవరంలోని రంగు రంగుల పక్షుల కిలకిలారావాలు నన్నెంతో ముగ్ధుణ్ణి చేశాయి. ఇదంతా చూస్తూ అంతులేని అనుభూతి పొందా. అమితమైన రసానుభూతిననుభవించా.

రామస్వామీ! దూరాభారం ఎందుకు వచ్చానా! అని మాత్రం తలంచ లేదు. ఎట్లాగైనా త్రివిష్టపాన్ని, అంటే స్వర్గాన్ని చూడాలనే తపన నన్ను పురిగొల్పడంతో పట్టుదల వహించి, ఇదిగో! అదిగో అని పోయి, సూర్యుడి పొడ గూడా కానరాని ప్రదేశానికి వెళ్ళా! ఎన్నో ప్రాంత భూముల్ని దాటి, మరెన్నో ఆమడలు నడచి ఒకచోట నిలిచా.

అక్కడ దూది పింజల్లా మంచు పట్టపగలే పైనుండి పడుతూ వుండి పూలగుత్తులని భ్రాంతి కలిగేట్టున్నా ఆ మంచుగడ్డలు కసిదీరేట్టు ఠపీమని మీద పడుతున్నాయి.

మిట్టమధ్యాహ్నమే అడా మగా జంటలు జంటలుగా రెచ్చిపోయి, చాటుమాటు గూడా చూచుకోకుండా చెట్ల చుట్టూ చేరు తున్నారు. ఇంకో విశేషమేమిటంటే... కన్నుమూసి కన్ను తెరిచే లోపలే, ఆడా మగా జంటలు అట్టే మారిపోయి, ఒకళ్ళు ఇంకొకళ్ళతో కలిసి జతకూడుతున్నారు.

అబ్బో! చలి భరించరానంతగా వుంది. చేతి వేళ్ళూ - కాలి వేళ్ళూ కొంకరలు పోతున్నాయి. ఈ దేశం చాలా వింతగా వుంది. ఇక్కడ ఎట్లా వేగాలా అని నా మనస్సు చాలా ఆందోళన పడ్డది.

పారుతూ వుండే సెలయేళ్ళ నీటి తుంపరులు పైన బడుతున్నాయి. చెట్ల పూగుత్తుల నుండి సుగంధం గుబాళిస్తోంది. ఈ సమయంలో దేవతల ఆచారాలన్నిటినీ చూడాలని భావించి, యెదురు చూస్తూ నిలుచున్నా.

# త్రివిష్టప సందర్శనం

ఎదురుగా సేవకులు ప్రక్కల నడుస్తూ, అడ్డంకి తొలగిస్తూ వుండగా, పుప్పొడి విరజిమ్మిన పేశలమైన రాచబాటనే ఒక ఒయ్యారి భామ - పద్మముఖి విలాసంగా నడుస్తూ రావటం చూచా. ఆమె ఠీవికి బిత్తరపోయి అక్కడే వున్న అంతఃపుర కాపలావాళ్ళను - 'ఎవరీమె?' అని అడిగా.

అందంలో పేరుమోసిన ఈ దేవ వేశ్య - 'ఊర్వశి' అని అతడు సమాధానం చెప్పాడు. అంతేగాదు.

"ఈమె నెరజాణ. ఇక్కడ ఈ కాంతకు ఎదురు లేనేలేదు. అట్లాంటి వన్నెలాడి. ఈమె కోర్కెను ఎవడు తిరస్కరించినా, అతడు ఫలితం అనుభవించవలసిందే. ఈమె శాపానికి గురికావలసిందే" అని కూడా చెప్పాడు.

ఊర్వశి పేరు వినగానే నా గుండెలు యదాయదలై దడదడ కొట్టుకోసాగాయి. మునుపే ఈమె ప్రతాపం విన్నా. ఒకప్పుడు దేవతల రాజైన ఇంద్రుడి కొడుకు, అర్జునుడు ఈమె కోర్కె తిరస్కరించినందుకు శాపానికి గురయ్యాడు. అంతటి వీరుణ్ణి కూడా 'నపుంసకుడవు కమ్ము' అని శాపం పెట్టింది. తప్పలేదు. దాని ఫలితమే, అర్జునుడు బృహన్నలగా అజ్ఞాతవాసంలో కాలం గడిపాడు.

అట్లాంటి ఈ కాంత నన్ను పొరపాటున చూస్తే, ఇంకేముంది? ఒంటిగా నన్ను చూచి, ఉక్కిరిబిక్కిరి చేసి చంపదా? అంతేనా...! దేవ వేశ్యల కీల్జడ ఫెడేలున తగిలిందా - దాని దెబ్బకు సొమ్మసిల్లకుండా ఎవ్వడుండగలడు? పంచప్రాణాలలో కనీసం ఒక్క ప్రాణమైనా నిలుస్తుందో నిలవదో?

కామశాస్త్రాన్ని ఆపోసనపట్టి, ఆ విద్యలో ఆరితేరిన ఊర్వశి సయ్యాటలలో బడుగులైన బైరాగులకు ఏమనుభవం వుంటుంది? బైరాగులకీపాట్లు తెలియవు గదా! ఆమెకు వంగి జోహారులు చేయటం మాత్రం ఏ పాటి తెలుసు? అందులో మానవలోక వాసుడనే సంగతి తెలిస్తే, ఆమె మేను పొంగి పులకరించిపోతుందట. అంతులేని మోహ సముద్రంలో మునిగి ఈదులాడుతుందని చెప్పగా విన్నా.

ఇట్లా కొంతసేపు ఊర్వశి గురించి వితర్కించి ఆమె బారి పడడం మంచిది కాదనుకుని యోగమాయా ప్రభావంతో శరీరం కనపడనీయ కుండా వుండి, దేవలోకంలోని వింతలూ - విడ్డూరాలూ పరికించాలని భావించా.

ఆ లోకం చాలా ఎత్తులో వున్నట్లు కనిపిస్తుంది. హిమాలయ పర్వతాల యెత్తైన శిఖరాలనెక్కి చేయి చాపితే, చంద్రబింబం తేలికగానే చేతికి అందేటట్టుంది. అక్కడ నుంచి భరతఖండాన్ని బాగా పరీక్షించి చూస్తే, పాతాళలోకంలా కనిపిస్తుంది.

ఆకాశాన్ని తాకే చెట్ల సందు గొందుల్లో దూరి పిచ్చుక గుంటు దేవరకుందుతుంది. కారు మేఘాల గుంపు కోట కొమ్మల్లో యిరుక్కు పోతుంది. ఆకాశంలో రాచవీధిని తిరిగే విమానాలు అక్కడ ఉత్తుంగ భవనాలు తాకి వెనక్కు గిరుక్కున తిరుగుతాయి. ఆ పట్టణంలోని పరిస్థితులను కళ్ళారా చూస్తే నిజంగా మేఘమండలంలో వున్నట్టు తోస్తుంది.

ఇదంతా చూస్తూ నేను నెమ్మదిగా అడుగులు లెక్కిస్తూ ముందుకు పోయేసరికి వింత వింత దృశ్యాలు కళ్ళకు కట్టినై.

ఆ దేవ లోకంలో స్త్రీలు ప్రేమరసంలో మునిగి దిగంబరలై ఆకాశ గంగలో జలకాలాడుతున్నారు. ఝుమ్మని మోగే తుమ్మెదలతో జూదాలాడుతూ హరిచందనం క్రింద వొరిగే వనితలు కొంతమంది.

చతురోక్తులతో కొండాటకమాడే కోడెగాండ్రకు వాలుచూపులతో గాలం వేసే వొయ్యారి భామలు ఇంకా కొంతమంది వచ్చిన మిండగాండ్రతో గగనగంగ యిసుకపై జంట కట్టి తిరిగే జలజాతేక్షణలు మరికొందరు.

ఇంతలో వొక మచ్చెకంటి రవిక వూడదీసి, కడగంటితో చూచి, ఏ మాత్రం భయం లేకుండానే నదిలోకి దూకి యీత కొడుతూ, కొత్తవాడినన్న భావం కూడా లేకుండా నన్ను జూచి కన్నుగొట్టింది.

ఇంకో వంక పాములు మసకలాడినట్లే, యువతీ యువకులు పెనవేసుకొని బాహ్యా ప్రపంచాన్ని మరచిపోయి రసానందాన్ని అనుభవించడం కళ్ళారా చూచా. అక్కడ ఎక్కడ చూచినా అవే దృశ్యాలు.

ఒక వంక రంగారు బంగారు తామరలు సుగంధాన్ని విరజిమ్ముతున్నాయి. ప్రక్కనే వున్న గంగానది నీటి తుంపరులు పైకి చింది మీద పడగానే, భరించలేని చలి పుట్టింది. భస్మాంగుడనైన నేను ఆ చలికి తట్టుకోలేక దగ్గరే వున్న జింక చర్మాన్ని కప్పుకోక తప్పలేదు.

ఇంతలో మార్గమంతా తుషారాలతో తడిసిన పుప్పొడి బురదమయం కావటం వల్ల జారి పడతానేమోననే భయంతో నెమ్మదిగా అడుగులేస్తున్నా.

ఎదురుగానే ఊర్వశి, ఒక గంధర్వ ప్రియుడి చెట్ట పట్టి, ప్రక్కనే వున్న సురపొన్నగున్న క్రిందకు పోయి మదన క్రీడోత్కంఠతతో పరస్పరం కౌగలించుకొని అమందానందజలధిలో

మునిగి తేలుతూ వుంది. ఇంతలో ఇంద్రుని ఆజ్ఞను మోసుకుని ఒక దేవభటుడు వచ్చి - 'వెంటనే దేవేంద్రుడు నిన్ను తీసుకురమ్మన్నా-'డని చెప్పాడు.

ఆనందానుభూతిలో ఓలలాడుతున్న దేవ వేశ్యామణి ఊర్వశి, యింద్రుడి వార్తకు క్రీడాభంగమైందని కోపంతో గొణుక్కొన్నది.

"మూడు లోకాల్లోనూ విజ్ఞుడైనవాడెవడైనా తపస్సు చేస్తున్నాడని తెలిస్తే యింద్రుడు తల్లడిల్లిపోతాడు. కొంపగూలినట్లుగా నిద్రాహారాలు మాని దిగులుతో కుంగిపోతాడు. అసమర్థతతో పిరికివాడై, ప్రతీకారం చేసే నిబ్బరం లేక మంత్ర తంత్రాల పేరుతో కాళ్ళు వేళ్ళు పట్టుకొని మా బోటి స్త్రీలను బతిమిలాడుతాడు. పట్టుమని పదిరోజులైనా ఈ దుర్మార్గుడు మమ్మల్ని హాయిగా, కుదిచి కూర్చుండనీయడు. తన మాటే చెల్లుతుందని, రాత్రింబవళ్ళు లోకాలన్నీ తిరిగి రమ్మని చెప్పి పంపిస్తాడు.

ఈతడు ఆడు తోబుట్టువులున్నవాడు కాదు. వనితల అగచాట్లను ఆలకించి, ఆదరింపనే ఆదరించడు. స్వర్గంలో వున్న దేవవేశ్యల జీవితమంతా యిట్లా బాధలమయంగానే గడుస్తుంది.

అని కోపించి మంత్రబద్ధ భుజగంలాగా ఆ దేవ వేశ్య చేసేది లేక ఒక్క నిట్టూర్పు విడిచింది.

వదలలేక - వదలలేక తన ప్రియుణ్ణి వదలి, అతని బాహు పంజరం నుండి బయటపడుతూ కంట నీరు పెట్టుకొని పలకలేక వూర్వశీకాంత యింద్రుడి వద్దకు పోయింది.

దేవ లోకంలో ఆటపాటల్లో మునిగి స్వేచ్ఛగా సంచరించే దేవకన్యా సమూహం అడుగడుగునా కనిపించింది. పీకల దాకా మద్యం సేవించి. మైమరచి నేల మీద పొరలాడుతూ, మరులుగొని కూనిరాగాలు తీసే కోడెగాండ్రని చూచి పట్టరాని ఆనందంతో పొంగిపోతారు.

నదికి ఇవతల నున్న మధూకవనంలో నుంచి వచ్చే అగరువాసన నా ముక్కు రంధ్రాలను చేరి వున్మత్తుణ్ణి చేసింది. దీనితో దిగ్భ్రమ చెంది దారి తప్పా.

అందమైన రాచబాట పడి ముందుకు వెళ్తూ వుండగా, అశోక వృక్షాలు చిక్కని పువ్వు తేనెలను మీద పడేటట్లు చిందించి కారుస్తుండగా, దట్టమైన పొదల మాటున దాగిన పూగుత్తులు సుగంధ పరిమళాలను వెదజల్లుతున్నాయి.

చల్లని చెట్ల నీడ అటూ-ఇటూ తిరుగుతూ వుంటే, మార్గమధ్యలో ధవళ వస్త్రాలను దాల్చిన నెరజాణ వొకతె నన్ను చూచి పకపకా నవ్వింది. అక్కడే వున్న పల్లవపాణులు కలకల నవ్వుతూ, ముఖ కాంతులు పరివ్యాప్తం అవుతూ వుండగా, కలకంఠనాదాలతో మనోహరంగా పాడుతూ వుండడం విన్నా.

ఇక నేను రాచబాటను విడిచి, లాభం లేదని ఉప మార్గాల పోతున్నా. ఆ దారి చంద్రకాంతపురాళ్ళతో పొదగబడ్డది. ఆ మార్గాన పోతూ వుంటే నీకేం చెప్పేది రామస్వామీ- దేవలోకంలో కానరాని విడ్డూరాలన్నీ కనిపించాయి.

ఆ వీధిలో ఒకచోట వేదవేదాంగవిదుడైన సోమయాజి వొకడు సాని కొంపదగ్గరకు పోయి తలుపు తట్టుతున్నాడు; యుద్ధభూమిలో మరణించిన యోద్ధ ఇంకొకడు ఆ సాని కొంపలున్న బజారులో అటూ-ఇటూ పచారు చేస్తున్నాడు. యజ్ఞయాగాదు లాచరించిన యోగి మరొకడు ఆ వేశ్యావాటికలో వేశ్యల కోసం వెంపర్లాడుతున్నాడు; భూలోకంలో బాగా నిష్ఠతో తపస్సు చేసిన వేరొక జటిలుడు వేశ్య ప్రక్కలో పడుకొని వున్నాడు.

ఋషి వొక్కడు అక్కడే దారి తెలియక ఇటూ - అటూ తచ్చాటులాడుతున్నాడు.

ఇంతలో వొక వయ్యారి భామ వచ్చి ఠపీమని తగిలి, అతణ్ణి చూచి కన్ను గొట్టింది. ఆ సందులోనే ఇంకో చోట ఆడా మగా జంటలు ఇకఇకలు, పకపకలు పోతూ, కేరింతలు కొడుతూ, సిగ్గూశరం లేకుండా గంతులు వేస్తున్నారు.

ఇట్లా ఆ స్వర్గం ఆ దేవతల రాజధాని అల్లకల్లోలంలా కనిపించింది.

ఇంతేనా...! ఒకచోట ఇంకో గమ్మత్తు జరిగింది.

సోమయాజి వొకడు ఇంకో వీధిన పోతూ కనిపించిన భోగందానితో గుసగుసలు పోతున్నాడు. సోమయాజులతో పాటు అతని భార్య సోమిదమ్మ కూడా ఆ స్వర్గానికి వచ్చింది.

భర్త తన ముందే, పరాయి స్త్రీతో పరాచికాలాడటం - గుస గుసలు పోవటం చూచి బిత్తరపోయి, ముక్కు మీద వేలు వేసుకుంది. భూలోకంలో ఇట్లాంటి పచ్చి బూటకం ఎక్కడ చూడలేదని విస్తుపోయింది. భర్తను అదుపులో పెట్టలేక, తాను చేసేది లేక పక్కనే వున్న పూవు పొదరింటి గుండా కనిపిస్తున్న దొంగదారిన బడిపోయింది.

ఇంకా, ఏం వింతలు కనిపిస్తాయోనని, నా నడకను నెమ్మదిగా సాగిస్తూనే వున్నా. ఎంతోమంది మదిరాక్షులు ఎదురయ్యారు. వాళ్ళ వూర్పుల చేతా - తాగిన మదిరాసవ చేతా నా తల దిమ్మెక్కింది. నా మనస్సు మనస్సులో లేదు. నా పనంతా తారుమారైంది.

ఎక్కడ చూచినా ఆడా మగా గుంపుల సందడే. ఏ దిక్కున చూచినా మద్యం కాలువలు గట్టి ప్రవహిస్తోంది. ఆ గబ్బు భరించలేక వుక్కిరిబిక్కిరైపోయా. ఇక తట్టుకోలేక, ఏం తోచక, ఎటు పోతున్నానో కూడా తెలియక పోయి - పోయి, ఇంద్రుడు కొలువుదీరిన ప్రదేశానికి వెళ్ళా - ఇతరులకు కనిపించను కాబట్టి, ఏ ఆటంకమూ లేక దౌవారికుల్ని గూడా తోసుకొని నిండు సభలోకే వెళ్ళా.

ఆ సభలోకి వెళ్ళి చూద్దును గదా!

నెమలి ఆసనం పై కూర్చున్న దేవేంద్రుడు అచ్చంగా నెమలిలాగానే కనిపించాడు.

ఒక ప్రక్క తుంబురుడు నిలబడి గానం చేస్తున్నాడు. ఇంద్రుడికి రెండువైపులా వింజామరలు పట్టుకొని దేవకాంతలు విసరుతున్నారు.

వత్సా! ఇంద్రుణ్ణి చూచిన తరువాత, అంతకు ముందు నాకున్న సందేహం తెర తొలగినట్టుగా తొలగిపోయింది. ఆ సంగతి నీకు వినిపిస్తా; విను.

ఇంద్రుణ్ణి - 'ప్రాచీనబర్హి' అని పిలుస్తారు. తెలుగులో ఈ పదానికి పాత నెమలి - అని అర్థం. నెమలి ఈకలు, కంటి ఆకారంలో వుంటాయి. వాటినే నెమలి కన్నులు - అని అంటారు.

దేవేంద్రుడికి శరీరం నిండా వేయి కళ్ళు వుంటాయని రాశారు. అందుకే అతణ్ణి - సహస్రాక్షుడు - అని అంటారు. అప్పుడు ఇంద్రుణ్ణి ప్రత్యక్షంగా చూచిన తరువాత, అదంతా కేవలం వదంతిగానే తెలుసుకున్నా.

ప్రాచీనబర్హి- అనే శబ్దానికున్న అర్థాన్ని బట్టి, ఇంద్రునికి వేయి కన్నులున్నాయనీ - ఈతడు, సహస్రాక్షుడనీ - తమాషా కథ కల్పించబడ్డది.

మన పురాణాలను తిరగవేస్తే, ఇట్లా శబ్దార్థాన్ని బట్టి కల్పించిన వింత కథలు కోకొల్లలు. వాటిల్లో కొన్ని నీకు వినిపిస్తా; విన్న తరువాత వీటిల్లో ఎంత సత్యం వుందో నీకే బోధ పడుతుంది. రాముడి తండ్రి దశరథుడు గదా! ఆ దశరథుడు - అనే పదాన్ని బట్టి, అతనికి పది రథాలున్నాయని అంటారు. పది రథాలున్నాయి కాబట్టు రాముడి తండ్రికి, ఆ పేరు వచ్చిందని అంటారు.

అట్లాగే - దశకంఠుడు -అని రావణుణ్ణి అంటారు ఇతనికి పది కంఠాలుంటాయి కాబట్టి, ఆ పేరు వచ్చిందంటారు. రాక్షసుల సేనా నాయకుడు, త్రిశిరుడు అనే వాడున్నాడు. అర్థాన్ని బట్టి, మూడు శిరస్సులుంటాయని చెప్పారు.

ఋశ్యశృంగుడు - అనే ఋషి వున్నాడు. శృంగం అంటే కొమ్ము అని అర్థం. ఈ శబ్దార్థాన్ని బట్టి ఈ ఋషి, మండూకం నుంచి పుట్టాడని చెప్పారు.

మాండూక్యుడు అనే పేరుతో వొక ముని వున్నాడు మండూక మంటే కప్ప. శబ్దార్థాన్ని బట్టి ఈ ఋషి మండూకం నుంచి పుట్టాడని చెప్పారు.

సుప్రసిద్ధుడైన శుక మహర్షి - చిలుకకు పుట్టాడని చెప్పారు; శుకం అంటే - చిలుక.

శౌనకుడు - అనే ముని, కుక్కకు పుట్టాడన్నారు; శునకం - అంటే కుక్క

అశ్వత్థామ - అనే అతడు విలువిద్యలో ఆరితేరినవాడు ద్రోణుడి కొడుకు. అశ్వం - అంటే గుర్రం - అని అర్థం కాబట్టి అశ్వత్థామ, గుర్రానికి పుట్టాడని ప్రచారం చేశారు.

చెప్పుకొంటూ పోతే, పురాణాల్లో - ఇట్లాంటి కథలు కుప్పలు తెప్పలు; ఇవన్నీ కేవలం శబ్దార్థాలను బట్టి కల్పించినవే.

అందుకే, సహస్రాక్షుడు- అనే ఇంద్రుడి పేరు కూడా శబ్దార్థాన్ని బట్టి కల్పించిందే! అతడికి నిజంగా వేయి కళ్ళు లేవు. శరీరం నిండా పొక్కులు మాత్రం కనిపించాయి.

# మను - బృహస్పతుల సంవాదం

ఇంద్రసభలో ఆ సమయంలో యిద్దరు శాస్త్రవేత్తల మధ్య హోరాహోరీగా వాదోపవాదం జరుగుతుంది. వాళ్ళెవరో నాకు తెలియదు. తెలుసుకోవాలనే కుతూహలం పట్టిపీడించసాగింది. ఆగలేక - 'వాళ్ళెవరో' అని అక్కడ వున్న వాళ్ళనడిగా. (ఇక్కడ మళ్లీ అందరికీ కనిపిస్తున్నాడు)

ఆ యిద్దరిలో వొకళ్ళు దేవతల గురువైన, బృహస్పతి అనీ, రెండో వ్యక్తి - హిందూ సాంఘిక ధర్మకర్త - అంటే హిందూ చట్ట నిర్మాత - మనువు - అనీ చెప్పారు.

ఆ రెండు పేర్లు విన్నాక నాలో కుతూహలం మరీ పెరిగింది. ఆ వాదం ఏమిటో? చివరకది ఎట్లా ముగుస్తుందో? తెలుసుకోవాలన్న ఆరాటం ఇబ్బడి ముబ్బడి అయింది.

దేవ గురుడైన బృహస్పతి, మనువుని చూచి- పట్టరాని ఆవేశంతో యిట్లా అన్నాడు.

"ఏమయ్యా! మనూ...! నీవు స్మృతిని రాశావు గదా! ఎందుకు రాశావు? ఊరికే వుండలేక రాసినట్టుంది. లేకపోతే, స్మృతి రాసినందుకు పెద్ద పేరు ప్రతిష్ఠలు వస్తాయని రాశావా? నీ స్మృతి వల్ల వంచితుల్లో ఎంత గందరగోళం ఏర్పడిందో? ఎంత తలవంపులు గలిగాయో? తెలుసా? భారతదేశంలోని ప్రజలు ఎంత దైన్యస్థితిలోకి నెట్టబడ్డారో...! గమనించావా?

ఈ స్వర్గలోకంలో చూడు ... మేం జాతుల్ని బట్టి తరతమ భేదాలను కల్పిస్తూ, స్మృతులను మీలాగా రాయలేదు. జాతిని బట్టి తప్పుకు శిక్ష ఎక్కువ తక్కువలుగా విధించం. జాతిని బట్టి ధర్మాన్ని అంటగట్టం.

ఇక్కడ అంతా సమానం. పక్షపాత బుద్ధితో వ్యవహరించం. నీవు చేసిన పని చాలా తప్పు. నీ భూతదయ, నీవు రాసిన ధర్మశాస్త్రాన్ని బట్టి అర్థమవుతూనే వుందిగా!

ఒకే తప్పు చేసిన వాళ్ళల్లో ఒకళ్ళకు ఒకరకమైన శిక్ష- ఇంకొకళ్ళకు ఇంకొకరకమైన శిక్ష; కులాన్నిబట్టి విధించటం న్యాయమంటావా? ద్విజులు కాని శూద్రులకు - కఠిన శిక్ష విధించడం, అదే తప్పు చేసిన ద్విజులకు - దానికి భిన్నమైన శిక్ష విధించడం భావ్యమా!

ద్విజుల్లో కూడా వైశ్యుడికంటె, క్షత్రియుడికి తక్కువ శిక్ష, క్షత్రియుడికంటే బ్రాహ్మణుడికి మరీ తక్కువ శిక్ష విధించడం ఏపాటి న్యాయం? జాతి మాత్రోపజీవి బ్రాహ్మణునికి ఎంత ఘోరమైన తప్పు చేసినా - నామమాత్రపు శిక్ష విధించడం భావ్యమంటారా?

శూద్రాది ద్విజేతరులు ఏ అవయవంతో తప్పు చేస్తే, ఆ అవయవాన్ని ఖండించటం

శిక్షగా విధించిన నీ ధర్మం ఎట్లాంటిది? భారతఖండంలోని ప్రజలకు ధర్మైక్యం లేదు కదా!

అందులో అందరినీ మ్లేచ్ఛులని శాసించావు, ఆంధ్రుల్ని మ్లేచ్ఛ జాతుల్లో చేర్చటానికి కారణమేమిటో? వీళ్ళను గూర్చిన అనుపానులేమైనా తెలుసా నీకు? ఇంత విపరీతపు రాతలు రాసి, అనంతమైన పాపాన్ని మూటగట్టుకున్నావు. పనికిమాలిన ఈ స్మృతి రాయమని ఎవరు ఏడిచారు?

వాన వంగుళ్ళ కోర్చి, ఆరుగాలం పెళ్ళాం బిడ్డలతో రక్తాన్ని చెమటగా చిందించి శ్రమ చేసి, సంపదను సృష్టించి, అనుభవించండని మీకిచ్చిన శూద్రులకు, నీవు స్మృతి రాసి చేసిన నిర్వాకమేది?

శూద్రుడెవ్వడూ సొంతంగా సంపాదించుకోరాదా? శూద్రుడైన వాడు మీ యెంగిలి కూడు తప్ప ఇంకోటి ఆహారంగా తినరాదా? శ్రమ చేసి కుంచెడు ధాన్యం దాచుకొన్నా. అతని యింటి పైబడి బలత్కారంగా ఆ ధాన్యాన్ని కాజేయాలా? కట్టుకోవటానికి శుభ్రమైన వస్త్రం వుపయోగించరాదా? మీరు తొడిగి పారేసిన చింకి పేలికలా వాళ్ళు ధరించవలసింది?

శూద్రుడన్నవాడెవ్వడూ చదువరాదా? చదువుకొంటే నాలుకలు కోస్తారా? వింటే, చెవుల్లో సీసం - రాగి కరిగించి పోస్తారా? ఇంకా కాదంటే, అట్లాంటి ప్రయత్నం చేసిన శూద్రుల్ని నిట్టనిలువునా, నిండు ప్రాణాలు తీయటానికైనా వెనకాడరా?

మనూ...! ఇదేనా; నీ న్యాయం? ఇదేనా! నీ ధర్మ శాస్త్రపు గొప్పతనం?

పైగా ఏమన్నా అంటే... "ప్రజలకు మేలు చేయటానికే స్మృతిని రాశానంటావా? పై రాతలు గమనిస్తే, నీవు చేసిన మేలేమిటో, దానిలో వుండే బండారం బయటపడడం లేదా?

శూద్రుడికి సంపద చేకూరితే, తక్కిన ప్రపంచమంతా క్షోభ పడుతుందని చెప్పావు, శూద్రుడు మనిషి కాదా? నిజం చెప్పాలంటే, శూద్రుడు నీచుడా? ఈ పనికిమాలిన పిచ్చివాగుడు వాగిన నీవు వీరుడవా? నీకేమాత్రం ధైర్యం వున్నా, మా ఇంద్రుడి సమక్షంలో చెప్పు.

ఏమయ్యా...! ధర్మశాస్త్రకర్తా...! ఒక విషయం అడుగుతా చెప్పు - 'శూద్రుడు దాస్యం చేయవలసిందే' - అని గట్టిగా రాశావే...! ఇదెట్లా రాశావు? ఇట్లా శాసించటానికి గానీ - రాయటానికి గానీ - నీ మనసెట్టా అంగీకరించింది? ఏ మాత్రం మానవత్వం - దయ వున్నా, యిట్లా రాస్తావా?

ఓయీ! మహానుభావా! కసాయివాడికున్న దయలో నూరోవంతైనా నీకు లేదు. నీవు ఋషివెట్లైనావు? స్మృతినెట్లా రాశావు? ధర్మనిర్ణయాన్ని యెట్లా చేశావు?

మాలో కూడా చాలా జాతులున్నాయి. కిన్నరులు - కింపురుషులు, గరుడులు, గంధర్వులు, యక్షులు - మొదలైన జాతులెన్నో మాలో వున్నాయి. కాని, కొన్ని వందల సంవత్సరాల నుంచి మేమంతా యిక్కడే వుంటున్నాం. ఒక్కసారైనా పొరపొచ్చాలు రాలేదు.

ప్రజల్లో ఎక్కువ తక్కువలు సృష్టించి, వాటిని పెంచి పోషించే రాజులూ, వాటిని చట్టపరం చేసే దుర్మార్గులైన పండితులూ వున్న భారతదేశం యావత్తూ మ్లేచ్ఛ రాజ్యమే అవుతుంది.

ప్రజల్ని సమాన దృష్టితో చూస్తూ, రాజ్యంలో ఈతి బాధలు లేకుండా, నీతితో ప్రజల్ని పాలించడం రాజు కర్తవ్యం. అట్లా కాకుండా పక్షపాత బుద్ధితో పాలించే రాజు - రాజు కాదు."

దేవతల గురువు బృహస్పతి మాట్లాడిన సూటిపోటి మాటలకు మనువు ఉలిక్కిపడ్డాడు. ఒక్క క్షణమాగి తెప్పరిల్లుకొని బృహస్పతికిట్లా చెప్పాడు.

"గురువర్యా! నీ వన్నది నిజం. మా బ్రాహ్మణుల్లో కొంతమందికి తెలివి తేటలెక్కువై స్మృతులన్నిటినీ తలక్రిందులు చేయటానికి పూనుకొన్నారు. వాళ్ళే బలవంతం చేసి నాతో ఈ స్మృతినిట్లా రాయించారు. వీళ్ళ మాటలకు మోసపోయి జడుణ్ణై యిట్లా రాశా. ఇది చాలా తొందరపాటు చర్య. ఇట్లాంటి అవివేకమైన కార్యాన్ని చేసినందుకు - నన్ను క్షమించండి

మనువు చెప్పిన మాటలు బృహస్పతి విన్నాడు. ఆ మాటల్లోని ఆంతర్యాన్ని గ్రహించాడు. యథార్థాన్ని అతనికి తెలియజెప్పాలని భావించి,

"ఓ మనూ! నీ కల్లబొల్లి కబుర్లు కట్టిపెట్టు. నీకు దివ్యదృష్టినిస్తా. ఇదిగో! మెల్లగా భారతదేశమంతా వొకసారి చూడు. ఆ దేశంలోని ద్విజేతరులు నిన్ను గూర్చి ఏమనుకొంటున్నారో గూడా విను" అని అన్నాడు.

భారతదేశంలోని సాంఘిక చిత్రపటం నాకు బాగా తెలుసు కాబట్టి, అక్కడి ప్రజల కష్టగాథలు అనుభవంలోనివే కనుక, యింద్ర సభలోని మనువు బృహస్పతుల వాగ్వివాదం నాకు వింతగా అనిపించలేదు.

బృహస్పతి మాట్లాడిన మాటలకు మనువు కిమ్మనకుండా వూరుకోవటం వల్లనూ, అతడు దేబెలాగా చూస్తూ వుండడం వల్లనూ నేను అక్కడ నుండి బయటకు వచ్చా.

వస్తూ వస్తూ మిగిలిన స్వర్గలోకపు విశేషాలు తెలుసుకోవాలని బయలుదేరా.

పుప్పొడి మోసుకుని శుభ్రమైన నీటితో... ప్రవహించే సెలయేరు ఒక్కటి ప్రమదోద్యానవనం నుండి ప్రవహించటం నాకంట బడ్డది,. దాని వొడ్డున కాస్త మార్గాయాసం తీర్చుకొన్నా. ఇంకా ముందుకు సాగి, ఆ కాలువ గట్టునే పోగా పోగా ఒక సుందరోద్యానవనం గోచరమైంది. ఆలోచింపగా అది సుందర నందనవనమని

తెలిసింది.

దట్టంగా పెరిగిన పొదరిండ్లు. ఆ పొదరిండ్లలో పూదేనె గొంతు దాకా తాగి మత్తుగా తిరిగే తుమ్మెదలూ – ఆ తుమ్మెదల ఝుంకారానికి ఉలిక్కిపడి బెదిరిపోయే బిత్తరి దేవతలూ – ఆ కన్యల్ని వెంటాడే విటులూ– అక్కడ అంతా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా కనిపిస్తుంది. అక్కడ అటూ – ఇటూ చూస్తున్నా...

ఆ వుద్యానవనంలో ఒక వంక తెల్ల యేనుగూ – ఇంకో తెల్ల గుఱ్రమూ కనిపించాయి. ఆ వనంలోనే కల్పవృక్షాల నైదింటిని చూచా.

ఇంతలో పొద్దుగూక వచ్చింది. ఇక యెంతో సమయం లేదని నాల్గు దిక్కులూ గబగబా చూచా. చూద్దును గదా...! నా కంటికి విపరీతాలు ఎన్నో కనిపించాయి. నా మనస్సు చెదరిపోయింది. ఏంచేసేది లేక, కొంచెం విశ్రాంతి తీసుకొందామని వొక చెట్టు దగ్గరకు పోయా. అక్కడ గూడా యెవరో వొక వనిత పొంచి వుండి నా దగ్గరకు వచ్చింది. అప్పుడామెను చూచి...

"తరుణీ! ఇక్కడ యింతమంది యువతీయువకులు స్వేచ్ఛగా యిష్టం వచ్చినట్లు, ఒక పద్ధతి లేకుండా భోగ లాలసతో తిరుగుతున్నారు. తాగి తందనాలు తొక్కుతున్నారు. ఇష్టం వచ్చినట్టు చిందులు వేస్తున్నారు. దీనికి కారణమేంటో చెపుతావా?" అని అడిగా.

ఓ మానవా...! స్వేచ్ఛగా సంచరించే మేము సకల దేశాలు తిరుగుతూ మగవాళ్ళతో చరిస్తాం. ఒకవేళ మా గ్రహచారం చాలక సంతానం కలిగితే, ఆ సంతానాన్ని మగవాళ్ళకే అప్పజెప్పి మా దారిన మేం వెళ్ళిపోతాం. స్వర్గంలో వున్న మాకెవరికీ పిల్లల్ని పెంచే అలవాటు గాని, ఆచారంగాని లేదు.

స్వర్గలోకంలో వుండే ఆడవాళ్ళకెవరికీ పెళ్ళిళ్ళుండవు. మేం పెళ్ళి చేసుకోం. అందుకే మరులెత్తి భూలోకంలో తిరుగుతాం. ఇక్కడ మగవాళ్ళుండరు. మా కసలు మగవాళ్ళంటేనే తెలియదు. అంటే అసలు మగజాతి వుండదని కాదు, కాని, మా మగవాళ్ళు , "మేం మొగవాళ్ళం" అని మీలోకంలో లాగా మగటిమి మాపై చూపించరు అని కపటం లేకుండా వున్నది వున్నట్టుగా చెప్పింది.

స్వర్గలోకంలో వుండే, ఈ వెధవ నాగరికతకు నాలో నేనే అసహ్యించుకొన్నా. ఏం తోచక నెమ్మదిగా లేచి, అక్కడనుంచి వొక ప్రక్క వొదిగిపోతున్నా. అట్లా పక్కకు పోతున్న నన్ను చూచి, ఆ దేవకాంత కేరింతలు కొట్టడం మొదలుపెట్టింది. ఏం చేస్తా? నాలో నేనే మధనపడ్డా.

ఈ లోకంలో కల్లుచెట్లకున్న గౌరవం మంచి కలపను, ఇళ్ళను ఇచ్చే విలువైన చెట్లకు లేదు. ఇంద్రుడి ఆస్థానంలో గజ్జె కట్టే స్త్రీలకున్న విలువ, వనితారత్నాలకు లేదు.

ఇక్కడ కూడా ఇళ్ళున్నాయి. కాని పెళ్ళిళ్ళు లేవు, ఆడవారు వున్నారు కాని, ఇల్లాండ్రు

లేరు; ఇది కేవలం భోగ భూమి. మాబోటి యోగులుండే చోటు కాదు,. నేనెక్కడ విశ్రాంతి తీసుకోవాలో తెలియరాలేదు,

ఆకాశగంగా నది ఉండే ప్రదేశంలో మిదుకుదామంటే- అక్కడే కొంటె కన్నెలు మిడిసిపడుతూ ఈతలు గొడుతూ వుంటారు. నందనోద్యానవనంలో సేద తీర్చుకుందామంటే - అది విటకాండ్రు విచ్చలవిడిగా తిరిగేచోటు, అందమైన పూబొదరిళ్ళలో పండుకొందామంటే - అది కాముకీ కాముకులు పెనవేసుకుని పొరలాడే స్థలం; ఒకవేళ పర్వతం మీద విశాల ప్రదేశం చూచి విశ్రమిద్దామనుకొందామా! దేవ వేశ్యలు చొరవతో తైతక్కలాడే ప్రదేశమది.

చూద్దామన్నా ఒక్క జానెడు చోటు కూడా మాబోటి ముని జనం నివసించేందుకు ఇక్కడ కనిపించదు.

ఇట్లాగే అనుకొంటూ కొంతదూరం పోయా- ఒకచోట పరిశుభ్రంగా వున్న పొదరిల్లు కనబడ్డది. జింక చర్మం పరచుకొని పడుకొన్నా. ఎంతసేపటికీ నిద్రపట్టదు. ఆనాడు పొద్దస్తమానం చూచిన వింతలన్నీ కళ్ళకు కట్టినట్టు, ముందు కనిపిస్తున్నట్టుగా అనిపించాయి. కొంత పొద్దుపోయిన తరువాత చివరకు నిద్రపట్టింది.

తెల్లవారుజామునే లేచి ఆకాశగంగలో స్నానం చేసి, దానిపై నుంచి వీచే చల్లని పిల్లగాలికి అలసట తీర్చుకొన్నా.

కక్షపాలలో వున్న బూడిద తీసి పరధ్యానంలో శరీరానికి పూసుకొన్నా. అదేం విచిత్రమో గాని... బూడిత పూత మొత్తం పుప్పొడి పూతగా మారింది. నాకు దిగులేసింది. ఇక్కడ ఒక్క క్షణం కూడా వుండకూడదనుకొన్నా.

స్వర్గం ఏ మాత్రం ముని జనం వుండడానికి వీలుకాని ప్రదేశం. కేవలం, ఇక్కడ విటీవిటులు మాత్రమే వుండాలి. వెంటనే భరత ఖండానికి పోవలసిందేనని నిశ్చయించుకొన్నా. తిరుగు ప్రయాణం చేయటానికి సిద్ధమయ్యా.

ఇంతలో త్రిభువన సంచారియైన దేవఋషి నారదుడు కనుపించాడు. కంటబడ్డ నారదుడికి నమస్కారం చేసి, నేను వచ్చిన కార్యం వినిపించా. నా గోడంతా విన్నాడు దేవముని. కాసేపు, అర్ధనిమీలితనేత్రుడై యోచించి, పిదప నా వంక చూచాడు.

# సూత నారదుల సంవాదం

సూత మహామునీ! చూచావుగా, అదిగో...! అదే ఒక విధంగా స్రవంతి, ఇదిగో, ఇదే దేవలోకం, త్రిదివం అని కూడా అంటారు. వీళ్ళంతా దేవతలు, ఆ కనిపించేదే నందనవనం. స్వర్గమంటే యిదే. పురాణాల్లో వీటినే వర్ణించారు.

దేవతలకు, అనిమిషులు, అస్వేదులు నర్జరులు - త్రిదశులు అనే పేర్లు కూడా

వున్నాయి. వీళ్ళకు కంటిరెప్పలు చాలా కురచగా వుంటాయి. అందుకని రెప్పలార్పటం, ఇతరులకు గభాలున కనపడదు. దీని వల్ల వీళ్ళు రెప్పలు కొట్టరని అనుకొంటారు. అనిమిషులు - అనే పేరు వీళ్ళకు ఇందుమూలానే వచ్చింది. ఎప్పుడూ చలిగా వుండడం వల్ల ఇక్కడి వాతారణం చెమటను పట్టనీయదు. దాని మూలాన వాళ్ళను అస్వేదులు అని అంటారు.

కూటి యెద్దడి మాన్పటం కోసం పడే పాట్లు వీళ్ళకు ముసలి తనాన్ని ప్రక్కకు నెడుతుంది. దీని వల్ల నిర్జరులుగా పేరుపొందారు. బలమైన శరీరం గలవాళ్ళు. వీళ్ళు చచ్చిపోయేదాకా ముసలితనం వాళ్ళ చెంతకే రాదు. బాల్యం - యౌవనం - కౌమారం అనే మూడు దశలే వీళ్ళకు బాగా తెలుసు. కాబట్టే, త్రిదశులు - అనే ప్రసిద్ధి వచ్చింది. మీరు చదువుకొన్న పురాణాల్లోని పేర్లకిదే కారణం.

ఇంతే కాకుండా.. త్రివిష్టపం - అనే శబ్దం యొక్క అర్థాన్ని బట్టి, ఇంద్రుడికి త్రిలోకాధిపతి అనే పేరు వచ్చింది గాని, నిజంగా అతడు భుజబలంతో మూడు లోకాలనూ జయించటం వల్ల వచ్చిన పేరు గాదు."

ఈ మాటలు విన్నాక, నారద మునిని యింకా వివరాలు అడగాలనిపించింది.

"నారద మహర్షీ! భారతీయులకూ - స్వర్గవాసులకూ - చుట్టరికంగానీ, స్నేహంగానీ వుందా? వీళ్ళకీ ... వాళ్ళకీ రాకపోక లున్నాయా? మీరు త్రికాలాల సంగతీ - త్రిలోకాల సంగతీ తెలిసినవారు. మీకు తెలియని విషయాలుండవు,

సుర - అనే శబ్దానికి అర్థం ఏమిటి? ఈ నాకలోకం వాళ్ళంతా సురలు - అని పిలువబడుతున్నారు గదా! వీళ్ళంతా సురలుగా ఎట్లా అయ్యారో చెప్పండి.

ఇక, వీళ్ళ విరోధుల్ని - యాతుధానులు - అసురులు - పుణ్యజనుడు, రాక్షసుడు - అని పిలుస్తారు గదా! వీళ్ళకాపేరు లెట్లా వచ్చాయో గూడా సెలవీయండి.

నాలో రగిలిన సందేహాగ్నిని చల్లార్చుకొందామనే తాపస శ్రేష్ఠుడయిన నారదుణ్ణి అడిగా.

అయితే, నా మాటలకు ఏమీ చిరాకుపడకుండా దేవ ఋషి నారదుడు, తెలివి వారిన మొగంతో నన్ను చూచాడు. ఒక్క చిరునవ్వు నవ్వాడు. మంచి ప్రశ్నలే వేశాననుకొన్నాడో - యేమో? చెప్పటం మొదలుపెట్టాడు.

"సూతా...! భారతదేశానికి - స్వర్గలోకానికి అన్ని రకాల సంబంధాలున్నాయి. ఇంద్రుడు దుర్మార్గుడై బ్రహ్మ హత్య చేసి పదవి నుంచి తొలగిపోతే, దేవతలంతా, 'రాజు లేని రాజ్యం వుండరా'దని అనుకొని, భారతదేశాన్ని పాలించే నహుషుణ్ణి ఇంద్రలోకానికి అధిపతిగా చేసిన సంగతి నీకు తెలుసుగదా. ఇంతేగాదు, ఇంకా చాలా రకాల సంబంధాలున్నాయి,

కుంతిభోజుడి కూతురు. కుంతి- అనే ఆమె పెళ్ళి కాకముందే సూర్యుడి వల్ల లైంగిక సుఖాలనుభవించలేదా? కొడుకును కనలేదా? భర్తతో సంబంధం లేని మాద్రి, కొడుకుల్ని కనాలనే తపనతో, అశ్వనీ దేవతలతో సంపర్కం చేయలేరా? ఒకేసారి, నకుల సహదేవుల్ని కన్నది గదా!

మేనక విశ్వామిత్రుణ్ణి చేరి, శకుంతలను కనలేదా! పుంజికస్థల అనే దేవకాంత, పురూరవ చక్రవర్తి కలసి సుఖాలనుభవిస్తూ పొద్దులు పుచ్చలేదా?

దశరథుడు - ముచికుందుడు- అనే రాజులు దిక్కుమాలిన దేవతలు దేబెరిస్తే వచ్చి సహాయంగా నిలచి శత్రువులతో యుద్ధం చేశారు గదా!

ఇట్లాంటివే బోలెడు చూపవచ్చు. భారతదేశానికి, దేవలోకానికీ అనేకరకాల సంబంధాలున్నాయి.

ఇక, నీవడిగిన శబ్దార్థాలు వివరిస్తా! విను; ఆయా పేర్లు వాళ్ళకి ఎట్లా వచ్చాయో గూడా వీటిని బట్టి తెలుసుకోవచ్చు.

సుర - అంటే సారాయి ఎల్లపుడు ఈ దేవలోకంలోని వాళ్ళు పీకలదాకా సుర తాగి తందనాలాడుతూ వుంటారు. ఈ విషయం నీవు గమనించే వుంటావు. అందుకే దేవలోకంలో వుండే వీళ్ళకు - సురలు అని పేరు వచ్చింది.

ఇక, వీళ్ళ శత్రువులైన వాళ్ళు, ఏనాడూ సారా మొకం ఎరగరు. అందుకే వాళ్ళు అసురులు అయ్యారు.

ఆర్తుల్ని రక్షించి, ఆర్త రక్షాపరాయణులు - అనే పేరు సంపాదించుకున్నారు. కాబట్టే, వీళ్ళకు రాక్షసులు అనే పేరు కూడా వచ్చింది.

వాళ్ళు ఇబ్బందుల్లో వున్నా, ప్రాణుల్ని కాపాడుతారు. అంటే యాతనలు అనుభవిస్తున్న ప్రాణికోటిని రక్షిస్తారు కాబట్టి యాతుధానులు అనే పేరు సార్థకమైంది.

ఇక - పుణ్యజనులు - అనే పేరెందుకు వచ్చిందంటావా? దుర్మార్గులు - ధూర్తులు, దౌర్జన్యకారులూ, హంతకులు - చేస్తున్న అరాచకాలను, అక్రమాలను, దౌర్జన్యాలనూ, హింసనూ ప్రతిఘటించి సమాజానికి మేలు చేస్తారు వాళ్ళు. అందుకే పుణ్యజనులు అనే ప్రసిద్ధ నామం వచ్చింది."

నారదముని మాటలకు తెల్లబోయా. పురాణ కథల్లో రాక్షసుల గూర్చి లేనిపోని, అభూత కల్పనలతో వింత వింత కథలున్నాయి. వింటానికే, అవి భయంకరంగా వుంటాయి.

దేవతలూ - రాక్షసులూ భీకర యుద్ధం చేశారు. విజయం సాధిస్తాననుకొని పోయిన రాక్షసులు, మోసం జరగటం వల్ల వోడిపోయారు.

ఓడిన దానవులకు చిలవలుపలవలు కల్పించి, లేనిపోనివేవో ఇష్టం వచ్చినట్టు సృష్టించి,

రకరకాలుగా కథల్ని అసంబద్ధమైన విషయాలతో నింపి రాశారు.

ఏ విషయాన్నైనా మసి పూసి మారేడుకాయ చేయవచ్చు.

దేవతలు దుర్మార్గులుగా ప్రచారం చేసిన రాక్షసుల్లో గొప్ప గొప్పవాళ్ళు ఎంతోమంది వున్నారు.

జయాపజయాలు సమానంగా చూచిన వృత్రుడు మహా తత్త్వవేత్త. యుద్ధనీతికి కట్టుబడి ప్రాణాలను పోగొట్టుకున్న హిరణ్యాక్షుడు నీతిమంతుడా కాదా!

వామనుడు, కపటి - అని తెలిసి కూడా, అతడడిగన మూడడుగుల నేల దానంలో మొత్తం ధార పోసిన బలి ఎంత దానశీలి? వేదవిజ్ఞాన ఖనియైన విశ్వరూపుడు వేదవేత్త గాడా?

వైతండికులు చెప్పే మాటల్ని ప్రమాణంగా నమ్మటం. నీ బోటి పండితులకు మంచిది గాదు. దేవతలకు ఊడిగం చేసే బృహన్నల వంటి పండితుల పక్షపాతంతో కూడిన పనికిమాలిన రాతల్లో అసత్యాలు కుప్పలు తెప్పలు.

ఆ తరువాత నారదముని దగ్గర సెలవు తీసుకొని, మనోవేగంతో గంగానదిని దాటి, కైలాసాన్ని గడచి, హిమాలయ పర్వతాన్ని అధిగమించి భారతదేశానికి వచ్చా.

నా కోసం ఎదురుచూస్తున్న వాలఖిల్యాది మునులకు విషయమంతా వివరించా.

ఆ పిమ్మట వాళ్ళ వద్ద సెలవు తీసికొని, ఆలస్యం చేయకుండా వెంటనే, నా ఆశ్రమానికి వచ్చి యథాప్రకారం భగవత్కాలక్షేపం చేస్తున్నా. రామస్వామీ! ఇప్పుడు నేను నీకు చెప్పిందంతా, ప్రత్యక్షంగా చూచి, అనుభవించింది. తరువాత కథ చెపుతా విను.

# దేవతల వలస

కాలం బాగా వుంది. పంటలు బాగా పండాయి. బాగా వుందని అనుకొన్న సంవత్సరమే స్వర్గంలో వాళ్ళకు సంవత్సరం పొడుగునా తిండి జరగదు. ఎంత పంట పండినా, పొట్ట కూటికి చాలదు. మహా వస్తే, మూడు నాలుగు నెలలకు సరిపోతుందేమో! ఆ తరువాత అంతా తిండి కోసం మొగం వాచి వుంటారు. చేద్దామన్నా - కూలి నాలి వుండదు.

కాలం అనుకూలించి పంట బాగా పండిందనుకొన్న సంవత్స రమే యిట్లా వుంటుంది. ఇక కరవు వచ్చిందనుకోండి. చెప్పే పనే లేదు. తాగుదామన్నా, గుక్కెడు గంజి నీళ్ళు దొరకవు, తిందామంటే, బొక్కెడు కూడు పట్టుమని దొరకదు. ఇట్లా వుంటుంది స్వర్గంలోని పరిస్థితి. అయితే, ఇట్లాంటి పరిస్థితి గల ఆ లోకంలో ఒక యేడు వేసిన పైరు వేసినట్టే మొలక మీద వుండగానే మిడతలదండు సగం తినేసింది. సంవత్సరం పొడుగునా వాతావరణం అనుకూలించక యెప్పుడూ మంచు కురుస్తూనే వుండడం వల్ల ఆ మిగిలిన

సగం పైరు కూడా అక్కరకు రాకుండా పోయింది.

ముక్కారు పంటలిట్లా నాశనమయ్యాయి. పిడికెడు గింజలు లేవు. గుక్కెడు కలి లేదు. కడుపు కక్కుర్తి తీరే దారే లేదు.

స్వర్గంలోని ప్రజలకు అన్నపానాలన్నీ వట్టిపోయాయి. కరువు కాటకాలు వచ్చేటప్పటికి, ఆ జనానికి కంటి మీద కునుకే లేకుండా పోయింది.

దేవరాజు కొలువు కూటానికి పోయి, కాపులు పడిగాపులున్నారు. అయినా, ఆ రాజు "మీకెందుకు వచ్చారు?" అని కూడా అడగడు. ఎత్తి కోళ్ళకు కనికరం చూపడు. మొత్తుకోళ్ళకు జాలి కనిపించనీయడు. వేడుకోళ్ళకు దయ పుట్టదు.

నిజంగా ఇంతటి మూర్ఖుడు - మొండివాడూ అయిన రాజు బహుశః మూడు లోకాల్లోనూ వుండడు.

ఇట్లాంటి కష్ట సమయంలో ఎంత వేడినా, కనీసం తమ వంక చూడనైనా చూడని రాజును పరకాయించి చూచి, తమపై తమకు రోత పుట్టి మూతి బిగబట్టి - 'ఆదరించని రాజు రాజ్యంలో వుండడం కంటే, పరాయి చోటికి వలస పోవటం మేలు' అని అనుకొన్నారు.

పాటెరుగని దొరను ఆశ్రయించుకొని వుండడం కంటే విడిచిపెట్టడం మంచిదని నిర్ణయించుకొన్నారు.

దేవ జాతుల్లో అయోనిజులైనవాళ్ళు తెగించి, ఇళ్ళూ వాకిళ్ళూ తెగనమ్మేశారు. జన్మభూమినీ - ఎంతో ప్రేమగా చూచుకొనే ఇళ్ళనూ వాకిళ్ళనూ వదిలి పోతున్నందుకు విచారించారు.

తాము భోగభూమిగా భావించి, అదే శాశ్వత నివాసమనుకున్న స్వర్గభూమిని ఇంకోసారి తేరిపార చూచారు.

'తరతరాల నుంచి సురనిస్తూ తృప్తి పరచే చెట్లను ఎట్లా వదలాలి? ఏదో రకంగా మోసగించి, ఆదరించి - బెదరించి తెచ్చుకొనే హవ్య కవ్యాలను ఎట్లా విడిచి పెట్టిపోవాలి? మూడు వందల అరవై రోజులూ రాత్రింబవళ్ళూ, మురిపించి, మైమరపించే వేశ్యామణులను ఎట్లా విడవాలి? సుందర మందయానలతో మందాకినీ నదిలో విహరించే కోర్కెను ఎట్లా విడనాడాలి? నాకలోకంలోని పండువెన్నెల రాత్రులందుండే హాయిని ఎట్లా కోల్పోవాలి? గండుకోయిల పాటలు వినకుండా ఎట్లా వుండాలి?" అని లోలోన పరితపిస్తూ, మాటిమాటికి వెనుకకు తిరిగి చూస్తూ, దీన ముఖాలతో ఇక పోక తప్పదని నిశ్చయించుకొన్నారు మూటా ముల్లె సర్దుకొన్నారు. మోయలేని బరువు నెత్తిన వేసుకొని, తొట్రుపాటు పడుతూ ప్రయాణం సాగించారు. తోటల్నీ - దొడ్లనూ విడచి త్రొక్కిసలాడుతూ అంతా ఏకంగా బయలుదేరారు.

ప్రయాణపు అలసట లేకుండా పాటలు పాడుకుంటూ బాట పట్టారు. నాకలోకం నుంచి కొండలు - కోనలు దాటి, పూటలు, రోజులు గడుపుకొంటూ నడచిపోయారు.

ఆకాశగంగను అతిక్రమించారు. హిమాలయాన్ని గడిచారు. 'ఎక్కడికి పోదామా!' అని ఆలోచించి. చివరకు 'భారత ఖండం పోవటం హాయి' అనుకొని వ్యాపారం కోసం వచ్చిన ఇంగ్లీషు వాళ్ళలాగానే పొట్ట కూటి కోసం వచ్చి చేరారు.

భరత ఖండం ప్రవేశిస్తూ, అక్కడ కూడా ఎక్కడికి పోవాలా? అని ఆలోచించి, గంగా సింధు నదీ ప్రాంతం సస్యశ్యామలమైందని గ్రహించి, అక్కడి సారవంతమైన నేలను పరిశీలించి స్థిరపడాలని నిశ్చయించుకొన్నారు.

ఆ ప్రాంతంలో పెరిగిన వివిధ పుష్ప ఫల భరితాలైన చెట్లు- లతలు వాళ్ళ కళ్ళకు మిరుమిట్లు గొలిపాయి. సురల హృదయాలను ఆ ప్రదేశం ఆకట్టుకొంది.

ఆకలి మంటలతో భారత భూమిలో ప్రవేశించిన సురలు, ఇక్కడకు వచ్చిన తరువాత కొత్త పేరు పెట్టుకొన్నారు. తమ సొంత పేరైన సురలు - అనే పేరు తీసివేసి, 'ఆర్యులు' అని తమ్ము తాము పిలుచుకోసాగారు. ఇక ఆ పేరే మనదేశంలో వాళ్ళకు సుస్థిరమైంది.

నెమ్మది నెమ్మదిగా కాలు కుదుర్చుకొని, ధైర్యం కూడగట్టుకొని జన్మభూమిని విడచివచ్చిన దిగులు మాని కాయకష్టం చేయటానికి పూనుకున్నారు.

సంస్కార సహితంగా వున్న భూమిని వాస యోగ్యంగా మార్చుకొన్నారు. చిదుకు కంపనంతా యేరి వొకచోట పోగుపెట్టి నిప్పు పెట్టారు. దట్టంగా ఏపుగా పెరిగిన చెట్లను గొడ్డళ్ళతో నరికి అడ్డం లేకుండా చేసుకొన్నారు. సూర్యరశ్మి పొర కూడా రానీయకుండా దట్టంగా వున్న పొదల్ని చిలికి శుభ్రం చేసుకొన్నారు. పెద్దవీ - చిన్నవీ - అక్కడక్కడా పడ్డ రాయీ - రప్పా ఏరి గుట్టగా పోసుకున్నారు. గుంటలు-మెట్టల్ని చదును చేసుకొన్నారు.

ఇట్లా బాగు చేసుకొని, నివాసం వుండడానికి అక్కడక్కడా అగ్రహారాలు నిర్మించుకొన్నారు.

మెరక భూమిని నాగళ్ళతో చక్కజేసి, సురజాతి యువకులు విశ్రాంతి తెలియకుండా పల్లెలు కట్టుకొని, నేలను యోగ్యమైనదానిగా చేసుకొన్నారు. చుట్టూ కంపతో కంచె పాతుకొన్నారు.

చిరు తామర కొలనులాగా దినదిన ప్రవర్ధమానమై అంతు లేకుండా సిరి సంపదలతో పెరిగిపోయారు. లోకులకు వాళ్ళను చూస్తే కన్ను గుట్టేట్టు అభివృద్ధి చెందారు.

ఇట్లా తామర తంపరగా పెరిగిపోతున్న సురజాతి ఆ ప్రాంతమంతా విస్తరించడం మొదలుపెట్టింది.

పెద్ద పులులు చెరలాడే ప్రదేశాలు, ఏనుగులు కోరాడే స్థలాలు, పాములు బుసకొడుతూ మసకలాడే చోటులు, సింహాలు గర్జిస్తూ కవ్వించే నేల, వృషభాలు రంపిల్లి రంకె వేసే

భూమి, తోడేళ్ళు తొంగి చూచే ధరణి, కారు దున్నలు గుంపుగూడి గడ్డి మేసే మైదానాలు, నీలమేఘాలు కలిసే చోటు, తిండి కోసం అడవి పందులు వెంపరలాడే స్థలం. అది, ఇది అనే పని లేకుండా ఎంతో వుత్సాహంగా ఊళ్ళూ - పల్లెలూ ఒకటొకటిగా వెలిశాయి.

ఏరోజు కారోజు ఆర్య సంతతి పెరిగిపోతుంది. దీన్ని గమనించిన ఆజాతి పెద్దలు కొన్ని కట్టుబాటులు ఏర్పరచడం మంచిదని భావించారు.

యోగ్యులైన వాళ్ళను పిలిచి, ఆర్యుల్ని మొత్తాన్ని మూడు తరగతులుగా విభజించారు. ఇది అందరి ఆమోదంతోటే జరిగింది. బ్రాహ్మణులు - క్షత్రియులు - వైశ్యులు - అని వాళ్ళకు పేర్లు పెట్టారు. ఈ మూడు వర్గాలవారికి మూడు రకాలైన విధుల్ని అప్పజెప్పి, ఆర్య సమాజాభివృద్ధికి పాటుపడవలసిందిగా తీర్మానించారు.

నిత్య నైమిత్తిక నియమాల ప్రకారం దేవుణ్ణి పూజించవలసిందిగా బ్రాహ్మణ వర్ణాన్ని నిర్దేశించారు. కంపకంచెలు కట్టి పల్లెల్ని కత్తి మొనతో కాపాడే బాధ్యత క్షత్రియులనే వాళ్ళకు కట్టబెట్టారు. వ్యాపారం - పశుపాలన - వ్యవసాయం చేసి ఆర్థిక వనరులు సమకూర్చవలసినదిగా వైశ్య వర్గాన్ని ఆదేశించారు.

ఎవరి విధిని వాళ్ళు నిర్వర్తించటం మొదలుపెట్టారు.

కూటి కోసం తిప్పలు పడవలసిన అవసరం తీరి, సకల సంపదలు పోగు కావటం మొదలయింది. మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతున్న వాళ్ళను చూస్తే, ఇతరులకు ఈర్ష్య కలగటంలో సందేహమేముంది?

పుట్టి పెరుగుతున్న ఆర్య సంతతి కొత్త తరానికి శౌర్యపటిమను నూరిపోస్తుంది. కబుసమూడ్చిన కోడెత్రాచుల్లాగా కులపెద్దలు వాళ్ళను తయారుచేశారు.

మాంత్రికులైన బ్రాహ్మణులు అప్రమత్తతతో తంత్రం నడుపుతూ వుంటే, ఆ బ్రాహ్మణుల తంత్రాన్ని తు.చ. తప్పక పాటిస్తూ క్షత్రియ వర్గం చుట్టుపక్కల ప్రాంతాన్ని కైవశం చేసుకొని తమ అధీనంలోకి తెచ్చుకొంటూ వుంది.

భారతదేశం ఈ రకంగా విదేశీయుల ఆక్రమణ క్రిందకు పోసాగింది. దీన్ని బాగా పరిశీలిస్తున్న స్వదేశీ రాజులు ఆరాటపడుతూ తికమక పడసాగారు.

# ద్రావిడ యోధుల మంతనాలు

రచ్చమాను క్రింద కూర్చుని ద్రావిడ వీరులు తమ భవిష్యత్తూ - దేశ భవిష్యత్తూ - గూర్చి సమాలోచనలు చేయసాగారు. తమలో తాము ఎవరికి తోచినట్లు వాళ్ళు చెప్పటం మొదలుపెట్టారు.

'ఈ వింతలు విన్నామా? ఎప్పుడైనా ఇట్లాంటి కార్యాలు కన్నామా? చేతులు ముడుచుకుని కూచుందామా? వీరులమని ప్రగల్భాలు పలికినంత మాత్రాన సరిపోదు.

బొల్లి మొగాల మీద నిలువు బొట్టు పెట్టుకొని, రాళ్ళకూ - రప్పలకూ చేతులెత్తి మొక్కి, గందరగోళం సృష్టించే ఆకతాయి మూక దౌష్ట్యాన్ని మాన్పటం అవసరం. హెచ్చరిల్లుతున్న వాళ్ళ ఆగడాలకు అడ్డుకట్ట వేయటం మన కనీసధర్మం.

ఈ దేశం మనది కాదా? దేశాన్ని రక్షించుకోవలసిన గురుతర బాధ్యత మన భుజస్కంధాలపైన లేదా? దేశాన్ని నాశనం చేసే విదేశీయుల్ని అంతమొందించటం మన అదృష్టంగా భావించవద్దా.

అవిసె తేనెలు చిందిస్తూ, అమృతోపమానమైన పండ్లను అందించే వివిధ వృక్షాలు గల సుందర భూమి మనది; తమంత తామే క్షీరధారలను కుమ్మరించే పొదుగులు గల ఆలమందలతో విలసిల్లుతూ పాడికి కొదవలేని నేల మనది; సుగంధాన్ని విరజిమ్మే పూదేనెలతో కప్పబడ్డ పొదరిండ్లతో అందమైన ధరణి మనది; నాగేటి కర్రు తగలకుండా, పదును కాగానే ధాన్యపు సిరులొలకబోయు కండగల సుక్షేత్రం మనది.

ఇంతకాలం ఈ నేల మనల్ని పోషించింది, నేడిది పరుల పాలు కావటం కళ్ళారా చూస్తున్నాం. ఈ మాతృభూమిని రక్షించుకోవలసిన బాధ్యత మనందరిది. దీన్ని మనం మరువగలమా!

దుర్మార్గులు రెచ్చిపోయి, ఈ విధంగా పనులు చేస్తుంటే చూస్తూ వూరుకొంటామా? ఆబాల గోపాలం అదరి- బెదరి గగ్గోలు పెడుతున్నారు. క్రమక్రమంగా దేశాన్ని ఆక్రమిస్తూంది విదేశీ మూక. ఇంత జరుగుతున్నా వూరుకోవటం మనబోటివాళ్ళకు ధర్మం గాదు. పైగా రాజులు చేయవలసిన కార్యం గూడా గాదు.

ఇప్పుడే మనమంతా చప్పుడు కాకుండా పోయి, శత్రుసైన్యం మీద కుప్పించి దూకాలి. వాళ్ళను సర్వనాశనం చేయుట తప్పనిపని. ఇంత కంటే వేరే ధర్మం లేదు.

బాణాలు అమ్ముల పొది నుండి తమంతతామే బయటకు దూసుకువస్తున్నాయి. ఒరలో నుండి పదును గల చురకత్తులు అప్రయత్నంగా దూకుతున్నాయి. భూన భోంతరాలు దద్దరిల్లేటట్లు సింగినాదం చేస్తూ, యుద్ధభేరి మోగించారు.

ఏ మాత్రం వెనుకంజ వేయకుండా, ప్రాణాలొడ్డియైనా సరే మాతృభూమిని రక్షించుకోవాలి. పీనుగు పెంటలు కానీకుండా, శత్రువులకు భూమిని దక్కనీయం."

ఇట్లా ద్రవిడ మన్నీలు తమలో తాము పలికారు.

ఈ మాటలు విని సైనికులంతా అదిరిపడ్డారు. కోలాహలం చేయసాగారు. "శత్రుసంహారం కావించటమో! రణరంగంలో ప్రాణాలు వదలటమో" తేలాలని అక్కడ కూడిన యోధులంతా పంతం పట్టారు.

తరువాత అందరూ తమ తమ నివాసాలకు పోయారు. ఎంతో ఉత్సాహంతో యుద్ధానికి సన్నద్ధులయ్యారు.

ఆర్యులపై కోపం మండిపోతుంది. 'శత్రు సంహారం ఎప్పుడా, ఎప్పుడా!' అని ఉరకలు వేస్తున్నారు. వాడిగల ఈటెలు - కత్తులు - కటారులు - విల్లమ్ములు మొదలైన ఆయుధాలు ధరించారు. సింహనాదాలు చేస్తూ అంతా గుంపులు గుంపులుగా యుద్ధభూమికి బయలుదేరారు.

వింటి కోపు మీద వీర రక్తం చల్లారు! పలుక వాలులకు బలులు సమర్పించారు. మూగ దేవతలకు మొక్కుబడులు చెల్లించారు. యుద్ధానికి సన్నద్ధమైపోయారు.

ఆర్యులకు ద్రవిడ యోధుల వృత్తాంతమంతా తెలిసింది. వాళ్ళు కూడా బల గర్వంతో ఆయుధ సన్నద్ధులై యుద్ధం చేయ నిశ్చయించుకొని కదన భూమికి తరలివచ్చారు.

రెండు రకాల వాళ్ళకూ యుద్ధం మొదలైంది. ఇరువురూ - 'ఏమాత్రం తగ్గకుండా, ఒకళ్ళ కొకళ్ళు తీసి పోకుండా అనేక రకాలుగా సమరం సాగిస్తున్నారు. యుద్ధభూమిలో చూపవలసిన మెలకువలన్నీ చూపిస్తున్నారు. రహస్యంగా వాడవలసిన తమ తమ ఆయుధాలను సర్వం ప్రయోగిస్తున్నారు. పిరికితనమంటే ఏమిటో తెలియకుండా భీకరంగా పోరు సాగిస్తున్నారు.

ఇట్లా యేండ్లూ పూండ్లూ పట్టింది. విజయం ఎవరినీ వరించలేదు.

ఎడతెరిపి లేకుండా యుద్ధం చేయటం వల్ల గాయపడ్డ శరీరాలతో సైనికులు కొంత తడవు కాందిశీకులై, మరల వచ్చి భయంకర కదనం చేయటం జరుగుతుంది. ఇట్లా వెరపు లేక తండోపతండాలుగా ప్రాణాలపై ఆశ వదలి పోరు చేస్తున్న ద్రావిడ యోధులలో రవంత మెతకదనం యేర్పడి, కొద్దిమంది వీరులు వెన్నుచూపారు.

పారిన ద్రావిడ వీరుల్ని ఆర్య సైన్యం తరమటం మొదలు పెట్టింది. కాలి సత్తువ కొద్దీ ద్రావిడులు దక్షిణదిశగా అడవుల వెంటబడి, చెట్టుకొకరూ - పుట్టకొకరుగా చెల్లాచెదురై పారిపోయారు.

ద్రావిడుల్ని ఘోర విషాద దుఃఖాలు కమ్మినై. యుద్ధం ఆపివేశారు. వింధ్య పర్వతం దాటి దక్షిణాల వున్న జీబురుటడవిలోకి ప్రవేశించి తల దాచుకో నిశ్చయించుకొన్నారు. దొంగదారుల్లో చీకటి సమయాల్లో చాటుగా మాటుగా పరుగులు తీశారు.

ఎవరూ చూడరాని, ప్రవేశించ వీలులేని కొత్త కొత్త భూముల్లోకి ప్రవేశించి, అక్కడక్కడా నిలచిపోయారు.

అంతా, తలా వొక దిక్కుగా వెళ్ళారు, కానీ, చెంచులు మాత్రం ఆ వింధ్య పర్వత ప్రాంతాలనే ఆశ్రయించుకుని పొట్ట పోషించుకొంటూ దాగి వున్నారు.

జనని జన్మభూమి స్వర్గం కంటె గొప్పదని అంటారు గదా!

ఒక వంక పచ్చి నెత్తురు తాగే శత్రువులు; ఇంకో ప్రక్క దేశాభిమానం. అందుకే చెంచులు ప్రాణాలను అరచేత్తో పెట్టుకొని కాలం వెళ్ళబుచ్చసాగారు.

పుత్రా! రామస్వామీ! ఇప్పటికీ చెంచులు వింధ్య పర్వత ప్రాంతారణ్యాలలో కనిపిస్తారు. చింకి బట్టలతో అర్ధనగ్నంగా వుంటారు. పొట్టకోసం, చెట్టుల్నీ - పుట్టల్నీ యెక్కి, తేనె పట్టుల్ని తీసి జీవిస్తూ వుంటారు. అయినా, వాడిగల బాణాలను ఎప్పుడూ విడిచిపెట్టి వుండరు.

# శూద్రులు

ఈ రకంగా ద్రావిడ యోధులంతా కకావికలైపోగా, ఆర్యులు శూరులై వెంటాడి, దారి కాచి వాళ్ళను పట్టుకొని కరకు కత్తులకు బలి యీయటం మొదలుపెట్టారు. కనీసం యుద్ధనీతిని గూడా పాటించలేదు. ఆర్యులంటే, అంతటి కసాయి వాళ్ళన్నమాట.

ఏ మాత్రం సందేహించకుండా, కొంతమంది వీర భటుల్ని, చేతికి చిక్కిన వాళ్ళను పశువుల మాదిరిగా బందెలలో పెట్టారు. చిత్రహింసల పాలు చేయటం మొదలుపెట్టారు. చేతికి చిక్కిన ద్రావిడులలో కొంతమందిని వంటవాళ్ళుగా వాడుకొన్నాడు. ఇంకా కొంతమందిని బానిసలుగా చేసి వాడుకోవటం మొదలుపెట్టాడు.

మొత్తం మీద ద్రావిడుల నందరినీ అజ్ఞానాంధకారంలో వుంచాలని ఆలోచన చేయసాగారు.

ఆర్యుల కుల గురువు వసిష్ఠుడు. ఆర్యుల విజయ పరంపరకు సంతసించి, ద్రావిడులకు జరిగిన పరాభవానికి సంబరపడి, ఇక ముందు జరుగబోయే కార్యక్రమం తన వాళ్ళకు చెప్పటానికి వచ్చాడు.

"సోదరులారా! శత్రువులోడిపోయారు. ఇది మనకెంతో గర్వకారణం - కాని చేతికి చిక్కిన శత్రువుల్ని చంపటవెూ - విడిచిపెట్టడవెూ వాళ్ళ చేత వెట్టిచాకిరీ చేయించుకోవడమో - చేయాలి. ఇది మనం నిశ్చయించుకోవలసిన విషయం'

వసిష్ఠుడిట్లా అనేటప్పటికి ఆర్య యువకులు అడ్డం వచ్చి "కాదు, కాదు, చేతికి చిక్కిన శత్రువుల్ని ఏ మాత్రం దయా దాక్షిణ్యాలు లేకుండా నాశనం చేయవలసిందే" అని కేకలు వేశారు.

యువకుల మాటలు విన్న ఆర్య వృద్ధులు, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, యువకులకు సర్దిచెప్పటం మొదలుపెట్టారు.

"ఆర్య జాతి వీరులారా! నవ యువకులారా! మీరన్నది నిజమే కావచ్చు. కాని, ముందు వెనుకల మంచి చెడ్డల్ని మనం ఆలోచించి ఏ పనైనా చేయాలి.

శత్రువు చేతికి చిక్కినపుడు రూపుమాపటం మంచిదే. కాని, యిప్పుడు మనకు ఆ పరిస్థితి లేదు. దొరికిన వాళ్ళను దొరికినట్టు ద్రావిడ వీరుల్ని చంపితే సమస్య యింతటితో ముగిసిపోదు. ఈ ప్రాంతంలో ద్రావిడ యోధులు ఇంకా కోకొల్లలుగా వున్నారు. మన

చేష్టలు వాళ్ళు పసికట్టకపోరు. మనం చేసే మారణకాండ చూచినవాళ్ళు, మనల్ని సహిస్తారంటారా? క్రమక్రమంగా పుంజుకొని, మనవాళ్ళను గూడా దొరికిన వాళ్ళను దొరికినట్టే సర్వనాశనం చేయరా? పీల్చి పిప్పి చేయరా?

ద్రావిడ యోధుల సంగతి - వాళ్ళ శక్తి సామర్థ్యాలూ మనకు తెలియనివి కావు. వాళ్ళు పిరికిపందలు గాదు. గొప్ప వీరులు. ప్రాణాలకైనా తెగించి కరకు కత్తులతో మన పైకి ఎగబడతారు. వాళ్ళ సత్తా మనమెరుగనిది కాదు. కాబట్టి, మంత్ర తంత్రాలతో వాళ్ళను వశపరచుకోవాలి. ఇంకో మార్గం ఇక్కడ పనికిరాదు. దుందుడుకుతనం ఏనాటికీ శ్రేయస్కరం కాదు."

ఆర్యుల పెద్దల మాటలు వసిష్ఠుడు విన్నాడు- ఆ మాటలతనికి తృప్తినిచ్చాయి.

"అవునవును; ఈ సమయంలో పెద్దల మాటలు వినవలసిందే. శత్రువులను మంత్రతంత్రాలతోనే లోబరచుకోవాలి. ఇతరమైన కార్యవిధిని ఆలోచించి, బిగి కల్గిన రాజనీతిని ప్రదర్శించటం ఎంతైనా అవసరం" అని వసిష్ఠుడు తన అభిప్రాయాన్ని జోడించాడు.

వెంటనే బ్రాహ్మణుల్లో, ఈ తంత్రానికి పనికి వచ్చే ఆరి తేరిన పండితుల్ని పిలిచారు. కొత్త ధర్మాలను - కొత్త ధర్మ మార్గాలను చెప్పగల దిట్టలనే రావించారు.

'ద్రావిడులు నల్లని శరీరం గలవాళ్ళు - తాము తెల్లని శరీరం గలవాళ్ళం కాబట్టి నల్లని శరీరం గల ద్రావిడులు, తమను తాకితే, తమ శరీరం మాసిపోతుంది. కావున, ద్రావిడ రాజుల్ని కూడా మనం తాకరాదు. వాళ్ళు మన జాతితో కలిస్తే, తప్పకుండా మనం మాసిపోతాం. అందుకనే వాళ్ళను మనం కలుపుకోరాదు' అని అనుకొన్నారు.

ఒకనాడు వసిష్ఠుడు ద్రావిడ పెద్దల్ని పిలిపించాడు. కొంచెం కూడా ద్వేషభావం కనిపించనీయకుండా, ఎంతో సౌమ్యంగా మాట్లాడడం ప్రారంభించాడు.

"ద్రావిడ వీరులారా! మీలో చాలా వంశాలున్నట్టున్నాయి. వాటికి పేర్లు కూడా కోకొల్లలుగా వున్నాయి. కాని, మేము ఆ పేర్లన్నీ గుర్తుపెట్టుకోలేము. ఆ పేర్లతో మిమ్మల్ని పిలువలేం. ఈ గజిబిజినంతా తీసేసి, మీ అందరికీ కలిపి మేము ఒక పేరిస్తాం. అంటే, మేమే మీకు ఒక పేరు పెడతాం - ఆ పేరు తోటే ఇకనుంచి మిమ్మల్ని పిలుస్తాం"

శత్రువుల చేతిలో ఓడిపోవటం వల్ల మానసికంగా, శారీరకంగా కృంగిపోయి తపిస్తున్న సమయంలో మదమెక్కిన ఆర్యులు కళ్ళకు కొవ్వు దట్టి - శూద్రులు - అనే పేరు ద్రావిడులకు పెట్టారు.

రామస్వామీ! ఎన్ని రకాలుగా ఎదిరించటానికి, మరెన్ని విధాలుగా ద్రావిడుల్ని అజ్ఞానాంధకారంలో వుంచడానికి వీలౌతుందో, అన్ని రకాలుగా ఆర్యులు దుస్తంత్రం పన్ని నాశనం చేయటానికి నడుం గట్టారు.

మతం పేరుతో, ధర్మం పేరుతో, నీతి పేరుతో, నియమం పేరుతో - ఒకటేమిటి? ఎన్నో విధాల కుచ్ఛితమైన బుద్ధినుపయోగించి, ద్రావిడుల నందరినీ మూఢులుగా చేశారు. ఈ సంగతులన్నీ వివరిస్తా; జాగ్రత్తగా విను.

పుత్రకా! ఆర్యులు ద్రావిడులకు చేసిన కీడు తలచుకొంటే, నాకే వొళ్ళు గగుర్పొడుస్తుంది.

తిరు మంత్రం చెపుతామని చెప్పి నిజంగానే వక్రమార్గాన తిరు మంత్రం చెప్పారు. అదేమిటో తెలుసా?

బ్రాహ్మణుల కాళ్ళకు మొక్కితే, పరలోక సుఖాలు వస్తాయని వంచించారు. ద్రావిడు లెవ్వరూ చదువరాదని శాసనం గావించారు; వాళ్ళంతా చదువుకొంటే, ఎదురు తిరుగుతారేమోననే భయం ఆర్యుల్లో చోటు చేసుకొంది. చిన్నతనం నుంచే గనుక సంస్కృతం మొదలైనవి నేర్చుకొని, తమకే యెదురు తిరిగి, తమ గుట్టును ఎక్కడ రట్టు చేస్తారో... అని ఆలోచించి యీ పని చేశారు.

ఎంత దుర్మార్గులైనా ఈ పని చేయరు. విద్యా గంధం సోకకుండా దూరం చేస్తారా? సృష్టి మొదలుకొని, యిప్పటివరకు తోటివాడికి కావాలని ఈ రకమైన నిషేధం చేసినవాళ్ళు వీళ్ళు తప్ప ఇంకెవరూ లేరు.

భాష ఒకరి సొత్తు గాదు. జిజ్ఞాస వుంటే, ఎవరైనా విద్య నేర్చుకోవచ్చు గదా!" మేము నీతిశాస్త్రాన్ని చదివి, దానిలో వుండే మంచి చెడ్డల్ని వివరించి చెపుతాం. మేము చెప్పిందే మీరు వినాలి. అంతేగాని, తగుదునమ్మా! అని మీరు కూడా చదవటానికి ప్రయత్నిస్తే, ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది –" అంటూ విద్యపై అనురక్తిని చంపివేశారు.

ఇంతకంటే దారుణం ఇంకోటి వుంది.

శూద్రుడైన వాడెవడూ కొత్త బట్టలు ధరించరాదు. బ్రాహ్మణులు తొడిగి పారేసిన చింకి పేలికలనే ధరించాలి. ఆహార విషయం కూడా కట్టుదిట్టం చేయబడ్డది.

ద్విజులు తినగా మిగిలిన యెంగిలి కూడు మాత్రమే శూద్రులు తినాలి. శూద్రులెవ్వరూ గుప్పెడు ధాన్యం గూడా సంపాదించరాదు. ఒక్క పైసా గూడా కూడబెట్టరాదు. ధాన్యం గాని - డబ్బులు గాని దాచుకొంటే, దొంగతనంగానైనా - బలవంతంగానైనా శూద్రుడి దగ్గర నుండి వాటిని లాగుకోవలసిందే.

చూశావా! బిడ్డా! ఆర్యుల కుతంత్రం, ఓడినవాళ్ళను ముందుగా చదువుకీ - సంపదకీ - సాంఘిక గౌరవానికీ - దూరం చేశారు. వాళ్ళకు ఏ మాత్రం చైతన్యం రానీయకుండా జడుల్ని చేశారు. ఇదే వాళ్ళ గొప్పతనం.

ప్రపంచంలో ఇంతవరకు ఏ జాతీ- ఓడిపోయిన వాళ్ళను ఇంత నికృష్ట స్థితికి

దిగజార్చలేదు.

నాయనా! ఇంతకంటే ఘోరమైనవీ, కఠినమైనవీ, నియమ నిబంధనలు విధించారు. స్మృతుల పేరుతో వాళ్ళు చేసిన చట్టాలన్నీ ఏకపక్షంగా చేసినవే.

ద్రావిడ స్త్రీలను ఆర్యులు చెరచవచ్చు - చెరపట్టవచ్చు - కావాలంటే పెళ్ళి చేసుకోవచ్చు. దాని వల్ల ఏ దోషమూ వాళ్ళకంటదు. కాని, ద్రవిడ సోదరుడెవడైనా ఆర్యుల కన్యల జోలికి పోతే, దాన్ని పెద్ద తప్పుగా పరిగణించి, వాళ్ళకు భయంకరమైన శిక్ష విధించారు.

నీవు నమ్మవేమోగాని, కేరళ రాష్ట్రంలో ఈనాటికీ ఈ నియమం సాగుతుంది.

అక్కడున్న నంబూద్రి బ్రాహ్మణులు ఈ నియమాన్ని పాటిస్తున్నారు. కాలం ఇంత మారినా, వాళ్ళను - 'ఇదేమిటి?' అని అడిగిన వాళ్ళు ఒక్కడూ లేడు.

ఇచ్చిపుచ్చుకోవటాలు జరిగితే, ఇద్దరూ సమానమైపోతారు. అందుకని పుచ్చుకోవటం తప్ప, ఆర్యులు ఈయటం పాటించలేదు. ఈ రోజుల్లో మాధ్వులు కూడా ఇట్లాగే నియమం పాటిస్తారు.

దేవాలయాల్లోకి పోవటం కూడదన్నారు. బడుల్లోకి పోతే పాపం వస్తుందన్నారు. మడిగట్టుకోవటం అధర్మమన్నారు. ఎంత దుర్మార్గమైన తంత్రం పన్నారో తెలుస్తుందిగా!

మోసం చేసి ప్రజల్ని మభ్యపరచటం కోసం, స్మృతుల పేర బడబడ పెద్ద పెద్ద చట్టాలు పండితులతో తయారు చేయించారు.

ద్రావిడులు మ్లేచ్ఛులనీ - మ్లేచ్ఛ జాతులవారనీ - చిత్రించారు. ఈ ఆర్య వంచకుల నీచ కృత్యానికీ - పాప కార్యానికీ పరిహారం వుంటుందా? కాస్త కూడా చింత లేకుండా ఆర్యులెంతెంత దారుణాలు చేశారో చెప్పలేదు.

కుక్కల వంటి నీచ జంతువులు తమ యిళ్ళల్లో ఎక్కడికి వచ్చినా సహించి, వాటిని భరించే ధర్మమూర్తులైన ఆర్యులు, ద్రావిడులు తమ గడపలను తొక్కితేనే 'మైల' సోకినట్టు వాపోయి, లబలబ మొత్తుకుంటారు. దీన్ని కట్టుదిట్టం చేయటం కోసమే స్మృతులు రాసి బిగించారు.

తీయని మామిడి చెట్ల నడుమ - దట్టమైన పొదరిండ్ల మధ్య - ఆవుల మోర పైకెత్తి క్రేళ్ళురికి సంచరించే మైదానపు పచ్చిక బీళ్ళ సందుల్లో - మండుటెండల్లో గూడా ఎండిపోకుండా వుండే సెలయేళ్ళు పారే కొండ కోనల మధ్య - కొందరు ద్రావిడులు పర్ణశాల లేర్పరచుకొని - కాపురాలు చక్కదిద్దుకొంటున్నారు . వాళ్ళనందరినీ ఆర్యులు - వానరులు అని పిలవటం మొదలుపెట్టారు.

మనం కోతుల్ని వానరాలంటాం గదా! వాళ్ళంతా కోతులని మనం తలంచాలా?

రామస్వామీ! అయితే, పురాణాల్లో, అంటే రామాయణాది గ్రంథాల్లో వానరులు రాయబారాలు నడిపినట్లు చదివాం. సముద్రానికి ఆనకట్టలు కూడా నిర్మించారని కూడా

విన్నాం. కాసె పని నేర్చి ఇళ్ళు కూడా కట్టారని తెలుసుకున్నాం. వానరులైతే– అంటే కోతులైతే, ఈ పనులన్నీ యెట్లా చేస్తారు? ఇదంతా కుటిల కల్పనగానే భావించవద్దా?

నిజంగా ద్రావిడులు వాళ్ళు చెప్పినట్టుగా కోతులే అయితే, 'లోకులు' తప్పు పట్టరానంత నైతిక జీవితాన్ని గడిపారని యెట్లా చెప్పగలం?

ఎవరూ ఎదురు చెప్పేవాళ్ళు లేరు గదా! అని ఇష్టం వచ్చినట్లు అదురు బెదురు లేకుండా, తమకు తోచిందే వాస్తవమన్నట్ట గంటాలు అరిగిపోయేట్టు వెకిలి రాతలు రాసి పారేశారు. ఇదంతా ద్రావిడుల గూర్చి ఆర్యులు చేసిన నీచ కల్పనగా భావించాలి.

ఎన్ని బాధలు కల్గినా, వుపకారం వ్యర్థమైనా, ధైర్యాన్ని మాత్రం సడలనీయకుండా, అవమానాల్ని భరిస్తూ సాధు జంతువుల్లాగా ద్రావిడులు జీవితాల్ని గడుపుతున్నారు.

మంచి రోజులెప్పుడు వస్తాయో... అని యెదురు చూస్తూ బ్రతుకు భారాన్ని మోస్తున్నారు.

ఉత్తర దిక్కున వున్న ద్రావిడుల స్థితిగతులిట్లాగే వున్నాయి.

భగ్న మనోరథులై, ఉద్విగ్న మనస్కులై, దాస్యపంకంలో మునిగి ఆర్యులకు బానిసలుగా బండబారిన బ్రతుకుల్ని గడుపుతున్నారు.

ఒక వింధ్య పర్వతం దాటి దక్షిణ దిక్కుకు వచ్చిన ద్రావిడ వీరుల పరిస్థితులను గూడా నీకు చెప్పాలి.

దక్షిణ దిక్కుకు వలస వచ్చిన ద్రావిడ వీరులు తామున్న ప్రదేశాన్నే స్వదేశంగా భావించారు. అమోఘమైన శక్తిని కూడగట్టుకున్నారు. దీక్ష పూనారు. అక్కడే నివాసాలేర్పరచుకొన్నారు. ఆర్యులు గావించిన పరాభవాన్ని మరచి స్వతంత్ర జీవనం సాగించసాగారు. క్రమక్రమంగా గత వైభవాన్ని సంతరించుకొన్నారు.

సహజంగా కొండలనుండి దూకి జలజల ప్రవహించే సెలయేళ్ళను పంట కాల్వలుగా జేసుకొన్నారు. గాసట బీసటగా వున్న పరిసర భూముల్ని శుభ్రం చేసుకొని, చవుటి పర్రలతో సహా సస్యశ్యామలంగా తీర్చిదిద్దారు.

అంతా సుశిక్షితులై, బీదా–సాదా పాటిస్తూ, అందరినీ సమానంగా చూస్తూ, లోకంలో తలలోని నాలుకగా మెలగుతూ ధర్మయుక్తంగా జీవనాన్ని గడుపుతున్నారు.

రాజ్యాలు సంపాదించుకున్నారు. ఎవరైనా శత్రుభావంతో పైకి వస్తే, వాళ్ళను అణచిపారేశారు. దురాశతో ఇరుగుపొరుగు వాళ్ళ రాజ్యాల జోలికి పోకుండా, ప్రజారంజకంగా ద్రావిడ భూపతులు దక్షిణాదిలో సుస్థిర సామ్రాజ్యాలను నెలకొల్పారు. విద్యను, ఇతర కళల్ని పోషించటం నేర్చుకున్నారు. సిరి సంపదలకు స్థానంగా వెలిగారు. దిక్కు దిక్కుల్లో తమ కీర్తిపతాకను ఎగురవేశారు.

తమలో తాము ఐకమత్యంతో మెలగుతూ, వింధ్యకు దక్షిణాన వున్న భూమినంతా

ఒకే గొడుగు కిందకు తెచ్చారు. కాకితో కబురంపితే, కప్పం తెచ్చి యిచ్చేట్టుగా శత్రుజన భయంకరులుగా వున్నారు. దాన ధర్మాలకే మాత్రం వెలితి రానీయకుండా ప్రవర్తించారు. మదగర్వంతో ఎవరైనా దండెత్తి వస్తే, ఆ మండలేశ్వరుల మదాన్ని ఒక్క క్షణంలో అణచిపారేసేవాళ్ళు. వాళ్ళను గడ్డి కరిపించేవాళ్ళు. దుష్ట శిక్షణలోనూ, శిష్ట రక్షణలోనూ ఏ మాత్రం పక్షపాతం లేకుండా పరిపాలన సాగించారు. సమస్త లోక కళ్యాణం కోసం ప్రవర్తించారు.

వంశపారంపర్యంగా వచ్చే ఆచారాలను కాపాడారు; శృంగారాది కళల్ని పోషించారు. కరవు కాటకాలు రాకుండా రాజ్యాల నన్నింటినీ పాడి పంటలతో కళకళలాడేట్టు చేశారు. దేశంలో ఎక్కడా దొంగలు, దారి దోపిడిగాండ్రు లేకుండా తీర్చిదిద్దారు. ఆలగోలు - బాలగోలు గాకుండా భూములన్నిటినీ కాపాడారు. 'ఇంతటి మంచి రాజులు' - ఎక్కడా లేరన్నంత గొప్పగా రాజ్యపాలన చేశారు.

దక్షిణాదిన ద్రావిడ నరపాలుడు పాలించే సీమల్లో - 'అన్నమో రామచంద్రా!' అని అంగలార్చే దరిద్రుడొక్కడు కూడా కానరాడు.

కట్టుకోవటానికి శుభ్రమైన బట్టలేక, చింకి పీలికలు ధరించేవాళ్ళు మచ్చుకైనా ఆ రాజ్యంలో కానరారు. దిన వెచ్చానికి దేవులాడుకొంటూ చేత కాసు లేనివాడు, ఆ భూ మండలంలో లేడు. అర్థులై వచ్చిన వాళ్ళను పొమ్మనలేదు, పొమ్మనే మనస్తత్వం వున్న నరపాలుడు మచ్చుకైనా లేడు.

నిజం చెప్పాలంటే- ఆ ద్రావిడ రాజ్యంలో కుంటి-గూని-చెవిటి- గ్రుడ్డి - వంటి అంగవికలురు కూడా కనిపించరు.

తమదైన భక్తి తేటతెల్లమయ్యేట్టు గుళ్ళూ, గోపురాలూ కట్టించారు, వాటికి పోషణగా మడి మాన్యాలు సమర్పించారు. ప్రయాణ సౌకర్యం కోసం బాటలు వేయించారు. బాటసారుల సౌకర్యార్థం, బాటలకు రెండు ప్రక్కలా చెట్లను నాటారు. అక్కడక్కడా బావులు తవ్వించారు, ఈనాటికి ఆ చెట్లు నీడ నిస్తూనే వున్నాయి.

ద్రావిడ మన్నీలు వింధ్యకు దక్షిణాన రాజ్యాలు స్థాపించి, జీవనం కొనసాగిస్తూ, పదిమందిలో మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. కాలం గడుస్తున్నకొద్దీ, సంతతి పెరిగి, వాళ్ళల్లో వాళ్ళే ఛిన్నాభిన్నమై విభిన్న ప్రాంతాలకు తరలిపోయారు. దూరంగా పోయినవాళ్ళు కుదురుకు దూరమై వేరు వేరు రాజ్యాలను స్థాపించి, భిన్న వంశీయులుగా ప్రవర్తించడం జరిగింది.

ఒకే కుదురుగా వున్న జాతి, చీలిపోవడంతో బిగువు సడలిపోయింది. పురాతన ఔన్నత్యం అడుగంటింది. జాతి పతనం కాజొచ్చింది. అక్కడక్కడా శత్రువులు తలయెత్తసాగారు.

దేశ కాల పరిస్థితుల వల్ల కలిగిన మార్పుల వల్ల, ఆయా ప్రాంతాలకు పోయిన ద్రావిడులు, క్రొత్త క్రొత్త ఆచారాలు - సంప్రదాయాలు - పట్టుపడడం వల్ల తొలి రూపం మార్చుకొన్నారు. పేర్లు మారిపోయాయి. క్రమక్రమంగా ఎవరికి వాళ్ళే మరల విజృంభించసాగారు. ఇంకా దక్షిణానికి జరిగి, రకరకాల రాజవంశాల పేర్లు ధరించి, వైభవాన్ని సమకూర్చుకుని పరిపాలన చేయటం మొదలుపెట్టారు.

బిడ్డా! కాలంతో పాటు వచ్చిన ఈ పెనుమార్పుల్ని సమగ్రంగా, అనుపూర్వికంగా వివరించటం కష్టం. అయినా, నేనెరిగినంతవరకూ పెద్దల వల్ల విన్నంత వరకూ జాగ్రత్తగానే వివరిస్తా; విను.

చీలిన ద్రావిడులు, తమిళులు - తెలుగులూ - కన్నడులు - మలయాళీలు - మొదలైన రీతులుగా చీలి దక్షిణాపథం నాలుగు ప్రక్కలా ఆక్రమించుకుని, విభిన్న నాగరికతలను - భాషలను - ప్రతిభలను కలిగి చాలాకాలం ఏ యిబ్బంది లేకుండా పాలన చేయటం మొదలు పెట్టారు.

ఎక్కడివాళ్ళక్కడ ఐకమత్యంతో హాయిగా వున్నారు. దక్షిణాదిన చోళ - చాళుక్యరాజులు భుజబలంతో ఎదురు లేకుండా రాజ్యాలు పాలించారు. నీతిగా - న్యాయం తప్పకుండా ప్రజల్ని కన్నబిడ్డలుగా ఏలారు.

చోళ చాళుక్య భూపతులు పాలించిన తరువాత దేశం అరాచకం కాజొచ్చింది. దేశమంతా అల్లకల్లోలమైంది. అంతా సమస్యల కారు చీకట్లు కమ్మాయి. ఉపద్రవాలు పెక్కు చోటుచేసుకున్నాయి. ప్రజలు కలవరపడి గగ్గోలు చెందారు.

తమిళ -కేరళ - కన్నడ రాష్ట్రాల్లో నాయర్లు - వెళ్ళాలు - మొదలియార్లు - అనే వంశస్థులు క్రమంగా పాదుకొన్నారు. తెలుగుదేశంలో వెలమ, రెడ్డి, కమ్మ, కాపు వీరులు తమ శౌర్య దీప్తిని వెలయించి రాజ్యపాలన సాగించారు.

తెలుగు నేలలో పరాక్రమ గర్వంతో వెలమ మన్నీలు విజృంభించి శత్రుమూకను విదలించి కొట్టారు. యుద్ధరంగంలో చండ ప్రచండులై కమ్మదొరలు పరరాజుల గర్వాన్ని మట్టి కరిపించారు. నిరుపమాన భుజబలంతో, రెట్టించిన శౌర్యంతో రెడ్డిరాజులు పగతురను పారదోలారు. శత్రుభీకరులై, కరకు కత్తులతో కాపు వీరులు శత్రు సంతతి అంతు చూశారు. దేశంలో బాధలు తొలగిపోయి, అరాచకం అస్తమించేటప్పటికి దొంగలు - దారి దోపిడిగాళ్ళ భయందీరి తెలుగునేల నిర్భయంగా వుంది.

పులి - మేక ఒకే రేవులో నీళ్ళ తాగేట్లు ధర్మబద్ధంగా ద్రావిడ భూమిలో ఏలుబడి సాగిపోయింది.

# అగస్త్య కుతంత్రం

ఉత్తరాన్ని ఆక్రమించుకుని, లొంగిపోయి అక్కడే వుంటున్న ద్రవిడ సోదరులను బానిసలుగా చేసుకొని బలగర్వంతో, ఆర్యులు కేరింతలు కొడుతున్నారు. ఇక వాళ్ళ చూపు దక్షిణం వైపుకు మళ్ళింది. దక్షిణాన వున్న ద్రావిడుల్ని గూడా జయిస్తే, తమ జైత్రయాత్ర ముగుస్తుందనీ, శత్రుశేషం లేకుండా గుండెపై చేయి వేసుకుని హాయిగా నిద్రపోవచ్చునని తలంచారు.

ఆలోచన వచ్చినదే తడవుగా, సర్వతంత్ర స్వతంత్రుడు – వేద వేదాంగ పారంగతుడు – ఇంగితం తెలిసినవాడూ – అయిన అగస్త్యుణ్ణి పిలిపించారు.

తమ సంఘపు పెద్దలు పిలిచీ పిలవటంతోటే హుటాహుటిన అగస్త్యుడు అక్కడకు వూడిపడ్డాడు.

వచ్చిన అగస్త్యుణ్ణి సాదరంగా – సగౌరవంగా పిలిచి, కూర్చుండబెట్టి కర్తవ్యం చెప్పారు.

'అగస్త్యమునీ! జాతి క్షేమాన్ని కోరి, కార్యాన్ని అప్పగించబోతున్నాం దీనికి నీవే అర్హుడవని గ్రహించి, ఈ పని నీకే అప్ప చెపుతున్నాం.

మనం బ్రతుకుతెరువు కోసం ఎక్కడి నుంచో ఇక్కడికి వచ్చిన సంగతి నీకూ తెలుసు. మనం పరదేశ వాసులం. అయినా, మాయోపాయంతో ఇక్కడ వున్న దేశీయుల్ని జయించి స్థిరపడ్డాం. చుట్టుముట్టిన శత్రువుల్ని ఎట్లాగైతేనేం, చిందరవందర చేసి, నాశనం చేసి, వాళ్ళ నందరినీ వొకదారికి తెచ్చి, ఈ ఉత్తర భాగాన్ని ఆక్రమించుకున్నాం.

కత్తి బలంతోటే మనం కాపురాలు చేస్తున్నాం. ఈ విషయం నీకు వేరే చెప్పే పనే లేదు.

కాని, మన చేత వోడింపబడ్డ ద్రావిడులు, కొంతమంది వింధ్య పర్వతం దాటి, దక్షిణ దిక్కుకు పోయి, సుస్థిర సామ్రాజ్యాలు స్థాపించుకొని ప్రజాపాలన చేస్తున్నారు. వాళ్ళ సంగతి పరిశీలిస్తే, ఏనాడైనా వాళ్ళు దక్షిణం వైపు నుండి మనపై దాడికి రావచ్చు – శత్రువులట్లా మసలుతూ వుంటే, మనమిక్కడ ఇలా వుండడం క్షేమం గాదు. చీకు–చింతా, చిక్కులూ వుంటే, యిక్కడ కాలం గడపలేం. ఎంతటి వీరుడైనా శత్రుశేషాన్ని సహించరాదు. అది హానికరమని రాజనీతి తెలిసిన పండితులంతా అంటూవుంటారు. కాబట్టి మనం నిశ్శేషంగా శత్రు సంహారం చేయటం అవసరం. ఇది మన కర్తవ్యం కూడా.

అందుకని, నీవు కొంతమంది శిష్యుల్ని తీసుకొనిపోయి, వింధ్యకు దక్షిణాన స్థిరపడ్డ ద్రావిడ రాజ్యాల్లోకి వెళ్ళు, అక్కడే ఒకచోట నీకు అనుకూలమైన ప్రదేశం చూసుకుని, ఒక ద్రావిడ గ్రామ పరిసరాల్లో నివాసం ఏర్పాటు చేసుకో. అక్కడి ప్రజలతో బాగా పరిచయం సంపాదించుకొని, వాళ్ళందరికీ తలలో నాలుకలా మెలగాలి.

మత ప్రచారానికి వచ్చినట్టుగా నటించి, వాళ్ళ అనుపానులు - గుట్టుమట్టులు పసిగట్టాలి. వాళ్ళల్లో ఒక మనిషిగా మెలగుతూ, ఆ జాతిలో ఒకళ్ళకొకళ్ళకి భేదం పుట్టించి, నీ వైపుకి తిప్పుకొని కొంతమందిని, మన పని సుళువయ్యేట్టు చక్కబెట్టాలి.

నీవు గొప్ప ప్రజ్ఞాశాలివి. అంతేగాక, ఉపజ్ఞ గూడా నీకు వెన్నతో పెట్టిన విద్య. లోక వృత్తాంతమంతా నీకు కరతలామలకం.

మేము నీకు చెప్పేపాటివాళ్ళం కాము. అయినా చెప్పవలసి వచ్చింది, కాబట్టి చెపుతున్నాం; విను.

శత్రువుతో పొరపాటునైనా పెడసరంగా మాట్లాడబోకు. నీవు నడిపే తంత్రం జాగ్రత్తగా ఆలోచించి నడుపు. ఏదో సంబరంలో మునిగిపోయి, మురిపెంతోనయినా, యితరులకు రహస్యాలు చెప్పకు. ఎన్ని సాధక బాధకాలైనా, పట్టినపట్టు నెరవేర్చాలి.

ఇంకా విను, దేశకాల ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని ముందు చూపుతో సమస్తం పరిశీలించాలి. శత్రువుల నుంచి తిరస్కారం వస్తే తొందరపడబోకు. సమయం కోసం వేచి వుండు, పని నెరవేరుతుంది.

ఎట్లాగైనా, ఆర్యసంఘ హితమే నీకు పరమార్థమని భావించు. అచంచలమైన పట్టుదలతో, ఈ సమయంలో జాతికి మేలు కావించు. నీ జన్మ ధన్యమౌతుంది. నీ పుట్టుక సార్థకమవుతుంది. చరితార్థమవుతుంది.

ఆపైన శత్రురహితమైన రాజ్యంలో, మన పిల్లా పాపా హాయిగా విహరిస్తారు, మనకూ దిగులు లేకుండా వుంటుంది."

అని ఆర్యసంఘపు పెద్దలు నచ్చచెప్పి, అగస్త్యుణ్ణి దీవించి పంపారు. పెద్దల ఆశీర్వాదం పొంది అగస్త్యుడు 'దక్షిణ' దిక్కుకు ప్రయాణం చేయ సిద్ధమయ్యాడు. తనకు హితులైన కొంతమంది శిష్యుల్ని కూడా వెంటబెట్టుకొన్నాడు.

జాతి తనపై పెట్టిన కర్తవ్య భారాన్ని గ్రహించి, ఇనుమడించిన వుత్సాహంతో పయనమై వింధ్యపర్వతానికి దక్షిణాన వున్న కీకారణ్యాలలోకి అడుగుపెట్టాడు. ఉండటానికి వీలైన ప్రదేశాన్ని వెదకి మునిపల్లె ఒకదాన్ని పట్టుకున్నాడు. పుష్కలంగా నీరు - ఫల వృక్షాలు దొరికే చోటే యెన్నుకొన్నాడు.

తనకంటె నాలుగాకులెక్కువ చదివిన వంచకులైన శిష్యుల్ని సమకూర్చుకొని, వాళ్ళను ద్రావిడ గ్రామాలకు పంపాడు. ఆ శిష్యులు విచ్చలవిడిగా, తమకు సంబంధించిన వేదాంతాన్ని బోధించారు. ద్రావిడ జాతీయాచారాలను దూషించి, వాటిపై వాళ్ళకు వెగటు పుట్టేలా చేశారు. తమకున్న తర్క పాండిత్యాన్ని ప్రదర్శించి, వితండవాదం చేశారు. పూర్వాపర సందర్భాలను కూడా మరపించి, ద్రావిడ సంఘం నుంచి సంఘ విద్రోహుల్ని కొంతమందిని తయారుచేశారు.

ఏదో కొంత మేరకు సఫలీకృతుడయ్యాడగస్త్యుడు. దానికే పుష్పిళ్ళూరుతూ పొంగిపోయి కులుకుతూ ఒకరోజున ఆనందం పొంగి పొర్లిపోతుండగా విచారించటం మొదలుపెట్టాడు.

మా పంచ జేరిన ద్రావిడులు స్వార్థబుద్ధితో సంఘద్రోహానికి గూడా వెనుకంజ వేయలేదు. కనీసం జాతి వైరాన్ని కూడా గమనించలేదు. తమ జాతి నుండి విడివడి, మా ఆర్య సంఘానికి దాసానుదాసులై జోహారులు చేస్తున్నారు. ఈ జాతి మాత్రోప జీవులకు, భౌతిక వాంఛలు తీర్చుకొని, సంతృప్తి పడడానికి కావలసిన ధనమిస్తే సంబర పడతారు. కుల గౌరవం కట్టబెట్టినా పొంగిపోతారు. ఆర్యులతో స్నేహం చేస్తే, ఈ లోకంలోనూ - పరలోకంలోనూ ఫలితాలు అనుభవించవచ్చుననే నమ్మకం కలిగించినా, మురిసిపోతారు. ఏదో ఆశ చూపి వీళ్ళను ఆర్య సంఘానికి దాసులుగా చేసుకోవచ్చు. కాబట్టి ఆలస్యం చేయకుండా కార్యక్రమం నిర్వర్తించాలి - అని నిర్ణయించుకొన్నాడు.

ఇట్లా ద్రావిడ సమాజం నుంచి వచ్చినవాళ్ళనందరినీ వొకచోట పోగుచేశాడు. 'ఆర్య ధర్మాల్ని నమ్మితే భౌతిక సుఖాలు కోకొల్లలుగా వస్తాయి. ఆ తరువాత దేవ పదం కూడా వస్తుంది -మోక్షం లభిస్తుంది- ' అని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టుగా ఎంతో తీయటి మాటలు చెప్పాడు.

కొన్ని కులగోత్రాలను కొత్తగా బుట్టించి, వాళ్ళకు విప్రులని పేరు పెట్టాడు. తన తాతలు - ముత్తాతలు - తండ్రులు వీళ్ళకు గోత్ర పురుషులని చెప్పాడు. 'మాతో సమాన గౌరవాన్ని ఇచ్చా'మని కపట గౌరవాన్ని చూపించాడు. అంతేగాకుండా భోజన భాజనాలలో సహపంక్తి నిచ్చి మర్యాద నేర్పినట్టు చేశాడు. సిగ్గూ - ఎగ్గూ లేకుండా ద్రావిడులున్న పల్లెలకు పోయి, రకరకాల ప్రతిజ్ఞలు చేసి, ఎట్లాగైనా ద్రావిడుల్ని ఆర్యులకు దాసులుగా చేయవలసిందని శిష్యులకు బోధించాడు.

కొత్త వైష్ణవానికి ముద్ర లెక్కువన్నట్లు; అగస్త్యశిష్యుల వల్ల కొత్త ధర్మజ్ఞానం పొందిన, అగస్త్య ప్రశిష్యులు పెత్తనం వెలగబెట్టడం మొదలుపెట్టారు. ఈ ప్రశిష్యులతోపాటు కొత్తగా బ్రాహ్మణులైన అభినవ బ్రాహ్మణులు ద్రావిడుల గ్రామ ప్రాంతాలకు పోయి ఆర్య ధర్మాన్ని ప్రబోధించటం మొదలుపెట్టారు. అసలువాళ్ళ కంటె, ఈ కొత్త బ్రాహ్మణుల ప్రాభవం వెలిగిపోతోంది. అగస్త్యుడి ప్రజ్ఞాపాటవాలు బాగా పారినాయి.

"సోదరులారా! గంగానమ్మకు గుళ్ళు కట్టడం అనవసరం- సీతారాముల గుళ్ళు కట్టండి. పోతురాజు - మొదలైన విగ్రహాల ముందు గంగవెర్రులెత్తినట్టు చిందులు తొక్కటమెందుకు? భద్రుని పళ్ళెరం పట్టుకోండి. గొంతెమ్మ దేవత కొలుపులు మానండి. బ్రహ్మ - విష్ణు ఈశ్వరులను త్రిమూర్తులనే సేవించండి. పోలేరమ్మ - మారెమ్మ - మద్దిరామమ్మల జాతరలు చేయడం దండగ. వాటివల్ల ఫలితం శూన్యం. వాటిని మానండి. యజ్ఞ యాగాలు చేయండి. వాటిల్లో జంతు బలులు సమర్పించండి. గొర్రెల్ని

- మేకల్ని గొంతు కోయండి. వీటికీ మోక్షం వస్తుంది. మేం చెప్పేది సత్యం.

జుంటి తేనెలు, పూదేనెలు మానేయండి. సోమరసం పీకల దాకా తాగండి. సోమరస పానం వల్ల స్వర్గలోకంలో అప్సర వనితల మధురాధరామృతాన్ని గ్రోలవచ్చు.

ఎట్లాగైతేనేం, ద్రావిడులకు మైకం కలిగేట్టు, వాళ్ళకు నచ్చే విధంగా కొత్త బ్రాహ్మణులు మాయమాటలు చెప్పి, కొంతమందిని తమవైపుకు తిప్పుకొన్నారు. అద్భుతం గొలిపేట్టు, ఎంతో పట్టుదలతో ఈ కార్యాన్ని సాధించారు.

ఆ తరువాత, ఆర్య దాసానుదాసులైన ద్రావిడులు తమ జాతిలోనే విభేదాలు పుట్టించి, తామేదో గొప్పవాళ్ళమనే ధీమాతో నిక్కుతూ - నీల్గుతూ - విర్రవీగుతూ - కిందా మీదా యెరక్కుండా విచ్చలవిడిగా సంచరిస్తున్నారు.

తమ జాతిని ధిక్కరించింది గాక, స్వజాతిని మూఢులుగా - అజ్ఞానులుగా భావించడం మొదలుపెట్టారు.

మూర్ఖత్వం కళ్ళకు కమ్మింది. మధురాతి మధురమైన సొంత భాషను ఏవగించి, పరాయిభాష - అని కూడా గమనించక, శత్రువుల భాష అని కూడా సిగ్గుపడక సంస్కృత భాషను నేర్చుకోవటానికి సిద్ధపడ్డారు. ఇంతకంటె నీచమైన కృత్యం ఇంకొకటి లేదు.

తమ జాతి ప్రాణప్రదంగా భావించే ప్రాచీనాచారాలు దోష భూయిష్ఠాలని చెప్తూ, ఆర్యుల కొత్త ఆచారాలను పాటించటం మొదలుపెట్టారు.

క్రమక్రమంగా ఈ విధంగా భేదభావాలు బలిసిపోయాయి. ఆర్యులకు దాసులైన ఈ జాతి ద్రోహులు గర్వాంధకారంతో సంచరిస్తూ వున్నారు. ఆ రోజుకారోజు ఈర్ష్యా - అసూయలు పెచ్చరిల్లసాగాయి. దానితో, జాతిని వీడి ఆర్యుల అడుగులకు మడుగులొత్తుతున్న జాతి విద్రోహులు ప్రత్యేకంగా ఒక శాఖగా ఏర్పడ్డారు.

అగస్త్యుడిన్ని తిప్పలు పడ్డా ద్రావిడుల్లో అల్ప సంఖ్యాకులు మాత్రమే విద్రోహబుద్ధితో స్వజాతిని విడిచిపోయారు. ద్రావిడులంతా తమకు వశం కాలేదనే కోపం ఆర్యుల్లో పొడసూపింది. క్రోధం అధికం అయ్యేటప్పటికి, ఏమీ పాలుపోక కొత్త యెత్తుగడ వేశారు.

కలియుగంలో రెండే రెండు వర్ణాలున్నాయని, ఆర్యులు డొంక తిరుగుడుగా చెప్పటం మొదలుపెట్టారు. 'బ్రాహ్మణులు - శూద్రులు' అనే రెండే వర్ణాలు తప్ప, కలియుగంలో వేరే వర్ణాలు లేవు, క్షత్రియులు - వైశ్యులు అనేవాళ్ళు ఈ యుగంలో వుండరు. ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ స్మృతులు రాశారు. ఇదంతా ద్రావిడుల్ని వంచించటానికి వాళ్ళ కోసం రాసిన రాతలు.

ఎన్ని రకాల మంత్ర తంత్రాలుపయోగించారు. మాయో పాయాలు పన్నారు. అయినా, అవన్నీ ఎంతోకాలం నిలవలేదు. వంచన యేనాటికైనా బయటపడక తప్పదు.

స్మృతులు - పురాణాల పేరుతో వస్తున్న గ్రంథాలు విముక్తి నిస్తాయని కల్లాకపటం

తెలియని నల్లవాళ్ళు గాఢంగా నమ్మారు. ఆ విశ్వాసం వల్లనే పతనమయ్యారు.

కుమారా! ఇంకా చెప్పవలసిన సంగతులున్నాయి. శ్రద్ధగా విను.

ద్రావిడ జాతికి భవిష్యత్తుంది. తన దౌర్బల్యాన్ని విడిచి, ఈ జాతి పురావైభవాన్ని పొందుతుంది. సేతువు మొదలుకొని వింధ్య పర్వత ప్రాంతం వరకు వున్న ఈ దక్షిణ దేశమందలి ద్రావిడ వీరులు తిరిగి విజృంభించే సమయం వస్తుంది. ద్రావిడ వీరులాత్మ దుస్థితి గమనించి, కళ్ళు తెరచి, పూర్వ వైభవాన్ని పొందుతారు. ఇది తప్పకుండా జరుగు తుంది. ఆర్య కుతంత్రాన్ని బట్టబయలు చేస్తారు. ఆర్య సంస్కృతికి గోరీ కడతారు. ఈ సమయం ఇంకెంతో దూరంలో లేదు. అని చెప్పి, సూతముని చాలించాడు. తరువాతి వృత్తాంతం చెప్పండని ప్రార్థింప, ఆ ముని తిలకుడు మరలా చెప్ప నారంభించాడు.

# అసురుల వలస

రామస్వామీ! అసురులు ప్రాణగొడ్డమైన ఆకటి మంటను చల్లార్చుకొలేక, నీరసపడిపోయారు. ఎక్కడికైనా పరదేశానికి పోయి, ప్రాణాలను కాపాడుకోవాలని ఆలోచన చేశారు. అక్కడ నుంచి పడమర దిక్కుకుపోయి, అక్కడి భయంకరాటవులలో కాలుబెట్టారు. ఏ రకమైన చెడువ్యసనాలకు లొంగక సంతసంతో ప్రవాస జీవితం గడపసాగారు.

సింహ, శరభ, శార్దూలాది క్రూర జంతువులకు స్థావరమైన ఆ భీకరారణ్యాన్ని నివాసయోగ్యంగా మలచుకొని ఎంతో సౌఖ్యంతో కాపురమున్నారు. కొంపా – గోడూ సంతరించుకొన్నారు, దిగులు పోగొట్టుకొన్నారు. పొట్టకు – బట్టకు చాలినంత సంపాదించుకొంటూ, పిల్ల జెల్లతో అసురులు హాయిగా ఆ కారడవుల్లో వుండగాసాగారు.

ఆ అసురులే నేడు మనం పిలిచే పారశీకార్యులు. వాళ్ళ సంతతే పారశీలు. వాళ్ళ నివాస భూమి పారశీకం. అయోనిజులు అసురులతో కలిసి వుండడం ఇష్టం లేక, ఆ ప్రదేశాన్ని విడిచారు. ఆవల దేశానికి పోయి, వసతులనేర్పాటు చేసుకొని నేటికీ సుఖ సంతోషాలతో కాపురముంటున్నారు. ఎంతో పేరు ప్రతిష్ఠల్ని సంపాదించుకొన్నారు.

వాళ్ళ పేరుతోటే ఆ దేశం ప్రసిద్ధి పొందింది, వాళ్ళ పేరు మీదే అక్కడి సముద్రం ప్రఖ్యాతి వహించింది. ఈనాటికి గూడా వాళ్ళ కీర్తి ఆ ప్రాంతమంతా మారుమోగుతోంది.

అయితే, అసురవర్యులు ఆర్యవైభవాన్ని చూచి, అసూయపడి, వాళ్ళ మీదకు దండెత్తి వచ్చారు. భయంకర యుద్ధం చేసి, ఆర్యావర్తంలోనే నాశనమొందారు.

# ద్రౌపది దృష్టద్యుమ్నుల జన్మ వృత్తాంతం

ఈ సందర్భంలో నీకు విచిత్రమైన కథ ఒకటి చెపుతా విను.

వ్యాసుడురాసిన పంచమ వేదమనే పేరు గల భారత గ్రంథంతో, పంచ పాండవులకు

ఉమ్మడి భార్యగా వున్న ద్రౌపది, పాండవుల సేనా నాయకుడుగా వున్న దృష్టద్యుమ్నుడు అనే రెండు పేర్లూ విన్నావుగా.

ద్రౌపదీ, దృష్టద్యుమ్నులిద్దరినీ అయోని సంభవులు - లేక అయోనిజలు అని అంటారు. ఈ విషయం కూడా నీకు తెలుసు ననుకొంటా.

లోకాన్ని మోసగించటం కోసం ఈ కథ కల్పింపబడ్డది. ఈ విషయం సమస్తం మొదటి నుంచీ, చివరి దాకా వినిపిస్తా. నిజం బయట పడుతుంది.

పాంచాల వంశంలో ద్రుపదుడనే రాజున్నాడు. ఇతడు చిన్న తనంలో విలువిద్య నేర్చుకోవటానికి మున్యాశ్రమానికి వెళ్ళాడు. అప్పుడిత నితోపాటు ద్రోణుడు కూడా విలువిద్య నేర్చుకోవటానికి వచ్చాడు. ద్రోణ ద్రుపదులిద్దరూ సహపాఠులన్నమాట. ఒకే గురువు దగ్గర విద్యాభ్యాసం చేస్తున్నారు.

ఇట్లా వుండగా ఒకనాడు ద్రుపదుడు ద్రోణుణ్ణి పిలిచి 'మిత్రమా! నేను విద్యాభ్యాసం తరువాత, పాంచాల దేశానికి రాజైనపుడు, నీవు గనుక అక్కడకు వస్తే, నీకు కావలసిన కోర్కెను నెరవేరుస్తా" అని చెప్పాడు.

అట్లాగే ద్రుపదుడు విద్య పూర్తి అయిన తరువాత పాంచాల రాజ్యానికి ప్రభువైనాడు. ద్రోణుడు పెళ్ళి చేసుకొని జీవనం సాగిస్తున్నాడు. కుటుంబ భారాన్ని మోయలేక ద్రోణుడు నిజంగానే రాజ్యమేలుతున్న ద్రుపదుడి దగ్గరకు వచ్చాడు.

ఒకవేళ తనను మరచిపోయాడేమోనని ద్రోణుడు తన్ను తాను పరిచయం చేసుకుని, చిన్నతనంలో విద్యాభ్యాసం చేసేప్పుడు తనకిచ్చిన మాటను కూడా ద్రుపదుడికి గుర్తుచేశాడు. తాను వచ్చిన పని గూడా వివరించి ఆట్లాగే నిలబడ్డాడు.

కాని, ద్రుపదుడు పాచికలాటలో వున్నాడు. వచ్చిన ద్రోణుణ్ణి ఓరకంట జూచి తన ఆటలో మునిగిపోయాడు. ఈ స్థితి గమనించిన ద్రోణుడు కోపంతో వెంటనే గిర్రున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

ద్రుపదుడిపై కోపంతో మండిపోతున్న ద్రోణుడు తిన్నగా హస్తినాపురానికి వెళ్ళాడు. వెళ్ళి భీష్మణ్ణి కలుసుకొని కౌరవ కుమారులకు విలువిద్య నేర్పుతానని చెప్పి నేర్పటం మొదలుపెట్టాడు. విలువిద్యా రహస్యాలన్నీ కురు కుమారులకు ఆమూలాగ్రంగా బోధించాడు.

విద్య సాంతం నేర్చిన తరువాత కురుకుమారుల చూచి, ద్రోణుడు, "రాజకుమారులారా! మీ విద్య పూర్తి అయింది. నాకు గురుదక్షిణ కావాలి. గురుదక్షిణను మీరు సమర్పించాలి. పాంచాల దేశాన్ని పాలిస్తున్న ద్రుపదుణ్ణి కట్టి తీసుకురండి. అదే నాకు కావలసిన గురుదక్షిణ- పొండు" అని అన్నాడు.

వెంటనే అర్జునుడు పాంచాలదేశం పోయి, ద్రుపదుణ్ణి బంధించి, తెచ్చి ద్రోణుడి

కాళ్ళ ముందు పడవైచాడు. బంధింపబడి, తేబడి, తన కాళ్ళ ముందున్న ద్రుపదుణ్ణి చూచి ద్రోణుడు

"ఎవరయ్యా! వీరు ద్రుపద మహారాజులే? బ్రాహ్మణుని పాదాలపై ఇట్లా యెందుకు పడ్డారో? అయ్యయ్యో...! మీ అంతటి వాళ్ళకిది తగునా? అని పలురకాలుగా ద్రుపదుణ్ణి ఎత్తిపొడుపు మాటలతో ఎద్దేవ చేశాడు ద్రోణుడు.

ద్రోణుడి మాటలు శూలాల్లాగా హృదయానికి గుచ్చుకొన్నాయి. ద్రుపదుడికి రాజలోకంలో తగినంత పరాభవం జరిగినందుకు కుతకుత ఉడికిపోయాడు. అవమానం, కోపం - ప్రతీకార వాంఛ - ముప్పేటగా పెనవేసుకొన్నాయి, అతనిలో, పగ తీర్చుకొనే దారి లేక పరితపించి పోయాడు.

ద్రుపదుడికి సంతానం లేదు. తండ్రికి పరాభవాన్ని తీర్చే కొడుకు లేడని దిగులు చెందాడు. తనకు ద్రోణుణ్ణి ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలు లేవు. కోపంతో మాత్రం కుమిలిపోతున్నాడు. పగబట్టిన త్రాచులా తల్లడిల్లుతున్నాడు. ఎట్లాగైనా కొడుకును సంపాదించాలని స్థిర నిర్ణయానికి వచ్చాడు.

ఉత్తర కురు భూముల్లో, ఉత్తర దిక్కున, అయోనిజులనే వాళ్ళున్నారనే సంగతి తెలుసుకున్నాడు ద్రుపద మహారాజు. ఆ తండా దగ్గరకు తన చారుల్ని పంపాడు.

ద్రుపదుడి ఆజ్ఞను తలదాల్చిన చారులు, యాజుడు - ఉపయాజుడు అనే మునుల్ని కలుసుకొన్నారు. వాళ్ళిద్దరూ చెప్పిన పద్ధతి ప్రకారం చారులు అయోనిజ తండాలున్న వుత్తర కురు భూముల్ని సమీపించారు. ఎట్లాగైనా తమ కార్యం సాధించాలనే పట్టుపట్టారు.

గూఢచారులు అయోనిజ తండాని సమీపించారు. వాళ్ళ నివాస ప్రదేశానికి పోయి, అక్కడున్న బిడ్డల్ని బాగా పరిశీలనతో చూస్తూ, ఒక చోట పొంచి వున్నారు. అప్పటికి మునిమాపు కావచ్చింది.

పొంగిపోయే లావణ్యం - బంగారు శరీరచ్ఛాయ - రంగారే శరీర సౌష్ఠవంతో ఎంతో సింగారంగా వున్న శిశువుల్ని చూచి చారులు, లొట్టలు వేయటం ప్రారంభించారు. ఆ సొగసు గల శిశువుల్ని చూచి, సంతోషించి, తప్పకుండా ద్రుపద నరపాలుడి కోర్కె నెరవేరుతుందనే నిశ్చయానికి వచ్చారు. ఇట్లా వుండగా ఆ రేయి -

"పిండారబోసినట్లు వెన్నెల కాస్తున్నది. పైరగాలి (దక్షిణం నుంచి వచ్చే గాలి) తేలుతుంది. వాతావరణం వుల్లాసభరితంగా వుంది. ఈ సమయంలో సల్లాపాలాడుతూ పిల్లలు గుంపులు గుంపులుగా ఆరుబయట విహరించటం కోసం వచ్చారు. వాళ్ళల్లో పది పదారేండ్లు నిండిన బాలుడొకడు చూడముచ్చటగా వున్నాడు.

మూడు బారలున్న వింటిని మూపుపై ధరించాడు; పొది నిండా అమ్ములున్నాయి, కైజారును మొల దట్టీలో గట్టిగా ఇరికించాడు. బారుగా వున్న ఈటెను ప్రక్కగా

జారవిడిచాడు. తల మీద ఎంతో అందంగా వుండేట్టు కుళ్ళాయి వుంచాడు; శరీరమంతా కప్పేట్టు కవచాన్ని తొడిగాడు; చేతిలో చికిలి చేసిన కత్తి ధరించాడు; పిల్ల యేనుగులా మంద మంద నడకలతో, మొగాన చిరునవ్వు మొలకలెత్తుతుండగా, సౌందర్యరాశి అన్నట్టుగా వున్నాడు.

ముగ్ధ మోహనంగా వున్న ఆ బాలుడితో పాటే, ఒక బాలికా మణి గూడా వచ్చింది. చూద్దామన్నా కసటు కనిపించదు. ఎంతో ముద్దులు మూటగడుతుంది ఆ బాలిక.

సౌందర్యం కుప్పపోసినట్టున్న ఆ బాల బాలికల్ని చూచిన ద్రుపదమహీపతి వేగులవాళ్ళు, అదే అదననుకొని, వాళ్ళను సమీపించి ముసుగులు వేసి, పట్టుకొని ద్రుపదుడి దగ్గరకు తీసుకువచ్చారు.

చారులు దొంగిలించి తెచ్చిన బిడ్డల్ని, తేరిపార చూచి ద్రుపద మహీకాంతుడు సంతోషపడి చారులకు తగిన కానుకలిచ్చి వాళ్ళను పంపివేశాడు.

చారులు పోయిన తరువాత, సంతోష భారంతో ముద్దుగొల్పు ఆ బిడ్డలిద్దరినీ చూచి, ఏంచేయాలో తోచక, ఏకాంతంగా చాలాసేపు ఆలోచించాడు. తన వంశంలోని శిష్టుల్ని పిలిపించి, ఏ మాత్రం పరాకు లేకుండా నిబ్బరంగా ఆలోచించాడు. పిల్లల కోసం పుత్రకామేష్టి యాగం చేయాలని చెప్పి, దానికి కావలసిన ప్రయత్నాలు వెంటనే జేసి, యాగ నిర్వహణకు సమకట్టి యజ్ఞ దీక్షితుడయ్యాడు.

శ్రద్ధతో హోతలు ఋక్కులు చదువుతున్నారు. యాజ్ఞికులైన విప్రులు సమస్త వస్తువుల్ని సమకూరుస్తున్నారు. ఉద్గాతలు మనోహరంగా సామాన్ని గానం చేస్తున్నారు.

ద్రుపదుడు భార్యా సహితుడై యజ్ఞగుండం దాపునే కూర్చున్నాడు. హోమగుండంలో సమిధలు వేస్తూ, అగ్ని చల్లారకుండా నేయి వేస్తూ వేలుస్తున్నాడు. యజ్ఞధూమం దిక్కుల్ని ఆవరించింది. మంటలు కమ్ముకున్నాయి. ఋషులు చెవులు చిల్లులు పడేలా మంత్రాలు చదువుతున్నారు. భగభగమని సవనాగ్ని దిక్కుల నిండింది. ఆ సెగకు తట్టుకోలేక అక్కడి వాళ్ళు మొఖాలు చాటు చేసుకొన్నారు. క్రమ్మిన పొగ వల్ల కళ్ళు మూసుకున్నారు.

ఇదే సమయమనుకుని ఒక్క క్షణంలో యజ్ఞవేదిక మీదకు బాలుణ్ణి, బాలికను తెచ్చి నిల్చుండబెట్టారు. అందరికీ ఆశ్చర్యం వేసింది.

ద్రుపద రాజవంశాన్ని నిలబెట్టడానికి పరమేశ్వరుడు ఈ కవలలను అగ్నిగుండంలో ఇప్పుడవతరింపజేశాడు –" అని మునులంతా ఏమాత్రం తడబాటు లేకుండా అన్నారు.

ఆ మాటలకు ద్రుపదుడు సంతోషించాడు. మునులకు యథాపూర్వకంగా నమస్కరించాడు. ఋషులంతా ఆ పార్థివుణ్ణి ఆశీర్వదించారు. మునుల ఆశీర్వాదం పొంది శిశువుల్ని తీసుకుని అంతఃపురానికి వచ్చి ద్రుపదుడు మోహపరవశత్వంలో మునిగిపోయాడు.

యజ్ఞకుండంలో అవతరించారు కాబట్టి, వాళ్ళు అయోనిజులని పాంచాల దేశమంతా ప్రచారం గావించారు. వాళ్ళెవరయిందీ, అసలు సంగతి, ఎవ్వరికీ తెలియదు, వేగులవారికి తప్ప.

బాలికకు 'కృష్ణ' అని పేరు పెట్టారు. ఈమె తరువాత పాండవులందరికీ వుమ్మడి భార్య అయింది. బాలుడికి - దృష్టద్యుమ్నుడు - అనే పేరు పెట్టారు. ఈతడు పాండవుల సేనానాయకుడయ్యాడు.

ఈ యిద్దరి పుట్టు పూర్వాలెవరికీ తెలియవు. వీళ్ళు అయోనిజులన్న సంగతే, ఎవరికీ తెలియదు. కాబట్టే వాళ్ళ పేరు మాసిపోయింది. బాలుడైన దృష్టద్యుమ్నుడు పాంచాలుడయ్యాడు. బాలిక - కృష్ణ - పాంచాలి అయింది.

ఇదే, సురల, అసురల, అయోనిజల పూర్వకథ. వివరంగా చెప్పాననుకొంటూ పొద్దుగూక వస్తుంది. పుత్రా! ఈ గోష్ఠి యింతటితో చాలిద్దాం. కాలకృత్యాలు తీర్చు కోవాలిగదా! గంగానదికి వెళదాం - అని సూత మహర్షి అన్నాడు.

నేను కూడా - సరే - అని సర్దుకొని బయలుదేరా.

# తొలి పలుకులు

"ఆర్యాః త్రైవర్ణికాః" ఆర్యులు మూడు వర్ణాలవారు - అని పూర్వులు కచ్చితంగా చెప్పారు. దీని అర్థమేమిటి, ద్విజులు - అని ఈ రోజు మనం పిలుస్తున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అనే మూడు కులాల వాళ్ళే ఆర్యజనులకు చెందినవాళ్ళని పూర్వుల అభిప్రాయం.

అట్లా అయితే, శూద్రులని కలగూరగంపగా ఈనాడు పిలవ బడుతున్న నాల్గవజాతి యెక్కడిది? వాళ్ళ పుట్టు పూర్వోత్తరాలెలాంటివి? ఎవరు వీళ్ళు? చాలా కాలం నుండి సామాన్యమైన హక్కులకు కూడా దూరమై వీళ్ళు నీచ దశలో వుండడానికి కారణమేది? స్మృతుల్లో చెప్పబడ్డ వీళ్ళ పుట్టుక గూర్చిన కథనం నిజమేనా? నిజంగా స్మృతులు వీళ్ళకిచ్చిన స్థానమేనా వ్యవహారికంలో చెల్లింది, చెల్లుతున్నది? స్మృతివాక్యాలకూ - ఆచారాలకూ భేదం ఎట్లా తటస్థించింది? స్మృతుల్లో విధించబడు ధర్మానికి వ్యతిరేకంగా దక్షిణ దేశంలో వీళ్ళకు ప్రజాపాలనం, సేనాపతిత్వం, మంత్రిత్వం ఎట్లా లభించాయి. ఈ అంశాలనన్నిటినీ పక్షపాతం లేకుండా, సాకల్యంగా, సహేతుకంగా, చర్చించటం మా విధి అని యిప్పుడు దానిని మొదలు పెడుతున్నాం.

పైన ఉదహరించిన గౌతమ ధర్మసూత్రాలలోని వాక్యాన్ని బట్టి, శూద్ర - అనే శబ్దంతో చెప్పబడే మానవులు - ఆర్యులు కాక, అనాచార్యులని స్పష్టంగా తేలుతోంది. అయితే, ఈ అనాచార్యులనేవాళ్ళు ఎవరు? రకరకాల శాఖలుగా - ఉపశాఖలుగా చీలిన

ద్రావిడులే ఈ శూద్రులు. ఆర్యులు ఈ దేశం మీదకు వచ్చి దండెత్తక ముందునుంచే ఈ దేశంలో నివసిస్తూ వున్నారు.

విదేశీయులూ - విజాతీయులు అయిన ఆర్యులు తమ దేశానికి వలస వచ్చినపుడు, ఎదుర్కొని, ప్రతిఘటించి ఎన్నో వందల సంవత్సరాలు హోరాహోరీగా వాళ్ళతో యుద్ధం చేసి, చేసి, ఆర్యుల దొడ్డిదారులను అరికట్టడానికి నడుంకట్టి, భూభాగమును నులివెచ్చని రక్తధారలతో తడిపిన మహావీరులు.

దైవం చిన్నచూపు చూడబట్టి, కపటులైన ఆర్యుల కుతంత్రాలకు - అవినీతి కార్యాలకూ చిక్కి పరాభవింపబడి వీళ్ళు ఉత్తర దేశం నుండి మరలి దక్షిణ దేశానికి రావలసినవారయ్యారు. వెనుదిరిగిన ద్రావిడ ప్రజలలోని క్షతగాత్రుల్ని, వికలాంగుల్ని, బందీలుగా పట్టుకొని ఆర్యులు వాళ్ళను బానిసలుగా చేసుకొన్నారు. లోబడ్డ ద్రావిడుల్ని కట్టుదిట్టాలలో వుంచి, ఇక రెండోసారి ఎప్పుడు ఇట్లా తిరుగుబాటు జరగకుండా వుండడానికి స్మృతులు ధర్మశాస్త్రాలు రాసి, వీళ్ళకు ధర్మాలను ఉపదేశించారు.

సమస్త హక్కులకూ దూరంగా వుంచి, అంటే దాదాపు సంఘం నుంచి వెలివేసినట్టుగా చేశారు. బానిసలుగా చేసుకున్న ద్రావిడులకు పై మూడు వర్ణాల వాళ్ళకు సేవ చేయడం విధి విహితమన్నారు. ఏ మాత్రం సంపద పోగుచేసుకొనే హక్కు లేదన్నారు. ఒకవేళ ఏ మాత్రం సంపాదించి వున్నా, ఆ సంపదనంతా బ్రాహ్మణుల పరం చేయమన్నారు. వీళ్ళ దగ్గర ధనం వుంటే దాన్ని బలాత్కారంగానైనా రాజు లాక్కోవటం ధర్మమన్నారు. ఇవన్నీ వుత్తరదేశంలో వున్న ద్రావిడుల స్థితిగతులు.

ఇది ఇట్లా వుంటే, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులుగా వున్న ఆర్యులలోని మూడు వర్ణాలవాళ్ళకూ హక్కుల విషయంలో వ్యత్యాసం కొంచెం కొంచెం ఎందుకేర్పడిందో, దీనిక్కారణమేంటో ఆలోచించాలి. దీన్ని పరిపూర్ణంగా తెలుసుకోవడానికి మూలసూత్రం వొకటుంది. ఆ విషయం వివరిస్తా. జాగ్రత్తగా ఆలకించండి.

స్మృతులను రాసిన పెద్దలు, ఈ మూడు భాగాల్లోని మానవులకు శరీర వర్ణం అంటే రంగు మూడు రకాలుగా వుంటుందని చెప్పారు. ఒక్క జాతిలోనే శరీరపు రంగులో ఈ భేదం రావటానికి కారణమేంటి? నిజంగా ఆయా భాగాలవాళ్ళు, ఆయా శరీరపు రంగు కలిగే వున్నారా? దీనికి - జాతి విభాగానికి - హక్కుల నిర్ణయానికి - సంబంధం ఏమన్నా వుందా? చర్చించి ఈ విషయాన్ని పరిశీలిద్దాం.

మా అభిప్రాయం ప్రకారం, ఆయా విభాగాలకు చెప్పబడ్డ శరీరాల రంగుకూ హక్కుల నిర్ణయానికీ కావలసినంత సంబంధం వుంది. శీతోష్ణ పరిస్థితుల వల్ల శరీరపు రంగు మారుతుందనే విషయం అందరికీ తెలిసిందే. బాగా చల్లని ప్రాంతాల్లో నివసించే వాళ్ళ శరీరం తెల్లగానూ, బాగా వేడి ప్రాంతాల్లో నివసించే వాళ్ళ దేహపు రంగు నల్లగానూ

వుంటుంది.

అందువల్లనే శీతల దేశవాసులైన ఆర్యులు ఎర్రగాను. ఉష్ణ దేశవాసులైన ద్రావిడులు నల్లగానూ వున్నారు. ఇందులో సృష్టి విచిత్రం ఏమీ లేదు.

హిమాలయ పర్వతాల పై భాగాన వున్న కైలాసంలో నివసించే శివుడు తెల్లని వాడని పురాణాల్లో వర్ణింపబడ్డది. తెల్లని దేహం గలవాళ్ళైన ఆర్యుల్లో రంగు భేదం ఎట్లా సంభవించింది. బ్రాహ్మణులు తెల్లని దేహం కలవాళ్ళని స్మృతికర్తలు నిర్ణయించారు. దీనికేమర్థం చెప్పాలి? ఈ విషయాన్ని వివరిస్తాం. శ్రద్ధగా వినండి.

ఆర్యులు తెల్లని శరీరాల రంగు గలవాళ్ళు. ద్రావిడులు నల్లటి శరీరం గలవాళ్ళు. ఆర్య ద్రావిడ రక్త సాంకర్యం వల్ల కలిగిన సంతానం యొక్క శరీరపు రంగు రకరకాలుగా వుంది. అంటే, తెలుపు గాక - నలుపు గాక - తెలుపుకీ నలుపుకీ మధ్యనున్న రంగులన్నీ అప్పుడప్పుడు బిడ్డల శరీరంలో కనిపిస్తూ వుంటాయి. ఈ కారణం వల్లనే ఆర్యుల్లో వర్ణభేదం ఏర్పడవలసి వచ్చింది. రంగు భేదంతో పాటు హక్కుల్లో కూడా తారతమ్య భావన అవసరమయింది.

అంతేగాని, కొంత మంది ఆధునికులు చెబుతున్నట్టు, సంఘ శ్రేయస్సు కోసం పని విభజన చేయబడ్డది అని చెప్పు మాట అర్థం పర్థం లేనిది; నిరాధారమైంది. నిర్మూలమైంది.

పైన చెప్పబడ్డ రహస్య భావాన్ని స్పష్టం చేయటం కోసమే దీనికి వర్ణ విభాగమని పేరు పెట్టారు.

వర్ణమంటే, శరీరపు రంగు; వర్ణ విభాగమంటే, రంగును బట్టి యేర్పడ్డ విభాగమని అనుమానం లేకుండానే స్పష్టమౌతోంది గదా! కాకపోతే, వితండం చేసే వాళ్ళకు ఏమీ చెప్పలేం. వాళ్ళకెట్లా నచ్చ చెప్పగలం?

హక్కుల విషయంలో తారతమ్యం ఎట్లా వచ్చిందో క్రింద వివరంగా చెపుతారు.

బ్రాహ్మణులు తెల్లని దేహం వాళ్ళు

బ్రాహ్మణ వర్ణం తెల్లనిది, అనగా ఆర్యుల దేహపు రంగు ఎట్లాంటిదో, బ్రాహ్మణుల శరీరపు రంగు కూడా అట్లాంటిదే. దీన్ని బట్టి చూస్తుంటే, బ్రాహ్మణ జాతిలో సాంకర్యం ఏమీ లేదని స్పష్టమౌతోంది. సంకరులుగాకుండా ఆర్యత్వం మూర్తీభవించినట్టున్న బ్రాహ్మణులు ఆర్యుల్లో పరిశుద్ధులుగా - పవిత్రులుగా - లెక్కింపబడ్డారు.

మహమ్మదీయ రక్త సాంకర్యం లేని చిత్తూరు రాణా వంశానికున్న గౌరవం ఇతర రాజపుత్ర కుటుంబాలకున్నదా? ఇది కూడా అట్లాంటిదే.

ఈ కారణం వల్లనే ఆర్యసంఘం బ్రాహ్మణులకు దాసోహమన్నది. సంఘాన్ని శాసించి నడిపే అధికారం వీళ్ళకే చిక్కింది. తప్పొప్పులను నిర్ణయించే పెత్తనం గూడా వీళ్ళ చేతికి చిక్కింది. విస్సన్న చెప్పిందే వేదమయింది. స్థిర-చర రూపంలో వుండే సంపదను

సంపాదించటం వాళ్ళ విధి కాదు. కాని, దాన్ని పరిపాలించటానికి - పంచిపెట్టడానికి సర్వాధికారం వుంది.

ఈ పద్ధతి మాత్రం అద్భుతమైన మేధావిశేషం వల్ల కూర్చబడింది.

సంపాదించలేకపోయామే... కూడబెట్టలేక పోయామే... అన్న దిగులు పడవలసిన అవసరం లేదు. ఇంటిలో పొయ్యి రాజుకోలేదే - అనే బెంగ పడవలసిన పని కూడా లేదు. ఏ రోజుకారోజు కావలసిన పదార్థాలతో బ్రాహ్మణుల ఇళ్ళను తక్కిన సంఘం ఓలలాడిస్తుంది.

ఔరా! చూచితివా! పూర్వం బ్రాహ్మణుడు సంఘ శ్రేయస్సు కోసం ఎంతెంత భయంకరమైన కష్టాలుపడ్డాడో?

## రాజులు (క్షత్రియులు) ఎర్రని దేహం కలవాళ్ళు

ఎక్కువ భాగం ఆర్య రక్తం చాల తక్కువ భాగం ద్రావిడ రక్తం కలవటం వల్ల ఎర్రని శరీరం ఏర్పడుతోంది. కాబట్టే బ్రాహ్మణుల కన్నా అధికారంలో కొంచెం తక్కువగా, తక్కిన అధికారమంతా బ్రాహ్మణుల్లాగానే క్షత్రియులకూ వుంటుంది. యజనం - యాజనం - అధ్యయనం - అధ్యాపనం - దానం - ప్రతి గ్రహీతం - అనే ఆరు కర్మల్లో ఒక్క ప్రతిగ్రహీతం - అనే కర్మ తప్ప తక్కిన కర్మలన్నీ క్షత్రియునికీ వున్నాయి.

## వైశ్యులు పచ్చని దేహులు

వాళ్లు క్షత్రియుల కంటే ఎక్కువ రక్త సాంకర్యం కలవాళ్ళు. అంటే, క్షత్రియులకంటె ఎక్కువ ద్రావిడ రక్తం కలవాళ్ళు. అందుకనే, పసుపు వర్ణం వచ్చింది. పై ఇద్దరి కంటే వీళ్ళ అధికారం చాలా సంకుచిత మైంది. పైన చెప్పిన ఆరు కర్మల్లో - అనగా - యజన - యాజన - అధ్యయన - అధ్యాపన - దాన - ప్రతి గ్రహీతాలు - అనే కర్మల్లో వైశ్యులకు యాజనం, అధ్యాపనం, ప్రతి గ్రహీతం - అనే కర్మలు ఆచరించటానికి హక్కులు లేవు.

ఇక, ఇంతకంటె ఎక్కువ ద్రావిడ రక్తం వున్న వాళ్ళంతా ద్రావి దులుగానే చూడబడ్డారు.

ఇక్కడ వొక విషయం వివరించాలి. పుట్టిన బిడ్డ యొక్క జాతిని నిర్ణయించవలసి వచ్చినపుడు బీజ క్షేత్రములలో బీజమునకు, అంటే తండ్రికే ఆ రోజుల్లో ఎక్కువ ప్రాధాన్యం ఈయబడ్డది. అందువల్లే, పల్లెదాని యందు పరాశరుడనే వాని పుట్టిన బిడ్డ తండ్రినిబట్టి బ్రాహ్మణుడే అయ్యాడు. చండాల స్త్రీ అయిన అరుంధతి (అక్షమాల) యందు పుట్టిన శక్తి మహాముని తండ్రిని బట్టి బ్రాహ్మణుడే అయ్యాడు.

ఆనాడు, ఈ రోజుల్లో లాగా తల్లిని బట్టి గాక, తండ్రిని బట్టే సంతానం యొక్క

ప్రాధాన్యం వుండేది. అంటే క్షేత్రానికి గాక బీజానికే ఎక్కువ ప్రాధాన్యం ఈయబడేది.

పెళ్ళి పేరంటాళ్ళు లేని చాలామంది ఋషులు - ఇంగ్లీషు భాషలోని లోకోక్తిలాగా - Sowers of wild oats- గా వున్నారు. ఇందువల్లే ఎన్నో అవాంతర జాతులు ఏర్పడడానికి, వీళ్ళు కారణభూతులయ్యారు.

# ద్రావిడులు నల్లని శరీరం కలవాళ్ళు

ఆర్యులచే ఓడింపబడ్డ ద్రావిడులకు బానిసత్వము తప్ప, వేరే హక్కులు లేకుండా పోయింది. పరువు ప్రతిష్ఠలు మటుమాయమయ్యాయి. ఆర్యులు మితిమీరిన అహంకారంతో ద్రావిడులతో పొత్తు పెట్టుకోవటానికి యిష్టపడక, బాగా తిరస్కారాన్ని చూపించారు. చెప్పటానికి వీల్లేని కట్టుదిట్టాలేర్పాటు చేసి, ద్రావిడుల్ని దూరదూరంగా వుంచారు. ఆ కట్టుబాటులను దాటి యేర్పడ్డ పెళ్ళిళ్ళ వల్ల కలిగిన సంతానాన్ని, హీనజాతులుగా కొన్నిటిని సృష్టించి వాటిల్లోకి నెట్టారు. ఈ జాతులకు సుగతులు లేవని చెప్పారు. ఇది ఆర్యావర్తంలోని కథ.

# దక్షిణాపథం

దక్షిణ దేశంలో వైశ్యులనబడేకోమట్లు, ఎప్పుడు కూడా కర్షకులుగాగాని, గోపకులుగా గాని లేరు. వీళ్ళ శరీరం పచ్చని రంగులో వున్నట్టుగా కూడా ఎప్పుడూ లేదు.

వెలమ, కమ్మ, రెడ్డి మొదలగువారు సేవావృత్తిలో లేరు. స్మృతులు చెప్పిన - 'సచ్ఛూద్రోగోపనాపితౌ' అనే అనుశాసనాన్ని ద్రావిడ లోకంలో దక్షిణ దేశంలో ఏనాడు ఎరుగదు.

నాపితులను (మంగలులు) తాకిన స్నానము చేయకుండుట సంప్రదాయ విరుద్ధం. ఇంతేకాకుండా మృతాశౌచములందు చనిపోయినప్పుడు పాటించే (సూతకం) స్మృతి నియమాలకు విరుద్ధాలైన ఆచారాలు, స్మార్తశూద్రులుగా చెప్పబడే వెలమ-కమ్మ-రెడ్డి జాతుల్లో సుప్రసిద్ధాలు. దీని వల్లనే స్మృతుల పెత్తనం దక్షిణ దేశంలో ఏనాడూ ప్రచారం పొందలేదని చెపుతున్నాం.

గౌతమ ధర్మ సూత్రాలు మొదలు - పరాశర స్మృతి వరకూ గల స్మృతుల్లో ఎక్కడా, చెంచుజాతి దప్ప, ద్రావిడ జాతులేవీ పేర్కొనబడలేదు. మను స్మృతిలో మాత్రం ఆంధ్రులు మ్లేచ్ఛులుగా లెక్కించబడి గ్రామ బహిష్కృతులయ్యారు. ఈ -'ఆంధ్రులు' తెలుగువారు కాదు.

ఆంధ్రుల మాతృభాష ప్రాకృతం. తెలుగువారి మాతృభాష 'తెలుగు'. ఆంధ్ర భాషా లిపి, నాగర లిపిగా వుంటుంది. వ్యాకరణ కర్తలు, వ్యాకరణం తెలిసిన వాళ్ళూ -

తెలుగు భాషను - వికృతి - అని అన్నారు. ఇది చాలా ప్రమాదమైంది. అంటే, సంస్కృతం ఎట్లా స్వతంత్రమైన భాషో, అట్లాగే తెలుగు కూడా స్వతంత్రమైన భాష. అంతేగాని, తెలుగు సంస్కృత భాష నుంచి పుట్టింది గాదు, కాలక్రమంలో చాలా సంస్కృత భాషా పదాలు, ప్రాకృత భాషా పదాలు తెలుగులో ప్రవేశించాయి. సంస్కృత, ప్రాకృత భాషలు ప్రవేశించటం వల్ల తెలుగు కొంత వికారం పొందింది. ద్రావిడ భాషా పదాలు కూడా కొన్ని సంస్కృత భాషలోకి ప్రవేశించాయి.

తెలుగు భాషలో కనిపించే, ఈ వికారం - అంటే మార్పు, కొంతమంది సంస్కృత భాషాభిమానులైన పండితులచే, తెలుగు భాష సంస్కృత ప్రాకృతాల నుంచి పుట్టిందనీ - తెలుగు సంస్కృత ప్రాకృతాలకు వికృతి అని భావం కలిగేట్టు చేసింది.

క్రీస్తు పూర్వమే, ఆంధ్రులు తెలుగుదేశాన్ని జయించి, రాజ్యం పాలించి, కాలబాధితులయి, రాజ్యాన్ని కోల్పోయి తెలుగు ప్రజల్లో కలిసిపోయారు.

కాబట్టే ఆంధ్రుల శరీరపు రంగు రకరకాలుగా వుంటుంది. బాపన తెల్లరంగు మొదలు కారునలుపు రంగు వరకు గల అనేకమైన రంగులు కలిగి ఆంధ్రుల దేహపు రంగు విలసిల్లుతూ వుంటుంది. ఘూర్జర దేశం మొదలు, తెలుగునాటి వరకు ఆంధ్రుల శిలా శాసనాలు ప్రాకృత భాషలోనూ, ప్రాకృత లిపిలోనూ అక్కడక్కడా కనిపిస్తున్నాయి. ఆనాటి నుంచి, ఈనాటి దాకా - ఆంధ్ర శబ్దం - తెలుగు శబ్దానికి పర్యాయపదమై పోయింది. నేటికిది చరిత్రాంశమై పోయింది, వేదం పాటించదగ్గది కాదు.

ఆర్యులు బహు శ్రద్ధతో - దూరదృష్టితో - ద్రావిడులతో వివాహ సంబంధాలు నిషేధించారు. అందులో ముఖ్యంగా, ఆర్య స్త్రీలకూ - ద్రావిడ పురుషులకూ జరిగే పెళ్ళిళ్ళు పాపహేతువులని శాసించారు.

అట్లా జరిగిన వాళ్ళకు కలిగిన సంతానాన్ని సంఘ బహిష్కృతులుగా చేయటానికి, చండాల - మొదలైన జాతుల్ని సృష్టించి అందులో చేర్చారు.

కాని, ఆర్య పురుషులకూ - ద్రావిడ స్త్రీలకూ వివాహాలు సంపూర్ణంగా నిషేధించినట్టు కానరాదు. మునిశ్రేష్ఠుడైన వసిష్ఠుడు చండాల కన్యయైన అక్షమాలను వివాహమాడాడు. ఈ పెళ్ళిని ఆర్య జాతి వాళ్ళెవరూ కాదనలేదు. వసిష్ఠుణ్ణి దూషించలేదు. ఇట్లాంటి పెళ్ళిళ్ళ వల్ల వర్ణభేధం గల మనుషులు చాలామంది కనిపిస్తూ వుంటారు.

ద్రావిడ వ్యక్తి, ఆర్య స్త్రీతో వ్యభిచరించిన యెడల విధింపబడు శిక్ష ప్రాజ్ఞలోకానికి కోపం పుట్టించకుండా వుండదు. ఆర్య ద్రావిడులు సమాన నింద్యులయినప్పుడు విధింపబడే శిక్షలో భేదం చాలా వుంటుంది. ఋషులను కూడా జాత్యహంకారం జాతి వైరం, ధర్మ దూరులను చేయటం సంతాపకరమే.

మూడు, నాలుగువేల సంవత్సరాలనాడు, ఆర్యావర్తంలో ప్రదర్శించబడ్డ నాటకమే,

ఈనాడు - 'అమెరికా' దేశంలో ప్రదర్శించబడుతూ వుంది. ఆనాటి ఆర్యావర్తం - నేటి అమెరికా అయింది. మూడు, నాలుగు వేల సంవత్సరాలు కడచినప్పటికీ, ఆర్య మంత్రాంగంలో ఏ మాత్రం మార్పు రాలేదు.

హిందువులైన ఆర్యుల స్మృతులను పరీక్షించి, అమెరికనులు నీగ్రోల యెడ చూపుతున్న దుస్సహమైన ప్రవర్తనను పరిశీలిస్తే, ఇందులో ఏ మాత్రం భేదం కనపడదు. సరిగదా - అచ్చు గుద్దినట్టు అదే ధర్మం కనిపిస్తుంది. దేశకాల పాత్రాల వల్ల కలిగిన కొంచెం భేదం మాత్రం మనకు కళ్ళకు కడుతుంది.

ఆర్యావర్తంలో ద్రావిడులు ఓడిపోయినా, కొన్ని రాజ్యాలు అట్లాగే నిలచి వున్నాయి, బాహుశాలులైన ద్రావిడ వీరులు దక్షిణాపథంలో ఆర్యులు కాలు పెట్టకుండా వుండేట్టు చూస్తూ, వాళ్ళను వెంటబడి తరుముతూనే వున్నారు.

అమెరికాలో వున్న నీగ్రోలు బానిసలుగా పోయి, అమెరికనుల కరుణా కటాక్షాల వల్ల ఏదో విధంగా స్వాతంత్ర్యాన్ని సంపాదించినవాళ్ళు కావటం చేతా, నీగ్రో రాజులు లేకపోవటం వల్లా - అమెరికాను ఎదుర్కొనే సోదరులు నీగ్రోలలో లేకపోవడం వల్లా - అమెరికను ఆర్యుల నిరంకుశాధికారం శతాధికంగా, నిరాటంకంగా సాగుతోంది.

హిందువులైన ఆర్యులు కొన్ని నియమాలేర్పరచుకొని, బూటకపు విచారణనైనా జరిపి ద్రావిడులకు కఠిన దండనను విధించాడు. అంటే ఏదో విధంగా తాము శాసనబద్ధులైనట్లు ఇక్కడి ఆర్యులు నటించారు. ఇక అమెరికాలో చూద్దామా - విచ్చలవిడిగా చెలరేగి, దోషి అని చెప్పబడ్డ నీగ్రో వ్యక్తిని, ఏ రకమైన విచారణ లేకుండానే, తప్పు నిర్ధారణ చేయకుండానే, యేచెట్టుకో - ఉరికంబానికో వ్రేలాడగడతారు. అక్కడి నీగ్రోల దురవస్థ చెప్పరానిది. న్యాయస్థానం లేదు, రక్షక భటులు లేరు. దైవం అంతకు ముందే లేదు.

దారినపోయే వాళ్లంతా, తమ వద్ద వున్న రివాల్వరుతో ఒకటి రెండు గుండ్లను ఆ నిర్భాగ్యుడి మీదకు వదలుతూ వుంటారు. ప్రతి సంవత్సరం ఇట్లాంటి దుర్మరణాలు చాలా జరుగుతూ వుంటాయి. దీన్నే 'Lynching' అని అంటారు.

ఇట్లాంటి మానవ పిశాచాలను ప్రభుత్వమైనా శిక్షించటం లేదు. పరస్పరం అంగీకారంతో అయినా, నీగ్రో పురుషుడు అమెరికను తెల్లటి స్త్రీతో వ్యభిచరిస్తే - 'Lynching' జరుగుతుంది. కాని బలవంతంగా, అమెరికను పురుషుడు నీగ్రో జాతి స్త్రీతో వ్యభిచారం చేస్తే విచారణ లేదు; శిక్ష లేదు.

భగవంతుడు నిష్పక్షపాతియని - సర్వాంతర్యామి అనీ- చెపుతారే? ప్రతిఫలం లేకుండా, ఇట్లాంటి ఘాతుక కృత్యాలు నిరంతరాయంగా వందల కొలది సంవత్సరాలు ఎట్లా సాగుతున్నాయో ఎవ్వరికి తెలుస్తుంది? దక్షిణాఫ్రికాలో గూడా ఏ కొద్ది భేదంతోటో అట్లాంటి భయంకర పరిస్థితులే తెల్ల - నల్లజాతుల మధ్య సాగుతున్నాయి.

# ఆర్య మంత్రాంగం

ఆర్యులు తమ కార్య సాఫల్యం కోసం, ఎట్లాంటి సాధనాలనైనా వుపయోగించడానికి వెనుకాడరు. చాలాసార్లు ఆడవాళ్ళనుపయోగించి కార్యం నెరవేర్చుకొన్నారు. కాని, తరచుగా ద్రావిడ రాజులను పదవి నుంచి తొలగించడానికి, కుటుంబ కలహాలు కల్పించి - రాజద్రోహులను సృష్టించి - తమ కార్యాలను నెగ్గించుకొంటూ వచ్చారు.

సుగ్రీవుణ్ణి దగ్గరకు తీసి, వాలిని చంపి, వానర రాజ్యాన్ని తమ సామంతరాజ్యంగా చేసుకొన్నారు, హిరణ్యాక్షుడి ఇంటిలో పోరుపెట్టి, ప్రహ్లాదుణ్ణి చీలదీసి అతని తండ్రి హిరణ్యకశిపుణ్ణి చంపి, ప్రహ్లాదుణ్ణి నామమాత్రపు రాజును చేసి, ఆ రాజ్యంలో పలుకుబడి సంపాదించుకొన్నారు.

రాజ్యంపై కోరిక పుట్టించి, విభీషణుణ్ణి దగ్గరకు తీసి రావణుణ్ణి కూల్చి లంకా రాజ్యాన్ని హరించారు, సత్యనిరతుడూ-ధర్మనిరతుడూ అయిన బలిచక్రవర్తిని, జారుడూ - భ్రాతృహంతకుడూ అయిన యింద్రుని కోసం మాయోపాయంతో చంపారు.

ఆర్యులు తమ కార్యాన్ని సాధించుకోవటం కోసం ఎంతటి నీచకార్యం చేయటానికైనా భయపడరని చెప్పటానికి ఈ క్రింది కథ చదివితే తేటతెల్లమవుతుంది.

శత్రువులు తేరిపార చూడటానికీ, ప్రవేశించటానికీ వీలులేని దుర్భేద్యమైన కోటను కట్టుకొని త్రిపురాసురులు నిశ్చింతగా రాజ్యం చేస్తూ వున్నారు.

ఆర్యులు త్రిపురాసురుల్ని జయించలేక, వాళ్ళ వైభవాన్ని చూసి కన్నుగుట్టి భరించలేక శాంతి లేకుండా వున్నారు. త్రిపురాసుర భార్యలు మహా పతివ్రతలు; ధర్మపరాయణులు.

ఎన్ని విధాల ప్రయత్నించినా, ఆర్యుల వేగు పని వల్ల లాభం కలుగలేదు. దాని వల్ల ఆర్యుల మనస్సు కలత చెందింది. కలత చెందిన మనస్సుతో ఆర్యులు బుద్ధుణ్ణి త్రిపురాసుల భార్యలను జేరి, వాళ్ళ శీలం చెరచి, ధర్మచ్యుతల జేసి, వాళ్ళ వల్ల రహస్యం తెలుసుకొని రమ్మని ప్రేరేపించి పంపారు.

(ఇక్కడ బుద్ధుడంటే, గౌతమ బుద్ధుడు కాదు. పౌరాణిక బుద్ధుడు. విష్ణువే బుద్ధావతారం ధరించాడు. బౌద్ధ ఉద్యమాన్ని నడిపిన శాక్య వంశ బుద్ధుడు. ఇతడు దశావతారాల్లోని వాడు కాదు. దశావతారాల్లో వున్న బుద్ధుడే త్రిపురాసుల కార్యాలను వంచించిన అవినీతి పరుడు. ఇతడు విష్ణువు అవతారం అని పురాణాల్లో వుంది.)

అట్లా ఆర్యులచే ప్రేరేపింపబడి, త్రిపురాసుల భార్యల దగ్గరకు పోయిన బుద్ధుడు, ఎన్ని దినాలో వేచి వేచి, ఎట్లాగో వాళ్ళను ఏకాంతంగా కలుసుకొని, పాషండమతం బోధించి, వేదబాహ్యులను చేసి, లోబరచుకొని, గుట్టు తెలుసుకొని తిరిగి వచ్చాడు.

ఆ తరువాత ఆర్యులు దండెత్తి, త్రిపురాలను ముట్టడించి, గుట్టు తెలిసినవాళ్ళు

కాబట్టి శ్రమలేకుండా త్రిపురాసురుల్ని ఓడించి, వాళ్ళ పట్టణాలను ధ్వంసం చేసి, జిల్లేడు విత్తనాలు చల్లారు.

# రణనీతి

శ్రీరాముడు వాలిని చూచి భయపడి, ప్రాణాలెగిరిపోతూ వుంటే, పంచప్రాణాలలో ఒక ప్రాణం మిగిలివుండగా, చెట్ల మాటున దాగి, ఒక అమోఘమైన బాణం తొడిగి, వొంటివాణ్ణి, తమ్ముడితో మైమరచి, యెక్కటి యుద్ధం చేస్తున్నవాణ్ణి, జంకూ గొంకూ లేకుండా సిగ్గుమాలి చంపాడు.

చిట్టచివరి యుద్ధంలో రావణుడితో పోరి పోరి, డస్సి అధర్మమని తెలిసి కూడా, రావణుడి బొడ్డులో అమృతకలశం వుందనే వంక కల్పించి, రాముడు ఆ వీరుడి బొడ్డుపై కొట్టి చంపాడు.

సత్యైక నిరతుడు - నిష్కపటీ అయిన బలి చక్రవర్తిని ఓర్వజాలక వరమనే నెపంతో ఒక - పొట్టివాడిచే నెత్తిపై కాలు పెట్టించి పాతాళానికి దిగదొక్కించారు.

భీముడు-అర్జునుడు - కృష్ణుడు - ముగ్గురూ ఏకమై రాత్రిపూట, శివ పూజలో నిమగ్నుడైన జరాసంధుణ్ణి, ఒంటిగా వున్నవాణ్ణి, నిరాశ్రయుణ్ణి చేసి చంపారు.

ఇట్లాంటి వెన్నో నిదర్శనాలు చూడవచ్చు; ఇక రామాయణ కథానాయకుల గూర్చి కొంత చర్చించుదాం.

# రాముడు

పితృవాక్య పరిపాలకుడనీ, ఏకపత్నీవ్రతుడనీ పూర్వులు చెప్తారు. రావణుడు లోక కంటకుడనీ, అతణ్ణి చంపాడు కాబట్టి అవతార పురుషుడనీ రాముణ్ణి కొనియాడారు.

# రాముడు పితృవాక్య పరిపాలకుడేనా?

కృతజ్ఞతా పూర్వకంగా ఇచ్చిన రెండు వరాల వల్ల ఏకాంగియై రాముడు పధ్నాలుగేళ్ళు వనవాసం చేయటం - భరతుడు పట్టాభిషిక్తుడు కావటం అభిలషించి కైక దశరథుణ్ణి అర్థించింది. దశరథుడు కూడా పిడుగుపడ్డట్టయి అవునని కానీ, కాదని కానీ చెప్పకుండా చింతతో ఒడలు తెలియక నోటికొద్దీ కైకను తిట్టి తిట్టి మూర్ఛపోయాడు.

రాముడు వచ్చి జరిగినదంతా కైకవల్ల విని వనవాసానికి పయనమయ్యాడు. అనుయాయి అయిన లక్ష్మణుడు రాకమాననని చెపితే అర్ధాంగి అయిన సీత తన్ను తీసుకుపోవలసిందని కంట తడిపెట్టి బ్రతిమిలాడితే - ఆ యిద్దరినీ వెంటబెట్టుకుని రాముడు వెంటనే ప్రయాణం చేశాడు.

దశరథుడు రాముడికి ఏమీ చెప్పలేదు. కైక గూడా రాముణ్ణి వొక్కడినే అడవికి పొమ్మంది. ఇద్దరితో కలిసి అడివికి పోయాడు.

మేనమామ యింటి నుండి తండ్రి మరణవార్త విని, భరతుడు సాకేతానికి వచ్చి, తల్లి వలన సమస్త వృత్తాంతం తెలుసుకొని, అక్కడ వుండలేక, చిత్రకూటంలో వున్న శ్రీరాముడి దగ్గరకు వచ్చి, తిరిగి సాకేత నగరానికి ఏతెంచి, పట్టాభిషేకం చేసుకొమ్మని నొక్కి నొక్కి ప్రార్థించాడు.

శ్రీరాముడు ఇతర కారణాల వల్ల, ఇష్టంలేనివాడై, రాజ్యం తన చేతి నుంచి జారిపోకుండా వుంచాలని నిశ్చయించినవాడై, వెర్రివాడైన భరతుడికి నచ్చచెప్పి, తన బదులుగా పాదుకలు అతనికిచ్చి పంపాడు.

దశరథుడు కైకకిచ్చిన రెండు వరాలూ ఈ విధంగా రాముడు తీర్చాడు. రాముడు 'పితృవాక్యపరిపాలన' - అనే నెపంతో... ద్రావిడ లోకాన్ని జయించి, తన రాజ్యాన్ని విస్తరింప చేసుకోవటానికి దక్షిణాపథానికి వచ్చాడు; అంతేగాని ఇంకోటి గాదు.

నిష్కారణంగా మునుల యెదుట రాక్షసవధ చేస్తానని శపథాలు పలికిన రాముణ్ణి చూచి, సీత భయపడి - 'ఇట్లాంటి శపథాలు ఎందుకు చేశారని' ప్రశ్నిస్తే, రాముడు సీతతో ఇట్లా చెప్పాడు.

'నేను కైకేయీ పరవ్యాజంబున (నెపంతో) వనంబునకు చను దెంచితి -

(గోపీనాథ రామాయణం - మొదటి సంపుటం- 40వ పేజీ)

# రాముడు ఏకపత్నీవ్రతుడేనా?

ఆ రోజుల్లో ఒకే పురుషుడు ఎక్కువమంది భార్యలను చేసుకోవటమనే బహు భార్యాత్వాన్ని పండితులెవ్వరూ గౌరవించేవాళ్ళు కాదు. బహుభార్యాత్వమనే ఆచారం ముందటితరంతోనే ముగిసిపోయింది. లక్ష్మణ, భరత- శత్రుఘ్నులు కూడా ఏకపత్నీవ్రతులే.

ఔరా! రాముడు భగవదవతారం. సీతాదేవి ఆయన అర్ధాంగి. సీతతో సమానమైన దాంపత్య సౌఖ్యం అనుభవించినవాళ్ళు ఈ ప్రపంచంలో ఎవరున్నారు? పెళ్ళి అయింది మొదలు రాముడు ప్రతి నిముషమును ఆమె పాతివ్రత్యాన్ని - అంటే శీలాన్ని శంకిస్తూనే వున్నాడు. రాముడికి మనశ్శాంతి యెన్నడు వున్నట్టు తోచదు. పైకి మాత్రం శంకిస్తున్నట్టు కనపడక, ఏ చాకలి మీదనో, ఏ పామర లోకంమీదనో నెపం పెట్టి, నింద మోపి, అది నిజం కాదని ఋజువు చేసే భారం సీత నెత్తిమీదనే పెడుతూ వుంటాడు.

ఔరౌరా! ఇదేనా, ఏకపత్నీవ్రతుడి లక్షణం?

సీత లంకలో అగ్నిపరీక్ష చేసి తన పాతివ్రత్యాన్ని గూర్చి, తనకూ, లోకానికి సందేహ

నివృత్తి చేసింది. ఇంతటితో ఆ పరీక్ష ముగియలేదు. సందేహం తొలగలేదు. శ్రీరాముడు నిండుచూలాలిని మోసగించి, కారడవిలో వదలిపెట్టించాడు. ఈ కార్యం, పచ్చి నెత్తురు తాగే కటికవాడయినా చేయటానికి సాహసిస్తాడా?

ఏదో రకంగా, అడవిలో వున్న సీతాదేవి, మున్యాశ్రమం నుంచి అయోధ్యకు తీసుకురాబడ్డది. రాముడి యెదుట నిలుపబడ్డది. మళ్ళా ఎప్పటి పాటే...!

అనుమానం వదిలించమని రాముడు సీతను కోరాడు. సీత మనస్సు చివుక్కుమన్నది. ఎప్పుడూ అనుమానంతో వుండే భర్తతో కాపురం చేయటానికి సిగ్గుపడి, అసహ్యించుకొని సభలోనే అనేక మంది చూస్తూ వుండగా భూగర్భంలో ప్రవేశించి ఆత్మహత్య చేసుకొన్నది.

లోక కంటకుడయిన రావణుణ్ణి సంహరించడానికి భగవంతుడి రూపంలో భూమిపై అవతారమెత్తాడంట! నిజమే; ఎత్తితే ఎత్తాడేమో? ఆర్య లోకానికి రావణుడు కంటకుడు. రాక్షస (ద్రవిడ) లోకానికి రాముడు కంటకుడు. వీళ్ళద్దరిలో ఎవ్వరు ధర్మపరులని యెవరు నిర్ణయిస్తారు?

ఔరంగజేబు హిందూ లోకానికి కంటకుడు. ఛత్రపతి శివాజి మహమ్మదీయ లోకానికి కంటకుడు.

రావణుడు సర్వలోక కంటకుడని చెప్పటం వితండవాదం. విజ్ఞులెవ్వరూ వొప్పుకోరు. రావణుడి ధ్వజపటం క్రింద ద్రావిడ లోకమంతా కడుపులో చల్ల కదలకుండా కాలక్షేపం చేసింది. లంకా రాజ్యం సమస్త ఐశ్వర్యాలతో తులతూగుతూ వుంది. ఆర్యులెరుగని ఆకాశ విమానములను నిర్మించే నైపుణ్యం ద్రావిడ శిల్పులెరుగుదురు.

ఒక్క ఆకాశ విమానములే కాదు; ద్రావిడ శిల్పులు ఆకాశ పట్టణాలను గూడా నిర్మించారు. సౌంభకము దీనికి నిదర్శనం. ఆర్యకవులు గూడా అంటే మునులు కూడా కొంతవరకు రాముడి నిజతత్త్వం ఎరుగుదురు. తెలిసే రాముణ్ణి, మాయామానుష విగ్రహుడని అన్నారు. అంటే, తెలివితేటలు లేని మానవుడని అర్థం. రాముడు మునుల నుండి పంచాంగం వినేవాడే గాని, ఇతరులకు పంచాంగం నేర్పగలిగిన వాడు కాదు.

# రావణుడు దశగ్రీవుడేనా?

# (పదితలలు కలవాడా)

రావణుడికి పది కంఠాలున్నాయా...! అనే సందేహాన్ని చాలా మంది వాదోపవాదాలుగా చర్చించారు. కొంతమంది ఇది అసంభవమన్నారు; సహజ విరుద్ధమనీ చెపుతున్నారు. కాని, ఈ ప్రచారం ఎందుకు వచ్చిందో చెప్పలేకపోతున్నారు.

ఇటీవల బాగా పరిశోధన చేసినవాళ్ళు. తన పరిశోధన చేత – రావణుడు 'కోయదొర'

- అనీ, లంకా వాసులంతా కోయలనీ తేలింది. రావణుడి మాతృభాషయైన కోయభాషను పరిశీలిస్తే, సంస్కృత శబ్దములని భ్రమ పడుతున్న కొన్ని శబ్దములకు, సంస్కృతంలో సరైన అర్థం చెప్పలేని కొన్ని శబ్దాలకు చక్కగా అర్థాలు స్పష్టపడుతున్నాయి.

అట్లాంటి శబ్దాలను కొన్నిటిని ఇక్కడ వివరిస్తాం.

# రావణుడు

ఈ శబ్దానికి సంస్కృత భాషలో, బొబ్బ పెట్టువాడు - అని అర్థం చెప్పబడుతుంది. అనగా, రావణుడు పుట్టినపుడో - తరువాతనో పెద్ద పెద్దగా బొబ్బలు పెట్టాడట. ఇక, కోయ భాషలో ఈ శబ్దానికి ఏ అర్థం వుందో చూద్దాం.

రావణ = రావ + అన - కోయ భాషలో -రవ -

అంటే, ఏడ్చుట.

| | | |
|---|---|---|
| కోయ - | తెలుగు | కన్నడం |
| రవ | రవ్వ | రావ |

రవ- అనే మాట, -రావ అని అయింది. దీని అర్థమేమంటే - ఇతరులను ఏడ్పించటంలో మిగుల పరాక్రమం కలవాడు.

రావ+అన - రావన - ఇతరుల్ని ఏడ్పించటంలో మిక్కిలి పరాక్రమం కలవాడు అని అర్థం.

దశగ్రీవుడు: సంస్కృతంలో ఈ శబ్దానికి- పది కంఠాలు కలవాడు అని అర్థం చెప్పబడుతుంది. కోయ భాషలో - దస - గీవ - అనే మాట వుంది.

దస - అంటే, బాధ;

గీవ - అంటే, కలుగజేయుట.

గీవ - శబ్దం ప్రేరణార్థంలో వుపయోగింపబడుతూ వుంటుంది.

ఈ - దస గీవ - శబ్దం - దశగ్రీవ అయింది. 'పది మెడలు' అనే అర్థాన్ని సంపాదించుకొంది.

# దశాస్యుడు

పది మొగములు కలవాడని అర్థం.

కోయ భాషలో దస + అసి - అనగా బాధ; అసి - పుంలింగాన్ని తెలియజేసేది. బాధను చేయువాడని తేలుతుంది.

దస+అసి - దశాసి; దశాసి - ద శాస్యః - దశాస్యుడు.

# రక్షస్సులు - రాక్షసులు

సంస్కృత భాషలో వీటికి సరిపడే అర్థాలు లేవు, కాబట్టి, నిఘంటువులు రాసినవాళ్ళు, ఎవరికి తోచిన అర్థం వాళ్ళు రాసారు. అంటే వివిధ రకాల నిఘంటు రచయితలు వివిధ రకాలుగా రాశారన్నమాట.

| | | |
|---|---|---|
| కోయ | తెలుగు | కన్నడం |
| రాకు | రక్కు | రాక |
| గందరగోళంచేయుట | గిల్లుట | బాధించుట |

రాక + అసి - రాకాసి; రక్కు + అసి - రక్కసి

ఈ రెండు శబ్దాలను సంస్కృతంగా మార్చి, రాక్షసులుగానూ, రక్షస్సులుగానూ –చేశారు.

రావణుడికి పది కంఠాలు గాని, పది మెడలు గాని, యెట్లా వచ్చాయో పైన చెప్పిన శబ్దార్థాలను బట్టి స్పష్టంగా బోధపడుతుందని వూహిస్తున్నాం.

పది మొగాలు - పది కంఠాలు - ఉన్న వాళ్ళకి, ఇరవై చేతుల్ని కవులు ఎందుకు సృష్టించగూడదు? అట్లా సృష్టించడం సహజమేనని మేమభిప్రాయపడుతున్నాం.

# కోయలు రాక్షసులేనా?

రక్షో, రాక్షస - శబ్దాలకు మూలాలై, రక్కసి, రాకాసి - అనే శబ్దాలకు, రామాయణంలో చెప్పబడ్డ, రావణ పక్షయోధుల పేర్లకూ, చాలావరకూ అంటే - రావణ - దశాస్య - దశ గ్రీవ - శూర్పణఖ - మొదలైన అర్థాలు కోయభాషలో కనిపిస్తున్నాయి.

కోయలు యుద్ధానికి పోయేటప్పుడు, శత్రువులకు భయంకరంగా కనిపించటం కోసం, తమ ముఖాలకు కృత్రిమంగా భయంకర ఆకారం గల తొడుగుల్ని ధరించే ఆచారం ఒకటి వుంది. రామాయణంలో వర్ణింపబడ్డ రాక్షసుల వికార రూపాలకు ఇదే కారణం.

రావణుడు కోయవాళ్ళను క్రమశిక్షణ కలవాళ్ళుగా చేసి, ధర్మమార్గం తొక్కించి, ఉన్నత స్థానానికి తీసుకొని వచ్చాడు. ఈ ఉన్నత దశ వేళ్ళు పారి నిలదొక్కుకోవడానికి చాలాకాలం దాకా వీలు చిక్కలేదు.

రావణ వధతో ఆ జాతి పతనం తటస్థించింది. కుక్షింభరుడైన విభీషణుడికిది పట్టలేదు. కాబట్టి, నాగరిక ప్రపంచంలో కోయలు, పూర్వ స్థానానికి పోయారు.

అరేబియా దేశంలో మహమ్మదు జన్మించి, దేశదిమ్మరులుగా వున్న అరబ్బుల్ని, ఎంతో ఉచ్చస్థానానికి తీసుకుపోయాడు. ఈనాడు తిరిగి అరబ్బులు మునుపటి స్థానానికే

చేరారు. ఇట్లాంటి స్థితే, లంకా రాజ్యంలో కూడా సంభవించిందని తలుద్దాం. ఇతర జాతులవాళ్ళు కోయలను, రక్కసులనీ, రాక్షసులనీ - పిలుస్తూ వుండవచ్చు.

ఆర్యులీ దేశానికి వచ్చినపుడు, ఈ పేరులు చెవుల్లో పడినంతనే, ఆ శబ్దాలను సంస్కృతీకరించి, 'రక్షో రాక్షసులు'గా చేశారు. ఇంతవరకూ ఎవ్వరూ విమర్శక దృష్టితో ఉపలక్షింపకుండా, ఆ కారణంతో, ప్రాముఖ్యాన్ని ఈయకుండా వున్న 'కాకాసుర వధ' కథ, రామాయణ యుద్ధానికి మూలబీజం కాకపోయినా దానికి బాగా దోహదం చేసిందని చెపితే, ఎంతో ఆశ్చర్యం పుట్టకుండా వుండదు.

ఆర్యులకు గోవులెంత పూజనీయంగా వుంటాయో కోయలకు మాత్రమేగాక, ద్రావిడులందరికీ కాకులు పూజనీయాలుగా పరిగణింపబడుతూ వుండేవి.

ద్రావిడ లోకంలో ఈనాటికీ, అంత్య కర్మలలో పితరులు కాకుల రూపంలో వుంటారనే మూఢ విశ్వాసంతో పిండప్రదానం చేస్తూ వుంటారు. శ్రీరాముడికీ సంగతి సమూలంగా తెలిసే, హిందువులతో పోరాడటానికి మహమ్మదీయులు గోవధ చేసినట్టు - ద్రావిడులతో కలహించాలని తలచి, కాకిని చంపి, ద్రావిడుల కోపాగ్నిని మండింపజేశాడు.

కాకిని చంపిన రాముడు, కాకాసురుణ్ణి చంపాడని, అది సీత స్తనాల మీద నున్న చీర భాగాన్ని తొలగించి ముక్కుతో ఆమె పాలిండ్లను పొడిచెననియు కట్టు కథ కల్పించి, వాల్మీకి ఆర్య ప్రపంచంలో కీర్తిని సంపాదించాడు.

# రావణుడు

వేదవేత్త, బ్రహ్మజ్ఞాని, మహాభక్తుడు, సుందరాకారుడు, అతుల రాజనీతి మర్మజ్ఞుడు, మహాకవి, భ్రాతృప్రియుడు, జాత్యుద్ధారకుడు, వివేకి, తెలుగు వైయాకరణుడు.

వేదవేత్త: ఈ విషయం శంబుక వధ పీఠికలో చర్చించాం. రావణ భట్టీయం దీనికి నిదర్శనం.

బ్రహ్మజ్ఞాని: రావణ వధచే, రాముణ్ణి బ్రహ్మహత్యా పాతకం పీడించడమే నిదర్శనం.

మహాభక్తుడు: నవ కోటి శివాలయార్చకుడని లోకానికి తెలుసు తన వంతు కానుకగా శంకరుడికర్పించిన భక్తుడు.

మహా వీరుడు - దీనికి రామాయణమే సాక్షి - నూరేళ్ళు దాటిన వాడయ్యు-ఏడహోరాత్రాలు విశ్రాంతి లేకుండా యౌవన గర్వితుడైన రామునితో మహాయుద్ధం చేశాడు.

సుందరాకారుడు: రామాయణంలోని హనుమంతుడి వచనాలే సాక్షి.

రాజనీతిజ్ఞుడు: యుద్ధ కాండంలో వాల్మీకి ముని ఈయన రాజనీతిని గూర్చి చెప్పిన పల్కులే సాక్షి.

మహాకవి: రావణ భుజంగ ప్రయాతాలు. పంచ చామరాలు అనే పేరుతో కొన్ని శ్లోకాలు ఇప్పటికీ ప్రచారంలో వున్నాయి. శివదర్శన కాలంలో వీర శైవులు, ఈ భుజంగ ప్రయాత పంచ చామరాలతోనే, భుజంగ భూషణుడికి చామరాలు వేస్తారు.

భ్రాతృ ప్రియుడు : రాజద్రోహి అయిన విభీషణుడు, రాజ్యకాంక్షచే జాతి విరోధి అయిన రాముడి పాదపద్మాలను బట్టి శత్రు స్కంధావారాన్ని చేరినప్పటికీ, లంకలో వున్న అతని కుటుంబాన్ని (భార్య - అయిన సరమను, కూతురైన త్రిజటను) పల్లెత్తు మాట కూడా అనకుండా కాపాడాడు. ఈ సోదర ప్రేమే ఈతణ్ణి కూకటివేళ్ళతో పెకలించి పారేసింది. సరమ - అంగదుడికి పాతాళ హోమం చేస్తున్న రావణుణ్ణి చూపించింది. లంకలోని గుప్తి కర్మమును సీతకు తెలియజేసింది. విభీషణుడి కూతురైన త్రిజట - ఎప్పటి కప్పుడు, లంక గుట్టంతా సీత చెవిలో వేసేది.

దాని ఫలితం - రావణుడి పరాజయం, లంకా పట్టణం నాశనం -

విభీషణుడి పట్టాభిషేకం.

వివేకి - రావణుడు బ్రహ్మ చేత వరాలను పొంది, పరివారంతో, విశ్రవసుడి ఆశ్రమ భూముల్లో వుంటే మాతామహుడైన సుమాలి కుమారుడయిన ప్రహస్తాదులతో అక్కడకు వచ్చి - 'కారణజన్ముడవు-' అని సంబోధించి, నీతులు చాలా చెప్పి, సవతి అన్నయైన కుబేరుణ్ణి లంక నుంచి పారదోలి, లంకా రాజ్యాన్ని ఆక్రమించుకొమ్మని చెప్పగా, ఎంతోసేపు, పాత తగాదాల గురించీ, రాక్షస వంశం పొందిన కడగండ్ల గురించీ - లంక - ఏ విధగా రాక్షసుల నివాస స్థానమో, దాని గురించీ, మాతామహుడు చెపితే గాని, లంకాపహరణానికి ఇష్టపడలేదు.

మొదటి తెలుగు వైయాకరణుడు = రావణ కారికలు, లక్షణగ్రంథాల్లో ఉదాహరణాలుగా ఈయబడి, అక్కడక్కడా కనిపిస్తున్నాయి.

కారణజన్ముడు జాత్యుద్ధారకుడు:

మాలి - సుమాలి - మాల్యవంతుడు, అనే ముగ్గురు రాక్షస నాయకులు, లంకా పట్టణాన్ని నివాసంగా చేసుకొని, దేవతలపై దండెత్తి చాలాసార్లు వాళ్ళను ఓడించి, పరాభూతుల్ని చేశారు.

ఈ నిరంతర పరాభవం చేత దేవతలు దిగులు చెంది, విష్ణువును ప్రార్థించారు. అతడు కూడా - 'సరే' అని నడుం గట్టుకొని, దేవతల పక్షమై యుద్ధానికి నడచి వచ్చాడు.

రెండు పక్షాలవాళ్ళకీ హోరాహోరీ యుద్ధం భయంకరంగా సాగింది. చివరకు ఈ దారుణ సంగ్రామంలో రాక్షసులు ఓడిపోయారు. మాలి వీర మరణం చెందాడు. చేసేదిలేక, సుమాలి, మాల్యవంతులు ఇద్దరూ సకుటుంబ పరివారంగా లంకా నగరాన్ని విడిచి పాతాళానికి పోయారు.

అక్కడున్నా గూడా వాళ్ళు సుఖానికి దూరమయ్యారు. రాత్రిపూట కంటిపై కునుకే యెరుగరు. పరాజయం వల్ల కలిగిన చింత వల్ల బాధపడి ఎట్లాగైనా, శత్రువుల్ని సంహరించే మార్గాలను వెదుకుతున్నారు.

సుమాలి కుమార్తెయైన కైకసి, రూపలావణ్యాలు కలదానిని జాత్యభిమాన పూర్ణ హృదయయుగుదానిని, ద్రావిడ సంప్రదాయాన్ని, సంపూర్ణంగా ఎరిగినదానిని, ద్రావిడాచారాలనన్నిటినీ బాగా తలకెక్కించుకొన్నదానిని – 'మహా తేజోవంతుడైన వీరాధివీరుడికిచ్చి, జాత్యుద్ధారకుణ్ణి పుట్టించి, దానివల్ల జాతికి సంభవించిన అవమానాన్ని తుడిచివేయాలని, సుమాలి – మాల్యవంతులు ఆలోచిస్తున్నారు.

తగిన వరుడి కోసం దేశ దేశాలు గాలించారు. చిట్టచివరకు తన కూతురుకు, విశ్రవసుడు తగినవాడని నిశ్చయించారు.

సాలంకృతంగా కైకసిని విశ్రవసుడికిచ్చి కన్యాదానం చేశారు. జాత్యుద్ధారకుడయిన పుత్రుణ్ణి పొందటం కోసం, ఋషిని భయభక్తులతో సేవించమని, తండ్రులు కైకసికి బోధించి పంపారు.

కొన్నాళ్ళకు కైకసి గర్భవతై, రూపలావణ్యాలు కలవాణ్ణి, తేజస్సు కలవాణ్ణి మొదటి సంతానంగా కన్నది. ఇతడే దశకంఠుడు (రావణుడు.)

సుమాలి, మాల్యవంతులు మనుమణ్ణి చూచి వుప్పొంగిపోయారు. ఈనాటికి అవమానాన్ని దాటే సమర్థులమయ్యామని అనుకొన్నారు. పెంచారు; పెద్దను చేశారు. విద్యాబుద్ధులు చెప్పించారు. నీతి శాస్త్ర పారంగతుణ్ణి చేశారు. రణకోవిదుణ్ణి చేశారు. జాత్యభిమానం ఉగ్గుపాలతోటే రంగరించి పోశారు. చెవినిల్లు గట్టుకొని నిత్యం జాతికి గల్గిన అవమానాన్ని చాటిచెప్పారు. ఫలితంగా ఇతడు లోక విజేతయై, లంక నుంచి యక్షుల్ని తోలి, దాన్ని స్వాధీనం చేసుకొని, కుల కళంకాన్ని తొలగించి, జాతి గౌరవాన్ని కాపాడాడు. తాతల కోర్కెను సంపూర్ణంగా తీర్చాడు.

పతనం చెందిన స్వజాతిని వుద్ధరించి, సమస్త లోకాలను తన కీర్తి చేత నింపివేశాడు.

రావణ కుంభకర్ణ –విభీషణుల భార్యల గూర్చి ఒకటి రెండు మాటలు చెప్పవలసి వుంది: రావణుడి భార్య మండోదరి. ఈమె అసుర శిల్పియయిన యముడి కూతురు. యముడికి, అచ్చర స్త్రీ అయిన 'హేమ' అనే ఆమె యందు మండోదరి పుట్టింది. అందుకని ఈమెలో సంపూర్ణంగా ద్రావిడత్వం కనిపించదు. భర్త అయిన రావణునికి ఎన్నోసార్లు నీతులు చెపుతూ, యుద్ధ విముఖుణ్ణి చేయటానికి ప్రయత్నించింది. విని, విని, రావణుడు –

"నీకు అదలిబన్నమే గతిని మానిని! ఈ గుదు సంధి చేసినన్" అని ఆమె మాటలను పెడ చెవిని పెట్టాడు.

కుంభకర్ణుడు - వజ్రజ్వాల- అనే ఆమెను పెళ్ళి చేసుకొన్నాడు. ఈమె వదాన్య శిరోమణి అయిన బలిచక్రవర్తి కూతురు బిడ్డ. కాబట్టే జాత్యభిమానానికి ఉనికిపట్టై. భర్తకు 'నీతి' - అనే నెపంతో ఎప్పుడూ అడ్డు చెప్పలేదు.

విభీషణుడు - 'సరమ' - అనే ఆమెను పెళ్ళిచేసుకొన్నాడు. ఈమె గంధర్వ స్త్రీ. అందుకనే, ద్రావిడ జాత్యభిమానం కించిత్తు కూడా లేకుండా భర్తను రాజద్రోహిగా చేసి, యింటిగుట్టు విరోధులకు తెలియజేసి, సర్వనాశనం చేసింది.

సరమ మూలాన విభీషణుడి కుటుంబమంతా, రాజ్యకాంక్షతో పీడింపబడి, రాజ ద్రోహపూరితమై, లంకను రాముడికి కట్టబెట్టి, జాతి ద్రోహం కావించింది.

ద్రావిడ జాతియే దుర్గతి పాలయినను, లెక్కచేయక, తన భర్తను రాజును చేయుట వొకటే, ఆమె మనసునందుంచుకొని, మిక్కిలి హేయమైన కార్యం చేసింది.

వంశపారంపర్యంగా వచ్చే, పక్షపాత కథలను వదలి, కొంచెం విమర్శనా దృష్టిని కలిగించుకొని, ఈ పీఠిక జాగరూకులై చదవాలని, చదువరులను మరీ మరీ ప్రార్థిస్తూ ముగిస్తున్నాం.

**వచన సూత పురాణం మొదటి భాగం సమాప్తం**

Sootha Puranam-1

## కవిరాజు

కవిరాజు కవి. పండితుడు. సంస్కర్త. హేతువాది. చదువు, జ్ఞానం, విజ్ఞానం ఒక కులం గుత్త హక్కులు కావని వాటిని ఆర్జించే హక్కు ప్రతి ఒక్కరికీ జన్మహక్కనీ చాటిచెప్పిన ఆద్యుల్లో ఒకరు. బ్రాహ్మణేతరుల్లో ఆత్మగౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని నింపిన దార్శనికుడు. దక్షిణాదిన బ్రాహ్మణేతర ఉద్యమ తొలి నాయకుల్లో ఒకరు. మూఢనమ్మకాలపైన కత్తులు దూసిన వీరుడు. బౌద్ధిక ప్రపంచాన్ని ఏలుతున్న ఆనాటి పెత్తందార్లను ప్రశ్నించి ఎదిరించిన ఏకవీరుడు. తన భావాలబాటలో తన పయనాన్ని ఒంటరిగా ప్రారంభించి దానిని ఒక ఉద్యమంగా మలిచిన మహానిర్మాత. తెలుగునాట త్రిపురనేని నిర్వహించిన చారిత్రిక పాత్రను ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. సమాజంపై ఆయన కలిగించిన ప్రభావాన్ని ఎంత కుదించినా అపారంగానే ఉంది. ఇది వచన సూతపురాణం. దీనిని వచనంగా మార్చినవారు నాస్తిక ఉద్యమనేత కీ.శే. బి. రామకృష్ణగారు. రామకృష్ణగారు తన జీవితపర్యంతం తను నమ్మిన ఉద్యమానికి కట్టుబడే ఉన్నారు.